# భారతి

## సాహిత్య మాసపత్రిక



## నవంబరు
## 1981
## నుంచి
## వెలువడుతోంది



**విడి ప్రతి వెల రు. 4 లు**

కాపీ ముందుగా రిజర్వు చేసుకోండి.



లోకంపోకడ * డూశిమెన











**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]

శుక్రవారం : 20—11—'81
దుర్మతి నామ సం కార్తీక బ నః
**సంపుటము 75 : సంచిక**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 67
ఆరు మాసాల చందా రు. 3
విడిప్రతి వెల రు. 1—25

**ఆంధ్రపత్రిక కార్యా**
గాంధీనగరం, విజయువా


# విషయాను


ముఖచిత్ర
"చిన్నారి విరి
సిరులిచ్చే చిర
(ఫొటో : శ్రీమ

**కథలు :**
వర్షిల్లండి! వ
ప్రేమంటే.
మనిషి వ
పిలు
యు

**సిం**
జీవి
కో

**వ్యా**
లోకం
ఫాలో
బా
సిని




## ముఖచిత్రం

23. 10.81వ తేదీ వారపత్రిక మాధవి ముఖ చిత్రం కలర్ ప్రింటింగ్ అనన్య సామాన్యం.

సి. ఎస్. మురళీకృష్ణ [నాయుడుపేట]

* * *

ఈవారం మాధవి ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉండి ప్రేక్షకులహృదయాలను దోచుకొనేలా ఉంది.

వాసిర్ హుస్సేన్, దేవిప్రసాద్ [బళ్ళారి]

## సీరియల్

ఈ మధ్య కాలంలో వచ్చిన చక్కటి సీరియల్ కథలలో సాగర మథనం ఒకటి. రచయిత్రి సుధ పాత్రకి ప్రాముఖ్యత ఇవ్వాలనిప్రయత్నించినా కవిత పాఠకుల హృదయాల్ని చూరగొంటుందనటలో సందేహం లేదు. స్నేహానికి, ఆత్మీయతకూ ప్రతిబింబాలు శంకరం, సుగుణ, సరళాదేవి. ఒక చక్కని సినిమా చూసినట్లనిపించింది, సీరియల్ పూర్తిగా చదివిన తర్వాత. నవ రచయిత్రి ఉమాదేవిగారికి అభివందనములు.

డాక్టర్ యు. వసుంధర (కలకత్తా)

* * *

మాధవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక అత్యంత ఆకర్షణీయంగా ఉంది. నర్సింగ్‌హోం సీరియల్ చాలా బాగుంది. ఎన్నో తెలియని విషయాలు, తెలుసుకొన్నాము. రచయితకు నా ధన్యవాదాలు.

ఎం. జానకీమాధవ్ (ఆదోని)

* * *

మా అభిమాన పత్రికలో వెలువడుతున్న 'నర్సింగ్ హోమ్' సీరియల్ చాల రసవత్తరంగా ఉంది. డాక్టర్లను గురించి చాల చక్కగా వివరించారు రచయిత శ్రీరంగంగారు. ప్రతి వారం సరికొత్త మలుపులతో పాటు పాఠకులకు విజ్ఞానాన్ని కూడా అందిస్తోంది.

యాడికి లావణ్యలత (పెండేకల్)

సాగర మథనం సీరియల్ పాఠకులనుఉత్సాహపరచినా, లోటు మాత్రం కనపడుతున్నది. రవీంద్రను, సుధను కలిపి కథను సుఖాంతం చేసినట్లె కవిత విషయాన్ని రచయిత్రి దృష్టిలో ఉంచుకొంటే సీరియల్ ప్రేక్షకుల హృదయాలలో చెరగని ముద్ర వేసి ఉండేది.

ద్విభాష్యం కామేష్ (మొగల్తూరు)

* * *

23.10.81 ఆంధ్ర సచిత్ర వార పత్రిక మాధవి ముఖ చిత్రంతోఎంతో ఆకర్షణీయంగా ఉన్నది. సాగర మథనం సీరియల్ అప్పుడే అయిపోయిందా అని అనిపించేటట్లుగా ఉంది. పెద్ద కథ నోసత్యం కథ బాగుంది. నర్సింగ్ హోమ్ సీరియల్ కొంచెం బోర్ గా ఉంది.

కె. ఉమామహేశ్వరీదేవి, (బెసవారిపేట)

* * *

23.10.81నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖ చిత్రం మాధవి మమ్మల్ని ఎంతో ఆకట్టుకుంది. సాగర మథనం సీరియల్ ముగింపు చాల బాగుంది. రచయిత్రికి మా అభినందనలు.

ఒ జార్ మోహన్‌గౌడ్, సంతోష్ కుమార్ శర్మ, సుహాసిని, శశిరేఖ (ఇల్లెందు)

* * *

సాగర మథనం ముగింపు కొంత నిరాశాజనకంగా ఉంది. కథలో కొత్తదనం లేకపోయినా ఎనిమిదివారాలపాటు హాయిగా చదువుకునేలాచేసింది. ఉమాదేవిగారి రచనా విధానానికివే మా జోహార్లు!

శిల్ప, పుష్ప (విశాఖపట్నం)

23.10.81 ఆంధ్ర సచిత్ర వార పత్రిక మాధవి ముఖ చిత్రంతోఆకర్షణీయంగా చాలా బావుంది. సాగర మథనం సీరియల్ ఇంత త్వరగా సమాప్తం అవుతుందనుకోలేదు. నర్సింగ్‌హోమ్ చాలా ఇంట్రస్టింగ్‌గా ఉంది.

బి. రాజేశ్వరరావు (మధ్యప్రదేశ్)

## కథలు

23.10.81 సంచికలో మహమ్మద్ మహబూబ్ ఆలిగారు వ్రాసినకథ పాపారావు పై పన్నా చాలా బాగున్నది. కొంచెం అందంగా ఉన్న ఆడపిల్లల వెంటబడే బలహీనులకు గుణపాఠం.

జనగావరపు అలరాజు [పెన్నాడ]

* * *

23.10.81వ తేదీ మాధవి ముఖ చిత్రంతో వెలువడిన పత్రికలో డా. రాధాకృష్ణగారి కథ దొంగ చదివాను. పీతాంబరం పాత్రను నన్ను చూసే రచయిత వ్రాశారా? అని అనుమానం వచ్చింది. నిజంగా ఆ కథ చదివి నేను భుజాలు తడుముకున్నానంటే నమ్మండి!

నాద్ బాబు [సునాబేడ]

* * *

నటి మాధవి ముఖ చిత్రంతో వెలువడిన ఈ వారం పత్రిక బాగాఆకట్టుకోగల్గింది. ఈసారి మీరు ప్రచురించిన మూడు కథలలో దొంగ కథ నాకు నచ్చింది.

అనితాసాకరే [ఆదోని]

* * *

23.10.81 తేదీనాటి మాధవి ముఖచిత్రం అత్యంతాకర్షణీయంగా ఉంది. ఈ వారం కథలు చాలా బాగున్నాయి. ముఖ్యముగా దొంగ మతిమరుపు వల్ల ఎంత అనుమానానికైనా దారి తీస్తుందని తెలిపే కథ. రచయితకి మా కృతజ్ఞతలు.

తోట శోభన్ బాబు [ఖరగ్‌పూర్]

* * *

23.10.81 నాటి సంచిక మీది నటి మాధవి ముఖ చిత్రం చాలా బావుంది. ఈ సంచికలోని దొంగ కథ చాలా సిల్లీగా ఉంది.

కె. నాగేష్ [బళ్ళారి]

* * *

23.10.81 సంచిక ముఖ చిత్రంపై మాధవి అందంగా ఉన్నది. దొంగ కథద్వారా రచయిత ఏం చెప్పదల్చుకున్నారో అర్థం కాలేదు.

బి. రవీందర్ రెడ్డి [వడ్లూర్ బేగంపేట]

* * *

నటి మాధవి ముఖచిత్రం సెక్సీగా ఉన్నప్పటికీ ముఖ కవళికల్లో ఏదో కళ కొట్టొచ్చినట్టు కనిపించింది. పాపారావు పై పన్నా కథ చదివి ఎంతో తృప్తిచెందాను. ఎన్నిమార్లు చదివినా మళ్లీ చదువుతూ ఉండాలనిపించింది.

కందిగట్ల ప్రభాకర్ [జనగామ]

త్వరలో ప్రారంభం!

# కొత్త సీరియల్

# "తార"

రచన: శ్రీమతి హజరా

# ఫాలాక్షుని డైరీ

## సెక్సామీటర్ !

స్త్రీ శరీరం గర్భధారణకు అనుకూలంగా ఉన్నదా లేదా అనే విషయం సునాయాసంగా కనిపెట్టే వో బుల్లి మీటరును బ్రిటిష్ మెడికల్ రిసర్చి ఇనిస్టిట్యూట్‌లోని కొందరు మేధావులు డాక్టరు హెయింజు వుల్ఫ్ అనే ఆయన నాయకత్వంలో కనిపెట్టారట. ఉదయం నిద్రలేవగానే ఈ మీటరును థర్మామీటరులా నోట్లో పెట్టుకుంటే, ఆ స్త్రీ శరీరం ఆనాడు గర్భధారణకు అనుకూలంగా ఉంటే ఆ మీటరులోని వో పచ్చలైటు వెలుగుతుందట. ఈ మీటరుకు ముద్దుగా సెక్సామీటరు అని పేరు పెట్టారట.

## అబ్బాయిగా మారిన అమ్మాయి

మధ్యప్రదేశ్‌కు చెందిన డాక్టర్ సయ్యద్ జహీర్ ఉల్ ఇస్లాం అనే ఆయన 16 ఏళ్ల ఫరదా అనే వివాహితకు కించిత్తు ప్లాస్టిక్ సర్జరీ చేసి ఆమెను అబ్బాయిగా రూపొందించారట. ఆమెకు పెళ్లయి ఒక ఏడాదయిందట. యింకా కాపురానికి వెళ్లనేలేదట. ఆమె తనలో ఏదో తేడాలూ, మార్పులూ వస్తున్నట్లు అనుమానించి ఆయన వద్దకు వెళ్లిందట. ఈ డాక్టర్‌గారు తాను పదేళ్ల క్రింద 13 ఏళ్ల అమ్మాయిని యిలాగే మగవాణ్ణి చేసినట్లు, అతనీనాడు పోలీసుశాఖలో ఉద్యోగం చేసుకుని, పెళ్లాం బిడ్డలను హాయిగా చూసుకుంటున్నట్లూ ప్రకటించారట. ఆడపిల్లలెక్కువమందున్న తలిదండ్రులకీ డాక్టరుగారో వరమా?

## ఆత్మహత్యలో రాజకీయం !

మద్రాసు చిట్టేరికి చెందిన 36 ఏళ్ల గనేశన్ అనే అతని భార్య 30 ఏళ్ల సేరి మొన్న 28వ తేదీన చీరమీద కిరసనాయిలు పోసుకొని, నిప్పంటించుకుని చనిపోయిందట. పోలీసుల విచారణలో ఆమె భర్త గనేశన్ త్రాగుబోతనీ, రోజూ ఆమెను నిర్దాక్షిణ్యంగా కొట్టి చంపేవాడనీ, డబ్బు కోసం వేపించుకు తినేవాడనీ, ఆ ప్రత్యక్ష నరకం అనుభవించలేక నాలుగోనెల గర్భిణి అయిన ఆమె యింత దారుణం చేసిందని తెలిసిందట. ఈ వార్త అన్యాయమైన వార్త అనీ, ఆ చనిపోయినామె ద్రవిడమున్నేట్ర కజగం పార్టీకి చెందినదనీ, ఆ పార్టీ ప్రెసిడెంటు కరుణానిధిని తమిళనాడు ప్రభుత్వం అన్యాయంగా అరెస్టు చేయడంవల్ల మనస్సువిరిగి, ఆమె యీ దారుణానికి పాల్పడిందని, ఆ పార్టీకి చెందిన ప్రముఖులలో ముఖ్యుడు అన్బళగన్ వాపోయారట.

## రహస్య ప్రేమికుని దురాగతం !

1980 జూన్ 15 పొద్దున్న కలకత్తా భారానగర్ అజయ్‌పార వీధికి చెందిన వో భవనంలోని వో అంతస్తులో వో అందమైన అమ్మాయి శవం భయంకరంగా, అతిదారుణంగా, అర్ధనగ్నంగా, రక్తపుమడుగు మధ్య పడుండడం ఆ యింటి పనివాడు కాలూఘోష్ చూశాడట. ఆమె ఎవరో, ఎందుకక్కడుంటోందో ఎవరికి తెలియదు ప్రతి శనివారం రాత్రి వో డాడ్జికారు మాత్రం వస్తూంటుందటక్కడికి, అందులోంచి వో వ్యక్తి ముఖానికి జేబురుమాలు అడ్డం పెట్టుకుని దిగి యింట్లోకి వెళ్తాడట. ఈ విషయం పోలీసు ఆరాలు తీసి లాగింది అతని పేరు గోపాల్ బిశ్వాస్, ధనికుడేగాక, వ్యాపారవేత్త. ఆమె అతని మేనమామ కూతురట. ఆమె పేరు లేఖ అతనామెను అతిరహస్యంగా ఉంచుకుని, మిటారి అనేమారుపేర పెట్టి ఆ భవనంలో అద్దెకుంచాడు. లేఖ చక్కని యవ్వనంలో ఉంది. పనివాడు కాలు ఘోష్ కొడుకు అనిల్‌ఘోష్ చక్కని యువకుడు. అతనితో పరిచయమయింది. వారిద్దరికీ రహస్య ప్రేమాయణం. అడపాతడపా ఆమె అతనికి డబ్బిస్తూ వుండేది. గోపాల్ బిశ్వాస్ ఆదాయపుపన్ను ఎక్సయిజుశాఖ వారికి భయపడి, వో 30 వేల రూపాయిలు, కొన్ని బంగారు నగలూ తెచ్చి లేఖ యింట్లో దాచటం కాలుఘోష్ చూసి తనకొడుకును ప్రేరేపించాడు. ఆ కుర్రాడు యిల్లు సోదా చేస్తుండగా లేఖ చూసి అతనిమీద ఆగ్రహంతో పొమ్మన్నది. అనిల్ నిగ్రహించుకుని, క్షమార్పణకోరి, ఆమెను దువ్వి, ప్రేరేపించాడు. ఆమె అతనికి లొంగి పోయింది. అనిల్ ఆమెను చక్కగా అనుభవించి, వెంటనేపరుపు క్రింద దాచిన కత్తితో మెరుపువేగాన్న ఆమె పొత్తి కడుపులో ఒక్కపోటు పొడిచి, చీలుస్తూ కత్తిలాగాడ అంతే! ఆమె కిక్కురుమనకుండా చనిపోయింది. అతనా డబ్బూ, నగలూ ఎత్తుకు పారిపోయాడు.

> ## వింత!
>
> సినిమా ఒక కల్పన
> జీవితమే వాస్తవం
> కాని –
> సినిమాలాంటి బ్రతుకు కోసం
> కలలు కంటాడు మనిషి
> జీవితానికి దగ్గరగా ఉండాలని
> ప్రయత్నించి తీస్తారు సినిమా
>
> – పరాగిత్

## రైల్వేస్టేషన్‌లో బలాత్కారం !

ఒరో తేదీ ఉదయం ఆరు గంటలకు 18 ఏళ్ల ఆంథోనియమ్మ అనే అమ్మాయి మద్రాసు అయినావరం నుంచి సైదాపేటకు ఎలక్ట్రిక్ రైలులో వచ్చి దిగిందట ఆ టయిములో స్టేషను దాదాపు నిర్మానుష్యంగా ఉన్నదట ఆమెను వంటరిగాచూసిన 22 ఏళ్ల కాళియప్పన్ అనే వో కుర్రాడు మెల్లిగా పక్కకుచేరి నిలబడి, ఆమెకు కత్తిచూపి, తనకాముదాహం తీర్చకపోతే చంపుతానన్నాడట అంటూనే ఆమె రెయ్య పుచ్చుకుని లాగపోయేసరికామె అతనిచెయ్యి కొరికి పారిపోయి బయటికొచ్చిందట. అతను కూడాబడి, పట్టుకుని, ఇదేమని అడ్డొచ్చిన వారికి తనభార్య అనిచెప్పి, స్టేషనువెనకపక్కకు తీసుకుపోయి ఆమెను బలాత్కారంగా అనుభవించి, తనను పట్టుకోడానికి వచ్చిన పోలీసులమీద రాళ్లురువ్వి, ఒక పోలీసును కత్తితో పొడిచి, చివరికి పెనుగులాడి, లొంగిపోయాడట.

పండక్కి పందార ప్రత్యేక కోటా వచ్చిందిట్గా కార్డుకి ఎంత ఎక్కువిస్తున్నారు?

చౌకధరల దుకాణము

యాభై గ్రాములు అండి!

బియ్యం ×
గోధుమలు
పంచదార
రవ్వ ×
పిండి ×
మైదా ×
కిరసనాయిలు

### రచయితలకు మనవి

స్థానికంగా వున్న రచయితలు, కార్టూనిస్టులు కూడా మా కార్యాలయానికి వచ్చి వారి రచన అందజేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం —సం.



"...కాబట్టి... కార్మిక సోదరులారా! కర్మాగారాల్లో పనిచేసినా, కార్యాలయాల్లో పనిచేసినా, పంటచేలలో పనిచేసినా మనమంతా ఒక్కటే! మనమంతా కార్మికులమే! అసలు కార్మికుడంటే ఎవరు? తన రక్తాన్ని ఈ పెట్టుబడిదారి వ్యవస్థకు ధార పోసే త్యాగమూర్తి! నేడు ఇలాంటి ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికుడు తన కష్టానికి తగిన ప్రతిఫలం పొందటం లేదు! సంవత్సరమంతా కష్టపడేది మనం! లక్షలకు లక్షలు లాభాలు పొందేది యాజమాన్యం. మీకు కనీసఅవసరాలు కూడా ఏర్పాటు చేయటంలేదు యజమానులు. బోనస్ లేదు. వైద్య సౌకర్యాలు లేవు. భీమా పథకాలు లేవు!... ఇలా చెప్పుకు పోతుంటే విన్నో సమస్యలు మన ముందున్నాయి వీటి నన్నిటినీ పరిష్కరించుకోటానికి మనకు కార్మిక సంఘాలు కావాలి!

కామ్రేడ్స్! ఇంతకాలానికి మీరు కార్మిక సంఘాల ప్రాముఖ్యతను గుర్తించి కొత్తగా కార్మిక సంఘాన్ని ఏర్పాటు చేసుకొన్న సందర్భంలో మీ ఫ్యాక్టరీ వర్కర్స్ అందరికీ నా శుభాకాంక్షలు అందజేస్తున్నాను. మీకేదైనా కష్టం వస్తే మిమ్మల్ని ఆదుకోటానికి మన టౌన్లో వున్న కార్మిక సంఘాలన్నీ మీముందు నిలుస్తాయని నేను హామీ యిస్తున్నాను ఈ నాటి కార్యక్రమానికి నన్ను అధ్యక్షునిగా చేసి నన్ను గౌరవించి నందుకు నా కృతజ్ఞతలు తెల్పుకొంటున్నాను, సెలవ్!..." గంభీరమైన కంఠంతో సుదీర్ఘమైన ఉపన్యాసాన్నిచ్చి కుర్చీలో కూర్చున్నాడు కామ్రేడ్ వినాయకరావ్.

ఆ నాటి కార్మిక సభ ముగియగానే వినాయకరావ్ తన స్కూటర్‌మీద యింటికి బయల్దేరాడు.

వినాయకరావ్ అంటే ఆ వూళ్ళో తెలియని వాళ్ళు లేరు. ఖద్దరు చొక్కా, హేండ్‌లూమ్ పాంటు అతని వస్త్రధారణ. గోల్డ్‌ఫ్లాక్ సిగరెట్ పెట్టె, అగ్గిపెట్టె అతని హస్తధారణ. ముఖానికి గోల్డ్ ఫ్రేమ్ కళ్ళజోడు, మెళ్ళో గోల్డ్ చైన్, చేతికి ఖరీదైన విదేశీ వాచీ అతను ఏర్పాటు చేసుకొన్న ఆభరణాలయితే, పెదవులపై చిరు దరహాసం, కళ్ళల్లో గాంభీర్యం దేవుడిచ్చిన ఆభరణాలు!

ఆరడుగుల ఎత్తు, ఎత్తుకు తగిన లావు, నిగనిగలాడే దబ్బపండు లాంటి దేహ ఛాయ వుండటం చేత ఎలాటి వాళ్ళనైనా యిట్టే



ఆకర్షిస్తాడు రూపానికి తగినట్లుగా తెలివి తేటలు, వాక్చాతుర్యం వుండటం అతని అదృష్టం! అయితే అతని తెలివి తేటలు చదువులో మాత్రం పనికిరాలేదు. కాలేజీ గుమ్మంలో అడుగు పెట్టకుండానే చదువుకు స్వస్తి చెప్పాడు. మెట్రిక్ పూర్తి కాగానే కొడుక్కి వుద్యోగం వెతకడం ప్రారంభించారు వినాయకరావ్ తండ్రి ఉపేంద్రరావ్. నిజానికి అతనికి వుద్యోగం చేయాల్సిన అవసరం లేదు, పాతిక ఎకరాల మాగాణి భూమి వుంది. కాని తమ రైతు కుటుంబంలో ఒక్కడిచేతనైనా వుద్యోగం చేయించాలనే కోరిక ఉపేంద్రరావ్‌కు విపరీతంగానే వుంది. దానికి తోడు చుట్టుప్రక్కల వూళ్లకు కేంద్రంగా వున్న వాళ్ల వూళ్లో ఓ బ్యాంకువాళ్లు ఓ శాఖను తెరవాలనుకొన్నారు. మోతుబరి రైతుకావడం చేతను, పలుకుబడి వుండటం చేతను ఉపేంద్రరావ్ డిపాజిట్లు సంపాదించటంలో బ్యాంకుకు బాగా సహాయ పడ్డాడు. తత్ఫలితంగా వినాయకరావ్ బ్యాంకు వుద్యోగి అయ్యాడు

పది సంవత్సరాలపాటు ఉద్యోగరీత్యా ఆ వూరు ఈవూరు తిరిగి చివరకు తమవూరికి దగ్గర్లోనే వున్న టౌన్లో స్థిరపడ్డాడు వినాయకరావ్. స్వంత ఇంటిని కట్టుకున్నాడు. తన వ్యక్తిత్వంతో పాటు పలుకుబడిని కూడా ఎంతో పెంచుకుని ఓ పెద్ద ట్రేడ్‌యూనియన్ లీడర్‌గా మారాడు. ఆ టౌన్లో ట్రేడ్ యూనియన్ మీటింగ్ ఎక్కడ జరిగినా వినాయకరావ్ అధ్యక్ష స్థానంలోనో, వక్త స్థానంలోనో వుండి తీరుతాడు.

స్కూటర్ ఇంటిముందాగగానే హారన్ కొట్టాడు. తల్లి వచ్చి గేటు తెరిస్తే లోపలికి వెళ్లాడు.

"వనజ వాళ్లు రాలేదా?" అని అడిగాడు తల్లి ఇచ్చిన కాఫీ త్రాగుతూ.

"అక్కడింకా పని పూర్తయి వుండదు. మీ మామగారు వెంటనే ధాన్యం పంపించటానికి ఇష్టపడలేదేమో?" అంది తల్లి

"ఆ రాక్షసుడు ఇలా చేస్తాడనుకోలేదు!" కోపంగా అన్నాడు వినాయకరావ్.

"నీ పెళ్లి కుదిరినప్పుడే చెప్పాను మీనాన్నగారికి! కట్నం కింద పొలం తీసుకోకండిడబ్బు తీసుకోండని. మీ నాన్నగారు నా మాట వింటేగా! బావగారు కోడలికిచ్చిన పొలం తనే స్వయంగా పండించి ఏటా అరవై బస్తాలకు కట్టుబడి యిస్తానని ఒప్పుకొన్నారనిచెప్పారు" నిష్ఠూరంగా పల్కింది తల్లి.

"మొదటి మూడేళ్లు అనుకొన్నప్రకారమే ధాన్యం తోలాడు, ఎటొచ్చి రెండో కూతురి పెళ్లయ్యాక అతని పద్ధతి మారిపోయింది"

"అయితే ఈ సంవత్సరం ధాన్యం యిస్తాడంటావా?" అనుమానంగా అడిగింది తల్లి.

"అందుకేగా వనజను పంపింది! పాత బాకీలతో సహా ధాన్యం లారీకి ఎత్తనిదే రావద్దని చెప్పాను. అన్నట్టు నాన్నగారి దగ్గర్నుంచి వుత్తరం వచ్చిందా?"

# ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్

# 'ఇంటింటా స్వంత గ్రంథాలయం ప్రణాళిక!

## 120 రూ॥ల కట్టి 175 రూ॥ల విలువ పుస్తకాలు పొందే చక్కని సదుపాయం

## గృహిణులకు, గ్రామవాసులకు, ప్రవాసాంధ్రులకు, పుస్తక ప్రియులకు వరప్రసాదం!

ఇందులో చేరటానికి 6రూ॥ల డిపాజిట్ కట్టాలి దానితోపాటు పక్క పేజీలో యిచ్చిన కూపను పూర్తి చేసి పంపాలి!



మీ డిపాజిట్ అందగానే చందా నెంబరు యిస్తూ, ఓ కేటలాగు, మీరు కూపనులో గుర్తు చేసిన పుస్తకం రూ 10లకి వి పి పెట్టి పంపిస్తాము ఆ పుస్తకం ఖరీదు రూ 15లు కానీ అది రూ 10లకే మీకు పంపుతాము అంటే చేరగానే 33⅓% **లాభం** అన్నమాట!



**కానీ... ఈ సదుపాయం- 15-12-1981 లోపు** చందాదారులుగా చేరిన వారికి **మాత్రమే!** ఆ తరువాత చేరిన వారు డిపాజిట్ 6 రూ॥లు కాక, అదనంగా మరో 5 రూ॥లు పంపాలి అంటే-11 రూ॥లు M O చేయాలి!

ఆ వి పి విడిపించుకున్నాక మీరు చందాదారులుగా చేరినట్టు లెక్క! ఆ తదుపరి నెలలో మీ మొదటి నెల చందా రూ 10 M O చేస్తూ, ఆ M O కూపనులోనే కేటలాగు నుంచి మీరు ఎన్నుకున్న పుస్తకాల నెంబర్లు, ఉచిత పుస్తకం నెంబరు వేసి పంపాలి!




ఆ M O అందిన తదుపరి నెల మొదటి వారంలో మీరు ఎన్నుకున్న పుస్తకాల లోంచి రూ **21·50** విలువ చేసేవి + 1 ఉచిత పుస్తకం (రూ 6 ఖరీదు చేసేది) రూ 10లకు వి.పి పెట్టి పంపిస్తాము



ఆ బంగీని విడిపించుకున్నాక మరుసటి నెలలో మళ్ళీ 10 రూ॥ల M.O చేస్తూ, ఆ M O కూపనులోనే మీకు కావలసిన పుస్తకాల నంబర్లు, ఉచిత పుస్తకం నెంబరు వేసి పంపాలి ఆ M O అందిన తదుపరి నెల మొదటి వారంలో మరలా రూ 21-50 + 1FB మీకు రూ 10లకు వి పి పెట్టి పంపిస్తాము

ఇదేవిధంగా మీ యిష్టం వచ్చినన్ని నెలలు చందా కడ్తూ పుస్తకాలు తెప్పించుకుంటూ ఉండవచ్చు! ఈ ప్రణాళికకి కాలపరిమితి లేదు కొత్త పుస్తకాల వివరాలు ఎప్పటికప్పుడు H L P మాస పత్రికలో ప్రకటిస్తూ వుంటాము అందులో నుండికూడా పుస్తకాలు ఎన్నిక చేసుకోవచ్చు!

ఇంకో సదుపాయం- మీరు మధ్యలో ఏ నెలైనా పుస్తకాలు తెప్పించుకో దలుచుకోకపోతే ఆ నెల M O చేయనక్కరలేదు మరలా మీ వీలున్నప్పుడు M O చేసి పుస్తకాలు తెప్పించుకోవచ్చు! అంతేకాదు- మీరు ఎప్పుడు కావాలంటే అప్పుడు మీ సభ్యత్వం రద్దు చేసుకుని మీరు కట్టిన డిపాజిట్ 6రూ వాపసు తీసుకోవచ్చు! కానీ కనీసం మీరు 120 రూ॥ల చందా కట్టి వుంటేనే డిపాజిట్ వాపసు యిస్తాము

ఈ ప్రణాళికలో చేరటం వల్ల లాభమేమిటంటారా? ప్రతి బంగీలో రూ 7·50 విలువకు అదనంగా పుస్తకాలు లభిస్తాయి. అంతేకాదు- మీరు కట్టే ప్రతి 120 రూ॥లకి రూ 165 విలువకి పుస్తకాలే కాక అదనంగా రూ 10 విలువ చేసే పుస్తకం లభిస్తూంటుంది!

CHANDRA

## 'ఇవన్నీ మీకు పైసా కూడా పోస్టు ఖర్చులు లేకుండా అందుతాయి!




## కాబట్టి- వెంటనే ఈ ప్రణాళికలో చేరి పఠనాభిలాషను పెంపొందించుకోండి. →

"ఉత్తరం రాలేదు కాని మనవూరి మాస్టారితో కబురు చేశారు నాట్లు యింకా మొదలు పెట లేదట. చుట్టుపక్కల కూలీలు దొరకడంలేదట సమయానికి నేను కూడా యిక్కడ వుండిపోయాను ఆయనక్కడ చాలా ఇబ్బందులు పడుతున్నారట! ఈ యేడు వ్యవసాయం ఎలా అవుతుందా అని ఆదుర్దా పడుతున్నారని మాష్టారు చెప్పారు!"

"మన పాలేరు నాగులు వున్నాడుగా? వ్యవసాయం బాధ్యతంతా వాడికి వదిలేస్తే బాగుండేదిగా?"

"ఇప్పుడు పాలేర్లు తోగడ లాంటి వాళ్ళు కాదురా? ఎంత అరిచినా పని చేయటంలేదు ఓ పది రోజులపాటు సెలవు పెట్టి ఆ నాట్లు వేయించిరారా!"

"అలాగే! రేపు గాని ఎల్లుండి గాని వెళ్తాను. నేనలా యూనియన్ ఆఫీసుకు వెళ్లొస్తాను. తలుపేసుకో!" అనేసి

## వర్ధిల్లండి! వర్ధిల్లండి!!

వినాయకరావ్ బయటకు వెళ్ళి స్కూటర్ స్టార్ట్ చేశాడు

* * *

మర్నాడు మధ్యాహ్నం పన్నెండు గంటల సమయంలో హడావుడిగా బ్యాంకుకు వెళ్ళాడు వినాయకరావ్

కుర్చీలో కూర్చోగానే మెసెంజర్ అప్పలస్వామి పరుగు పరుగున వచ్చి 'మేనేజరు గారు తమరి గురించి యిప్పటికి మూడు తడవలు అడిగారు తమరు రాగానే ఆయన గారిని కలవమని చెప్పారు!" అన్నాడు.

"ఈ కొత్త మేనేజర్‌కు పనీ పాటా లేదులా వుంది!" అని గొణుక్కుంటూ చాంబర్లోకి వెళ్ళాడు వినాయక రావ్

"ఎందుకో పిల్చారట?" కుర్చీలో కూర్చుంటూ అడిగాడు.

"ఎంతసేపయింది వచ్చి?" ప్రశ్నించాడు మేనేజర్ కుమారస్వామి.

"ఇప్పుడే!"

"ఇప్పుడు టైమెంతయింది?"

వాచీ చూసుకొంటూ అడిగాడు కుమారస్వామి.

## వర్ధిల్లండి! వర్ధిల్లండి!!

"మీ వాచీ పని చేయటంలేదా ?" వినాయకరావ్ వెంటనే ప్రశ్నించాడు.

"మీ వాచీ పని చేయటం లేదని నా అనుమానం! బ్యాంక్ పది గంటల కయితే పన్నెండు గంటలకు రావటంలో మీ వుద్దేశ్యం ..."

"అది నా అలవాటు!"

"ఇక ముందు మీరు మార్చుకోవాలి!"

"ఇలాంటి సలహా లోగడ మేనేజర్లు నాకివ్వలేదు!"

"కావచ్చు! కాని బ్యాంకు శ్రేయస్సు దృష్ట్యా మీకీ సలహా యివ్వక తప్పటం లేదు!"

"బ్యాంకు శ్రేయస్సును కోరేది మేనేజర్లు మాత్రమే కాదు! ఎంప్లాయీస్ కూడా బ్యాంకు శ్రేయస్సునే కోర్తారు. ఈ విషయం మీరు గుర్తించాలి!"

"ఆ విషయం తెల్సి వుండి కూడా బ్యాంకుకు ఆలస్యంగా వస్తున్నారన్నమాట!"

"నా విషయం వదిలేయండి! మిగిలిన వాళ్లంతా వేళకే ఆఫీసుకు వస్తున్నారుగా!"

"మీ విషయం ఎందుకు వదలాలి?"

"వాళ్ళకు నాకు తేడా లేదా?"

"ఏ విషయంలో?"

"మీకు తెలియదా?"

"చెప్పండి!"

"నేను ట్రేడ్ యూనియన్ లీడర్ని!"

"అయితే ఆలస్యంగా రావటానికి దానికి సంబంధం ఏముంది?"

"చాలా వుంది. మాకు టవున్లో చాలా ట్రేడ్ యూనియన్స్ వున్నాయి. మా కుండే సమస్యలు మాకుంటాయి వాటిని ఎటెండ్ కావాల్సిన బాధ్యత మా మీద వుంది"

"ఆఫీసు పని చేయాల్సిన బాధ్యత మీ మీద లేదన్నమాట?"

"మీరెలా అనుకొన్నా ఫర్వాలేదు. మీకే ఇబ్బంది లేకుండా మా మెంబర్ల చేత ఆఫీసు పని చేయించడమే నా బాధ్యత!"

"చూడండి, వినాయకరావ్ గారూ! లీడర్ అయినంత మాత్రాన ఆఫీసు పని చేయకూడదని ఎక్కడా లేదు. ఈ అపోహ మీ కెలా కల్గిందో నా కర్థం కావటం లేదు. ఫర్ యువర్ ఇన్‌ఫర్మేషన్ ఒకప్పుడు నేను కూడా మీలా వర్కింగ్ క్లాస్ కోసం పాటు పడిన వాణ్నే! అయితే ఏనాడూ పని పట్ల నిర్లక్ష్యం చూపలేదు!"

"అందుకే మేనేజర్ కాకల్గారు!"

"దట్స్ గుడ్! అర్థం చేసుకొన్నారు కదా!"

"కాని మీలా ప్రమోషన్ను తీసుకోవటం నా కిష్టంలేదు జీవితాంతం ఇలా నే కార్మికుల కష్టసుఖాల్లో పాలు పంచుకొని వాళకు సేవ చేస్తాను!"

"ఇవన్నీ ఆవేశంలో అనే మాటలు! ప్రమోషన్ వచ్చినపుడు వదులుకోవటం అవివేకం! ఈ పదవులను నమ్ముకోటం నిజంగా బుద్ధితక్కువ. పాత నీరు పోయికొత్త నీరు రావటం సహజ గుణం. ఎల్లకాలం మీరే లీడర్‌గా వుంటారని భ్రమపడకండి! పాతంటే వెగటు పుట్టాక కొత్తవైపు మొగ్గుతాయి మనుషులు. అది కాలం తెచ్చే మార్పు. దాన్ని ఎవ్వరూ అడ్డగించలేరు!"

"ఈ ఉపన్యాసాలు విన్నంత మాత్రాన నా నిర్ణయం మారుతుందని మాత్రం అనుకోకండి! మేనేజ్‌మెంట్ పిల్చి యిచ్చినా నాకు ప్రమోషన్ అక్కర్లేదంటాను!"

"మీ త్యాగానికి నా జోహార్లు! కాని నాదో డౌట్! ప్రమోషన్ అంటే మీ కెందుకింత వైరం!"

"వర్కింగ్ క్లాసునుండి ఆఫీసర్ కేడర్ లోకి వెళ్ళటం నా కిష్టంలేదు ఆఫీసరంటే నాకు ఎలర్జీ! వాళ్ల భావాలకు నా భావాలకు పొంతన వుండదు!"

"అదే పొరపాటు! వర్గ భేదాలు ఈ లోకంలో సర్వసామాన్యం! రోడ్డుమీద నడుస్తున్నవాడు రిక్షావాణ్ని తిట్టుకొంటాడు.

### సంకేతం

ఘోషించే సముద్రం
వేన వేల గొంతులలోని
వేదనలను ధ్వనిస్తుంది!
వర్షించే ఆకాశం
కడుపులు కాలే కర్మజీవుల
కన్నీళ్ళను స్మరిస్తుంది!
ఎరుపెక్కే తూర్పుదిక్కు
క్షుద్రమైన చీకటి పైకి
యుద్ధానికి పిలుస్తుంది!

— అదృష్ట దీపక్

రిక్షావాడు ఆటోవాణ్ని తిట్టుకొంటాడు. ఆటోవాడు లారీవాణ్ని తిట్టుకొంటాడు. తప్పున్నా లేకపోయినా పై తరగతిలో తప్పు లెంచటం క్రింద తరగతికి అలవాటు. అలాగే క్రింద తరగతిని చులకనగ చూడటం పై తరగతికి అలవాటు. ఈ వర్గభేదం అనాదిగా వస్తున్నదే! అయితే వర్గం మారగానే మనిషి భావాలు కూడా మారిపోరాయి. జీవితాన్ని తనకు అనువైన గ్రుకోణం నుంచి చూడటానికి అలవాటు పడాలి...''

''ఇవన్నీ నాకెందుకు చెప్తున్నారు?'' విసుగ్గా అడిగాడు వినాయకరావ్

''రేపట్నుంచి మీరు కూడా డిసిప్లిన్ పాటించాలి''

''నా విషయం వదిలేయమని యిందాకే చెప్పాను!''

''నాకు ఆఫీసులో ఎవరైనా ఒకటే! మీ ఉద్యోగుల సమస్యలు చర్చించటానికి వాళ్ళ ప్రతినిధిగా వచ్చినపుడు మాత్రమే మిమ్మల్ని యూనియన్ లీడరుగా గుర్తిస్తాను. మిగతా సమయాల్లో మీరు కేవలం ఒక బ్యాంకు ఉద్యోగి మాత్రమే!''

''ఒక ఎంప్లాయీకి యూనియన్ లీడర్‌కు తేడా తెలియని పరిస్థితిలో మీరున్నారన్న మాట!''

''కాదు! ట్రేడ్ యూనియన్ ముసుగులో కర్తవ్యాన్ని విస్మరించి పనిచేయకుండా సుఖపడాలనుకోవడం మంచిది కాదని మీలాంటి వాళ్లను హెచ్చరించే స్థితిలో వున్నాను!''

''ఇటీజ్ టూ మచ్! ట్రేడ్ యూనియన్స్ అంటే మీకెలాంటి భావం వుందో యిప్పుడర్థమైంది మీరు చాలా అవమానకరంగా మాట్లాడుతున్నారు!''

''పొరపాటు. ట్రేడ్ యూనియన్ స్థాపనలోని పవిత్రమైన ఆశయాలను మర్చిపోయి తోటి వుద్యోగులను పురికొల్పి పెడత్రోవను పట్టించి, వర్గభేదాలను అవతరమైతే వర్గభేదాలను సృష్టించి పదవులకోసం ప్రాకులాడే లీడర్లంటే నా కెప్పుడూ సదభిప్రాయం లేదు!''

''ఐ సీ! అయితే ట్రేడ్ యూనియన్స్ శక్తి ఏమిటో మీకు ఇప్పుడే తెలియజేస్తాను!'' అంటూ విసురుగా బయటకు వచ్చేశాడు వినాయకరావ్.

వినాయకరావ్ ఆదేశాల ననుసరించి ఉద్యోగులంతా చేస్తున్న పనులను ఆపేసి మేనేజర్ చాంబర్ బయట హాజరయ్యారు. ఈలోపు వినాయకరావ్ టెలిఫోన్ డైల్‌లో ఎన్నో నంబర్లు గిరగిర తిప్పాడు. అంతే! ఓ అరగంటలో టౌన్లోని వివిధ కార్యాలయాల్లో వున్న ట్రేడ్ యూనియన్ నాయకులు పరుగు పరుగున వచ్చారు. మేనేజర్ చాంబర్ బయట స్లోగన్స్ మొదలయ్యాయి.

''జిందాబాద్! జిందాబాద్! ట్రేడ్ యూనియన్స్ జిందాబాద్! కార్మిక వ్యతిరేక శక్తులు నశించాలి!!''

''మేనేజ్‌మెంట్ డౌన్. డౌన్!!!''

''అధికారుల అక్రమాలు అరికట్టాలి!!''

''కార్మిక ఐక్యత వర్థిల్లాలి...వర్థిల్లాలి''

* * *

మర్నాడు బ్యాంకుకు లీవ్ పంపించి తన స్వంత వూరు బయల్దేరాడు వినాయకరావ్. అతను ఇంటికి చేరుకొనేసరికి తండ్రి ఉపేంద్రరావ్ పొలం వెళ్ళటానికి బయల్దేరాడు

కొడుకును చూడగానే ఆయనకుకొండంత బలం వచ్చింది

''మీరు రెస్ట్ తీసుకోండి నాన్నగారూ! పొలం నే వెళ్తానులే!'' అని తండ్రికి చెప్పి పొలం బయల్దేరాడు వినాయకరావ్.

అతను వెళ్ళేసరికి ఆడకూలీలు పాటలు పాడుతూ నాట్లువేస్తున్నారు. పాలేరు నాగులు కోసం అటు ఇటు చూడసాగాడు. ఎక్కడా కన్పించలేదు

ఆడవాళ్ళ వెనకాల నారు కట్టలమ అందిస్తున్న మగ మనిషిని అడిగాడు నాగులు గురించి.

''నీళ్లు తక్కువగా వున్నాయని బోదె బారు సేయటానికి యెల్లాడండి బాబుగారూ! నారు కట్టలు అయిపోయినాయి. వేగె నాల్గు కావిళ్ళ నారు పంపించందే పని అగిపోతదండి!'' అన్నాడు.

''నేను ఆకుమడి దగ్గరకు వెళ్తున్నాను. నాగులు గాడితో పంపిస్తానులే!'' అంటూ బోదె గట్టు వెంటే నడుస్తూ ఆకుమడి దగ్గరకు వెళ్ళాడు వినాయకరావ్.

అక్కడ పది మందికి పైగా మడిలో నారు లాగి కట్టలు కడుతున్నారు. నాగులు గురించి వాళ్లను అడిగితే కాలువ గట్టు మీద వున్నాడని చెప్పారు. వినాయకరావ్ నడక సాగించి కాలువగట్టు మీదికి వెళ్ళాడు.

కాలువ గట్టు మీద తాటిచెట్టు నీడలో తువ్వాలు పర్చుకొని తాపీగా ఆకాశం వైపు చూస్తూ చుట్ట కాల్చుకుంటున్నాడు నాగులు

''ఒరేయ్ నాగులూ!'' అని బిగ్గరగా అరిచాడు వినాయకరావ్.

ఆ కంఠం విని నాగులు ఉలిక్కిపడ లేదు. కంగారు పడలేదు.

''ఎప్పుడొచ్చారు బాబూ?'' అంటూ మెల్లగా లేచి కూర్చున్నాడు.

''పొద్దున్నే వచ్చాను కాని, నువ్విక్కడ వున్నావేరా? అవతల ఆడవాళ్లకు నారు అందటంలేదు. అనవసరంగా పని ఆగిపోయేట్లు వుంది!''








బులుసు వేంకటరమణయ్య

# ఆత్మీయత....

మనం మన ప్రాంతాన్ని విడిచి వేరొక ప్రాంతానికి వెళ్ళితే అక్కడి భాష, అక్కడి వారి ఆచార వ్యవహారాలు మనకు కొత్తగా కానవస్తాయి. అయోమయస్థితి యేర్పడుతుంది. అట్టి స్థితిలో అక్కడ మన ప్రాంతీయుడు కనబడితే ఎంతో ఆనందం కలుగుతుంది. ఆ వ్యక్తి కూడా తమ ప్రాంతీయుణ్ణి చూచి ఆనందిస్తాడు.

ఇతర ప్రాంతాలకు వెళ్ళడం ఒక ఘనతగా భావించబడుతుంది. ఇప్పుడు విదేశాలకు వెళ్ళడమే ఒక ఘనతగా అందరూ తలుస్తారు.

మనవాళ్ళు పై దేశాలకు వెళ్ళడం ఘనతగా తలుస్తారే గాని, అక్కడి వారు — ఏ కొద్ది మందో తప్ప-తక్కిన వారు మన వారిని గౌరవంగా చూడరు జీవనోపాధిని సంపాదించుకోవడం కోసం పొట్ట పట్టుకొని వచ్చినట్లు హీనంగా చూస్తారు ఇది అనుభవజ్ఞులు చెప్పిన మాటే మన వారు మాత్రం అక్కడివారిలో కలిసిపోవడం కోసం అన్నివిధాలా పయత్నాలు చేస్తారు

ఇతర దేశాలను ఒకసారి చూచి రావాలనే కుతూహలం గల మన వారు ఆ దేశాలకు వెళ్లి —స్వదేశీయులను చూచి పరమానంద భరితులై, ఆప్యాయంతో సంభాషించినపుడు అక్కడి మనవారు ఎంతో ఆధారాభిమానాలు చూపడం, అక్కడ ముఖ్యంగా చూడవలసిన వాటిని తెలపడం, వారికి అన్నివిధాలా సహాయపడడం ధర్మం. ఇతర ప్రాంతాల నుండి వచ్చిన భారతీయులు తమ తమ ప్రాంతీయులను ఆదరంతో చూచినా, మన 'తెలుగు' వారిలో చాలామందిమాత్రం ఉపేక్షాభావంతో ఉంటున్నట్లు చాలా సార్లు ప్రపంచ పర్యటన చేసిన వరల్డ్ టీచర్స్ ట్రస్ట్ స్థాపకులు, కులపతి, మాస్టర్ ఎక్కిరాల — కృష్ణమాచార్యుల వారు తమ అనుభవాన్ని తమ ప్రసంగాలలో తెలియజేస్తున్నారు

తమ వారిని ఆప్యాయంతో పలకరిస్తే — విదేశీయులలో తమకు ఉండే గౌరవం తగ్గిపోతుందనే భావం వారికి ఉండవచ్చు దానికి భయపడి, వారు ఉపేక్ష వహిస్తున్నారని అనుకోవలసి వస్తోంది. మనవారిలా ఉన్న పాశ్చాత్యులలో చాలామంది మాత్రం మన వారిని గౌరవంగా చూచేవారు ఉన్నారు.

స్వదేశీయులతో మాటలాడితే గౌరవ హాని కలుగుతుందనే దురభిప్రాయం ఉండకూడదు. అది సంకుచిత దృష్టినే వెల్లడిస్తుంది గౌరవ మనేది హృదయంలో పుట్టుకురావాలి ప్రాంతాలతోనూ, ప్రాంతీయులతోనూ గౌరవా గౌరవాలకు ముడి పెట్ట కూడదు విశాల హృదయంతో తమ వారిని తాము ఇతరుల కంటె ఎక్కువగా చూచినప్పుడే విదేశీయులకు కూడా మనపై గౌరవం ఏర్పడుతుంది. లేకపోతే లోకువ అయిపోతాము. దీనిని విదేశాలలో వి భారతీయులు, ముఖ్యంగా తెలుగువారు గమనింపవలసి ఉన్నది.

"తమరు మడిదగ్గర్నుంచే వొచ్చారుగా! ఇద్దరు మొగాళ్ళను పోయి నాల్గు కావిళ్ళ నారు అందివ్వమని సెప్పక పోయారా?" అంటూ బద్ధకంగా ఒళ్ళు విరుచుకొంటూ లేచాడు నాగులు.

వాడి చేష్టలకు వినాయకరావ్ మండిపడ్డాడు.

"సంవత్సరానికి పాతిక బస్తాలిచ్చి నిన్ను పెట్టుకొన్నది యిందుకురా? కాలవ గట్టు మీద కూర్చుని చుట్ట కాల్చుకోటానికా?"

"యేమండోయ్! సానా మాట లంటున్నారు. జాగర్తగా మాటాడండి!"

"ఏమి ట్రా మాట్లాడేది? నాల్గు కావిళ్ళ నారు మోయలేవా నువ్వు? యివర్నే

## వర్ధిల్లండి! వర్ధిల్లండి!!

పంపమంటావ్! నువ్వు పాలేరువు కాదా?"

"నేను పాలేరునే! మీ పొలం పనులు సేయటానికే నన్ను పెట్టుకొన్నారు. ఆళ్ల సేత పని సేయించటమే నా డూటీ!"

"అయితే నీవు మాత్రం పని చేయవన్న మాట?"

"కూలోడికి— పాలేరుకి తమరికి తేడా తెలియదేంటి?"

"పిచ్చి పిచ్చిగా వాగకు! నారు మోస్తావా? లేదా?"

"ఆ పని నాది కాదని చెప్పానుగా! పని సేయించేవోణ్ణే కాని నేను పని సేయలేను!"

"రాస్కెల్! ఎంత పొగరురా నీకు? గెటువుట్! వెంటనే చేలోంచి వెళ్ళిపో! మా పన్లోకి రేపట్నుంచి రావద్దు! పో!" ఆవేశంతో ఊగిపోతూ అరిచాడు వినాయకరావ్.

"ఇన్ని తిట్లు తిన్నాక నీ దగ్గర పని సేయటానికి నాకు సిగ్గు లేదనుకొన్నావా? ఇప్పుడే యెల్తాను కాని రేపటి కాడనుండి నీ సేలోకి ఒక్క కూలోడు కూడా రాడు. జాగర్త!" అంటూ విసురుగా తువ్వాలు దులుపుకొంటూ వెళిపోయాడు నాగులు.

మడిలోని కూలీలు బయటకు వెళ్తుంటే అచేతనగా అలాగే చూస్తుండిపోయాడు కామ్రేడ్ వినాయకరావ్!

ఈ రోజు
మంచి రోజనే
భావనలో
మధుర స్వప్నాలెవేవో

# మఫత్‌లాల్ బట్టలతో అనుక్షణం తీరెను తీయని కోరికలవేవో.

సరదాగా, సున్నితంగా హాయిని గొల్పేలా బట్టలు—పాలియెస్టర్, పాలియెస్టర్ బ్లెండ్‌లలోనే గాక కాటన్‌లలో కూడా— క్షణక్షణం, అనుక్షణం, రోజూ, ప్రతిరోజూ మిమ్మల్ని మరింత అందంగా రూపొందించ గల రంగుల్లో, నేతలలో, డిజైన్లలో.

మఫత్‌లాల్ ఫ్యాబ్రిక్స్



MF-125 TEL

# ప్రేమంటే....???

నారపరాజు
రాఘవరాశ్రీ




ఆఫీసుకు టయిమయిపోయిందని హడావుడిగా చదువుతున్న పేపరు బల్లమీద పడేసి బాత్‌రూమ్‌లో దూరాడు మధుమూర్తి. నీళ్ళు తోడుకుంటూంటే ఏదో పాట వినిపించింది. బాత్‌రూమ్ కిటికీలోంచి తొంగి చూశాడు ఓర చూపులు చూస్తూ, మంద హాస వదనంతో పాట పాడుతోంది పక్కింటి అమ్మాయి. తెల్లగా, గులాబి పువ్వులా, సుకుమారంగా వుంది అనుకుంటూ స్నానం ముగించి బయటకు వచ్చాడు మధుమూర్తి.

*   *   *

గంట నుంచి దీర్ఘంగా ఆలోచిస్తోంది సువర్చల. అందిన సమాచారం సంతృప్తికరంగానే వుంది. బాంకులో ప్రొబేషనరీ ఆఫీసరు. అత్త పోరుండదు. ఇంతకన్నా మంచి అవకాశమే ముంది! అయితే రిస్కు లేని మంచి పథకం వెయ్యాలి. అఫ్‌కోర్స్... ప్రిలిమినరీ భాగం అప్పుడే– మొదలెట్టాను. వేచిమాడాలి, ఏం జరుగుతుందో! అయినా, తన తండ్రి స్థితిమంతుడు, సమర్థుడయినట్లయితే, ఇన్ని బాధలుండేవి కావు హుఁ. పిల్లల్ని కనడమే తప్ప, సుఖపెట్టలేనివాడు.

ఆయనకు వచ్చే జీతం ఇంట్లో సరిగా తిండికి చాలదు. బాధగా నిట్టూర్చింది సువర్చల.

*   *   *

'మీరు ఈ రోజు ప్రొద్దున, నన్ను ప్రేమిస్తున్నట్టుగా వుత్తరం అందించకపోయినట్లయితే నా జీవితమే నాశనమయిపోయేది. మీరు నా చెంత తీసుకోవడం నిజంగా నా అదృష్టం" తన్మయంగా కళ్ళు మూసుకుని అన్నాడు మధుమూర్తి. సువర్చల సిగ్గుగా తలొంచుకొని గడ్డిపరకలను పరీక్ష చేస్తోంది.

'నేను పిరికివాణ్ణి. ప్రేమించడమే కాని, ఆ భావనను బయట పెట్టగలిగిన ధైర్యం లేదు. మీరిలా వెలిబుచ్చటం మంచిదయింది. లేకపోతే నాలో నేను కుమిలి ప్రాణత్యాగం చేసేవాణ్ణి." సువర్చల చప్పున అరచేతితో అతని నోటిని మూసింది మృదువుగా. ఓ నిముషం మౌనంగా గడిచింది.

"అందుకే ప్రేమ గుడ్డిది అన్నారు. మీ పేరు కూడా తెలుసుకోకుండా మీపై నేను అనురాగం పెంచుకోడం, నాకే చిత్రమనిపిస్తోంది." అంది సువర్చల చిత్రంగా కళ్ళు మెరిపిస్తూ.

"కరెక్ట్! నాకూ మీ పేరు తెలీదు" అన్నాడు మధుమూర్తి ఆనందంగా.

పార్కులో జనం పలచబడ్డారు. ప్రొద్దు

300 గ్రాములు రూ. 3·20 (స్థానిక పన్నులు అదనం)

మీకు మీరుగాగమనించండి !

# ఇతర డిటర్జెంట్ ఉతికే బిళ్ళ లకన్నా బరువు రెండు రెట్లు ఎక్కువ.ధర కేవలం కొద్ది పైసలు ఎక్కువ!

# టోటల్

## నీలి డిటర్జెంట్ ఉతికే బార్




## మొదటి "నిజమైన" డిటర్జెంట్ బార్!

టోటల్ - ఉతికే బార్ రీతిలో ఉన్నది
మరియు అధికమైన శుభ్రపరిచే నీలి
డిటర్జెంట్ శక్తి ఉన్నది
మరి ఇంకేమి? పొదుపుగ
ఉతికేందుకుగాను ఇది ఐదు చేతికనువైన
భాగాలు కలిగివుంది

## కేవలం కొద్దిపైసల హెచ్చుకే రెండు రెట్లు బరువు!

ఒక నిర్దిష్టమయిన డిటర్జెంట్ కేక్ 125 గ్రాముల బరువు
కలదానికి మీరు ఎంత ఖర్చు పెడుతున్నారు?
250 గ్రాముల 'టోటల్" ధర కేవలం రూ 2 67
(300 గ్రాములకి రూ 3 20) అదీను మామూలు డిటర్జెంట్ కేక్‌లకన్న
రెండు రెట్లు బరువు ఎక్కువ కేవలం కొద్ది పైసల హెచ్చుకే!

ఉతుకుటకు
చేతికనువుగా
ఐదు భాగాలు

**ఆంధ్రప్రదేశ్, బీహార్ మరియుతమిళనాడులలో దొరుకును.**

కర్ణాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్,బెంగుళూరు వారి ఒక నాణ్యమయిన ఉత్పాదన
మార్కెట్ చేయువారు మైసూరు సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగుళూరు

MCA-TDB-51-Tel

పోయింది లాగా ఇద్దరూ ఒకరి నొకరు విసుగ్గా చూసుకుంటూ నడుస్తున్నారు

* * *

"అబ్బ! ఈ గోల్కొండకోట కాదుగాని, కాళ్ళు పడిపోతున్నాయండీ!" అంటూ సువర్చల విసుగ్గా కూలబడుతూ

"అరె! అప్పుడే ఏడు దాటిపోయింది" ఆదుర్దాగా అన్నాడు మధుమూర్తి

"ఇప్పుడు మనం వుప్పల్ వరకు బస్సులో వెళ్ళగలమా! త్వరగా ఏదైనా 'ఆటో' చూడండి అంది సువర్చల ఆటో కోసం వెళ్ళిన మధుమూర్తి గంట తరువాత వాడిన ముఖంతో వచ్చాడు. అంతవరకూ బస్ స్టాపులో ఆందోళనగా ఎదురుచూస్తున్న సువర్చల, ఒంటరిగా వస్తున్న మధుమూర్తిని చూసి మరింత ఆందోళన పడుతూ,

"ఆటో ఏదండీ?" అని అడిగింది

"దొరకలేదు ఇప్పుడు ఈ రాత్రి ఇక్కడ ఓ లాడ్జిలో వుండి, పొద్దుటే వెళ్ళిపోదాం" అన్నాడు

"ఇహ తప్పేదేముంది! రాత్రి మా ఫ్రెండింట్లో పడుకున్నానని చెప్తాను నాన్నతో" అంది నీరసంగా.

లాడ్జిలో రూమ్ తీసుకున్నారు ప్రక్క మంచం మీద పడుకున్న సువర్చలను తమకంగా చూస్తూ కౌగిలించుకున్నాడు మధుమూర్తి వద్దు వద్దంటూ అయిదు నిమిషాలు సువర్చల

# ప్రేమంటే...???

పెనుగులాడింతర్వాత వదిలేశాడు మధుమూర్తి. అతనికి చాలా అవమానంగా వుంది 'కోపం వచ్చిందా' అని గోముగా అడిగిన సువర్చలకు 'లేదు' అని సమాధానమిచ్చి 'ఇప్పుడే వస్తా'నంటూ చిరునవ్వు నవ్వి క్రిందికి దిగివెళ్ళాడు సువర్చల రూమ్ బయటకువచ్చి పాలిపోవగా చూస్తూ నిలబడిపోయింది

* * *

"డియర్ సువర్చలా,

నా పెళ్ళి ఎప్పుడో నిశ్చయమైపోయింది రేపే బయల్దేరి వెళ్ళాలి, నీ అదృష్టం బాగుంది, జారిపోయావు నా చేతుల్లోంచి. ఆఫ్ కోర్స్, ఇహ నీ గురించి పట్టించుకోననుకో చూశావా! నీ పేరు కూడా నా కెప్పుడో తెలుసు పాపం! నన్ను చాలా 'సిన్సియర్'గా ప్రేమించావు ఆ ప్రేమలోనే జీవించు

ఇట్లు

మధుమూర్తి

నవ్వుకుంటూ బాయ్ని పిలిచి, "కల్ సుబామే యే పోస్ట్ కర్దో" అని కవరు యిచ్చాడు

"ఛ! లాడ్జిలో రూమ్ దండగ" అని తన్నుతాను తిట్టుకుంటూ పాంట్ వేసుకుని జేబులో చెయ్యి పెట్టాడు ఓ కాయితం తగిలింది

## నీడ

తన నీడ చూసి
తానే భయపడతాడు
అన్నీ వున్న
గొప్పవాడు -
తన నీడే
తనకు తోడుగ
జీవిస్తాడు
ఏమీ లేని
పేదవాడు -

— కాద సరోజారాణి

"డియర్ ఫూల్,

యద్దనపూడి వ్రాసిన కమ్మటి ప్రేమ కథలు నెమరు వేసుకుంటూ నన్ను ప్రేమించావనుకున్నావా? ఛీ! బుల్ షిట్!! నేను చాలా ప్రాక్టికల్ మనిషిని. మా నాన్న నా పెళ్ళి చేయలేడని నాకు తెలుసు అందుకే 'టాప్' చేశాను నేను బి ఎ (ప్రై కాలేజి) చదివాను గురూ! కథ చెడిపి కొడుతోందని ఇవాళ సాయంత్రమే గ్రహించాను. నీ 'స్ట్రేటజీ' అంత బలంగా లేదు. ఆటోలు దొరకలేదనడం, ఏడుగంటల వరకు టైము తెలీనట్లు నటించడం, చాలా పేలవంగావుంది నీ వ్యూహం పైగా నేను నీకు లొంగకపోతే ఇప్పుడే వస్తానని నువ్వు క్రిందికి వెళ్ళి 'బాయ్'తో గుసగుసలాడి 'బీరు కొనుక్కోడానికి పోవడం, ఇవన్నీ నేను చూశాను పాపం నేనే పకడ్బందీగా వెయ్యాలి ఎటూ నువ్వు పెళ్ళి చేసుకునేవాడివి కాదు పైగా, ఫ్రీగా నన్ను అనుభవిద్దామనుకున్న వాడివి రెండు సాయంత్రాలు నీతో వ్యర్థంగా గడిపినందుకు రెండు వందలు 'చార్జి' చేశాను నన్ను పోనివ్వడానికి 'బాయ్'కి పది యిచ్చాను సో... మొత్తం రెండొందల పది డియర్ మధుమూర్తి! నాకు నీ పేరే కాదు! ఇంకా చాలా తెలుసు మీ నాన్నపేరు రంగనాధం ఆయన రిటైర్డ్ కలెక్టరు నీకు అమ్మలేదు ఎనీవే.. వ్రతం చెడ్డా ఫలం దక్కింది

.. ......"

మధుమూర్తి సూట్‌కేస్ తెరిచి, ఖాళీ అరవంక కసిగా చూస్తుండిపోయాడు ◉



# మంగళకరమైన వెన్నెల మోమును
# మెరుగు పరచటానికి
# ఐటెక్స్
# మాట్ ఫినిష్ తిలకం

దేశమంతటా నాగరిక యువతులు కోరి ధరించేది ఐటెక్స్ తిలకం నారీమణుల పుష్ప వదనాన్ని అద్భుత సౌందర్యాన్ని ప్రస్ఫుటం చేసేటందుకే కమ్మలకింపైన 14 రంగులలో దొరుకుచున్నవి. శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు ఐటెక్స్ తిలకం చర్మానికి ఎటువంటి హానియూ కలుగజేయదు




**ఐటెక్స్**

38 సంవత్సరములుగ మీ నమ్మకానికి
పాత్రమైన ఉన్నతమైన చిహ్నం

అరవింద్ లాబరేటరీస్ మద్రాసు 600 033

సీరియల్

# జీవితవనంలో కొత్తగాలి

కుందుర్తి ఇందిరాదేవి

## 7

(గత సంచిక తరువాయి)

పై సంఘటన జరిగిన రెండురోజుల తర్వాత నేను బస్‌స్టాప్‌లో బస్‌కోసం చూస్తున్నాను బస్‌స్టాప్ నిండా బాగా జనం ఉండటంతో రద్దీగా ఉంది విసుగ్గా అటూ ఇటూ చూస్తున్న నేను చప్పున ఆగిపోయాను రోడ్డుకి అవతలివైపు స్కూటర్ మీద మై గాడ్ కిరణే సందేహం లేదు స్కూటర్‌మీద కూర్చుని ఇటువైపే చూస్తున్నాడు ఎవరి నబ్బా! నేను సందేహం వచ్చినదానిలా అటూ ఇటూ చూశాను అందరికీ దూరంగా నిలబడటం అలవాటు నాకు నా ప్రక్కన ఎవ్వరూలేరు అతను తదేకంగా ఇటువైపే చూస్తున్నాడు ఛీ! ఛీ! నా బుగ్గల్లోకి వెచ్చటి ఆవిరి వచ్చింది అతని స్కూటర్ కదిలి ఇటు రాబోయింది ఇంతలో బస్ రావటంతో నేను పరిగెత్తి ఎక్కేశాను అతను ఆశాభంగం చెందినవాడిలా చూస్తుంటే నా మనస్సులో రకరకాల ఆలోచనలు సుళ్ళు తిరిగాయి ఏమిటి అతని ఉద్దేశం?

ఇంకోసారి బస్ దిగి ఆఫీసుకి వెళ్ళబోతుంటే కనిపించాడు కిళ్ళీషాపు ముందు నిలబడి కిళ్ళీ నములుతూ నావైపే చూస్తున్నాడు నన్ను చూసి కదిలి రాబోయాడు నేను చప్పున ఆఫీస్‌లోకి పారిపోయాను మై గాడ్! ఏమిటిది? నా ఒంటి నిండా చెమటలు పోస్తున్నాయి నా కాళ్ళల్లో వణుకులాంటిది రాసాగింది తర్వాత అప్రయత్నంగానే ఆఫీసునుండి బయటకి వచ్చేటప్పుడు, బస్ దిగేటప్పుడు అతను కన్పిస్తాడేమో అని నా కళ్ళు వెతుకుతుండేవి

ఒకరోజు నేను ఆఫీసు పనిలో సీరియస్‌గా మునిగిపోయి ఉన్నాను విమల వచ్చి –

"నీకు ఫోన్ వచ్చింది సంధ్యా" అంది

నేను తలెత్తి చూసి "ఫోనా! నాకా!" అన్నాను

"అవును నీకే" దీర్ఘంతీస్తూ అంది విమల

"ఎవరబ్బా" అప్రయత్నంగానే అన్నాను అంటూనే ఫైలు టేబుల్‌మీదికి త్రోసి లేచి నిలబడ్డాను

"ఈసారి మాత్రం నువ్వు భయపడాల్సిందేనోయ్ సంధ్యా" అంది విమల ఎందుకో నాకు ఆ మాటల్లో కృత్రిమత్వం కనిపించింది

నేను రక్కున ఆగి "భయమా! ఎందుకు?" అన్నాను నా మనసులో లీలగా ఏదో అనుమానం కదలాడింది

విమల నా అరచేతిలో గిల్లుతూ "పిలిచింది ఆడగొంతు కాదు మగగొంతు" చిలిపిగా అంది

"మగగొంతా!" నేను నిర్ఘాంతపోయాను

"బాయ్‌ఫ్రెండ్ అయి ఉంటాడు" అంది విమల నవ్వుతూ

నేను విమలని మింగేసేలా చూశాను ఫోన్ చేతిలోకి తీసుకుంటుంటే నా చేతులు వణికాయి

"హల్లో" నా గొంతు నాకే అదోరకంగా వినిపించింది

"హల్లో సంధ్యా!" అవతలినుండి ఆత్రంగా పిలిచింది

ఆ గొంతు వినగానే నేను నిటారుగా నిలబడ్డాను మై గాడ్, అదే గొంతు ఇదేమిటి? నా ఆలోచనలకి మధ్యలోనే అడ్డుకట్ట వేసి అతను పిలిచాడు

"హల్లో సంధ్యా! నువ్వేనా! నేను కిరణ్‌ని"

**జరిగిన కథ - 3:** పోతూ పోతూ ఆ కుటుంబ భారంతోపాటు చేసిన అప్పు కూడా పెద్దకూతురైన సంధ్యపై వేసి కన్నుమూస్తాడు ఆమె తండ్రి ఓ చిన్న ఉద్యోగం చేస్తూ తల్లితో పాటుగా తమ్ముణ్ణి, ముగ్గురు చెల్లెళ్లను పోషిస్తూ వాళ్లకి చదువు సంధ్యలు చెప్పిస్తుంటుంది ఎప్పుడైనా డబ్బు అవసరమైతే తన స్నేహితురాలు ప్రమీల దగ్గర తెచ్చుకుని మళ్లీ ఇచ్చేస్తుంటుంది ప్రమీల అన్న కిరణ్‌తో సంధ్య స్నేహం చిగుళ్ళు తొడుగుతూంటుంది ప్రమీల పుట్టినరోజు పార్టీకి సంధ్యా, కిరణ్‌లు వెళతారు, ఆమె ఆహ్వానించగా పార్టీ పూర్తయిన తర్వాత తన స్కూటర్‌పై సంధ్యను వాళ్లింటి దగ్గర దించి వెళతాడు కిరణ్

"మై గాడ్ కిరణ్" అప్రయత్నంగా అన్నాను పైకి

"హమ్మయ్య! గుర్తుపట్టేరా" అతని కంఠం చాలా రిలీఫ్‌గా ఉంది

"ఏమిటలా ఫోన్ చేశారు" నేను కరుగ్గా అన్నాను

అవతలవైపునుండి ఒక్క క్షణం ఎటువంటి సమాధానం లేదు మళ్ళీ నేనే పలకరించాను

"మిమ్మల్నే? ఎందుకు ఫోన్ చేశారు అసలు మీరు పిలిచింది నన్నేనా?" విసురుగా అన్నాను ఎందుకంటే విమల, ఆ ప్రక్కన కూర్చున్న హనుమంతరావు, ప్రసాద్ అప్పటికే చెవులు అప్పగించి వింటున్నారు అందుకని కావాలనే నేను కరుగ్గా మాట్లాడసాగాను

"సంధ్యా" కిరణ్ గొంతు సంశయంగా పలికింది

"ఎస్" అన్నాను

అతని మాటల్లో చప్పున మార్పు వచ్చింది నేను 'ఎస్' అని పలికిన తీరు అతని తుప్పను వదలగొట్టినట్టుంది

"మిమ్మల్ని ఒకసారి ఇంటికి రమ్మని ప్రమీల చెప్పమంది" అతని కంఠం ఎలాగో ఉంది

"అచ్ఛా" నేను ఆశ్చర్యపోయాను ఈ విషయం కిరణ్ నాకు ఫోన్‌చేసి చెప్పడమేమిటి!?

"నిజంగా!"

"రమ్మనమని ప్రమీలే ఫోన్ చేస్తుంది మరి" అనేశాను

"ఊహూ తనకు ఏదో పని ఉందిట అందుకని." అతను ఆపేశాడు

నేను ఏదో అనబోయి ఆగిపోయాను నాకు ఎవరో మగవాడు ఫోన్‌చేశాడు అని విమల చెప్పేసరికే అందరూ చెవులప్పగించి శ్రద్ధగా వింటున్నారు పైగా నేను అతనితో ఇంకోవిధంగానైనా మాట్లాడితే ఊహాగానాలు మొదలెడతారు అందుకే వస్తున్న కోపాన్ని అతి ప్రయత్నంమీద దిగుమింగుకున్నాను

"ఎప్పుడు రమ్మంది" యథాలాపంగా అన్నాను

అవతలినుండి ఒక్కక్షణం సమాధానం రాలేదు "రేపు సాయంత్రం వీలుంటే ఈరోజు సాయంత్రమే రమ్మంది" అన్నాడతను

"సరే" అన్నాను

'సంధ్యా ఫోన్ పెట్టేస్తున్నావా" ఆత్రంగా అన్నాడు

"అవును ఇంక చెప్పాల్సింది ఏమీ లేదుగా" అన్నాను

"ఊహూ లేదు"

"అయితే పెట్టేస్తున్నాను"

"బై"

"అచ్ఛా! గుడ్‌బై" అంటూనే ఫోన్ పెట్టేశాను

నిజంగా ప్రమీల రమ్మందా? అంత అత్యవసరం అయితే ప్రమీలే నాకు ఫోన్‌చేసి చెప్తుంది కిరణ్‌కి ఎందుకు చెప్పింది నా కంటి ముందు ఆరోజు ప్రమీల పుట్టినరోజు కదిలింది అతను పదేపదే నావైపే చూడటం, బస్‌స్టాప్‌లో నిలబడితే 'నేను మిమ్మల్ని కావాలనే వెదుక్కుంటు వచ్చాను' అనటం మెరుపులాగుర్తొచ్చాయి అంటే ఏమిటతని ఉద్దేశం?

నా మొహంలోకి వెచ్చటి రక్తం సర్రున వచ్చింది షాక్ కొట్టేసి వెంటనే కదలకుండా అలాగే నిలబడి పోయాను

"ఏమిటోయ్ సంధ్యారాణీ పట్టపగలే కలలు కంటున్నావా ?" విమల తలెగరేస్తూ, కన్ను గీటింది

నేను కందిపోయిన మొహంతో విమల టేబుల్ దగ్గరకెళ్ళి, "మరే ! కలలు కనటమే నాకు వేరే పనిలేదు" అన్నాను

విమల ఇంకా చిలిపిగా అంది "వేరే పని అంటే ఆఫీసు పనేగా ? ప్చ్ ! అదెప్పుడూ ఉండేదేగా ? అందుకనే తీరిగ్గా ఫీలుచూసుకుని కలలు కనాలి !" అంది

నేను విమల బుగ్గమీద చిటికేసి "అయితే నా కసలు బోలెడు పని ఉంది ప్రస్తుతం టైం లేదు ఆ కలలేవో నువ్వే కను" అన్నాను కోపంగా

విమల చప్పున రెండు చేతులూ జోడించి,

"సంధ్యా ! సంధ్యా ! పనిలో పని ! కాస్త నా పనికూడా నువ్వు చేసిపెట్టావంటే నిజంగా కలలు కంటూ కూర్చుంటాను" అంది



నేను ఛర్రుమన్నట్టు చూసి –

"ఆ ! ఏరే ! నాకు వేరే పనిలేదు నేను ఛస్తే చెయ్యను ఎప్పుడూ నీ పనంతా నా నెత్తినవడేసి నువ్వు ఏ మార్నింగ్ షోకో చెక్కేస్తుంటావు" అని వచ్చేశాను

"అంతేకదూ సంధ్యా ! సరేకానీ" అని విమల అంటూనే ఉంది

నేను వచ్చి నా సీట్లో కూర్చున్నానో లేదో చంద్రయ్య వచ్చాడు, అయ్యగారు పిలుస్తున్నారు అంటూ

నేను ఫైలు తీసుకుని మా ఆఫీసర్ గదిలోకి వెళ్ళాను

మా ఆఫీసర్‌గారి మొహం గండుపిల్లిలా ఉంటుంది అందులో కుర్చీకి పరిపడా ఉంటారు ముందు ఆయన మాటలకి కాకపోయినా ఆయన విగ్రహాన్ని చూసి దడుసుకుని ఛావాలి

నేను అందించిన ఫైలు తీసుకుని చూస్తూ –

"మెడ్రాస్ బ్రాంచికి పంపించాల్సిన ఫైల్ పూర్తయిందా మిస్ సంధ్యా !" అన్నాడు

"అయిపోవచ్చింది సార్ !" అన్నాను

"చూడు ఈ రోజు మధ్యాహ్నం అది పోస్టులో వెళ్ళిపోవాలి" శాసించినట్టుగ అన్నాడు కళ్ళజోడు సవరించుకుంటూ

"ఎస్ సార్" అని వచ్చెయ్యబోతూ ఆఫీసర్ పిలుపుతో మళ్ళీ వెనక్కి తిరిగాను

"అన్నట్టు చూడు మిస్ సంధ్యా ! కలకత్తా నుండి ఈ ఫైల్ తిరిగొచ్చింది దీన్నిండా తప్పులే అక్కడి నుండి నాకు చివాట్లు పెడుతూ తిప్పి పంపించారు" అన్నాడాయన అసలే గండుపిల్లిలా ఉన్న ఆయన మొహం ఆ మాటలు చెప్పేటప్పుడు ఏ విధంగా ఉందో చెప్పటం నాకు చేతకాదు

నేను వెంటనే సమాధానం చెప్పలేకపోయాను ఎందుకంటే ఆ ఫైలు నేను చూళ్ళేదు నేనెప్పుడూ అంత అజాగ్రత్తగా ఉండను

"సార్" నేనేదో చెప్పబోయాను

ఆయన అప్పటికే టేబుల్ పక్కగా పెట్టిన ఒక గులాబీ రంగు ఫైలు చప్పుడయ్యేలా నా ముందు పడేస్తూ –

"చూడండి మిస్ సంధ్యా ! ఈ ఫైలు నిండా అవకతవకలే ఇంత అజాగ్రత్తగా ఉంటే ఎలా అసలే నేను ప్రమోషన్ కోసం నానా తిప్పలు పడుతున్నాను ఇలా అయితే నాకు ప్రమోషన్ వచ్చినట్టే" అన్నాడు మొహం ఈ లావున చేసుకుని

"మీరు ఆ ఫైలు చూడలేదా సార్" అనుమానంగా అన్నాను

ఆయన చప్పున మెత్తబడి "నా భార్యకు ఆ సమయంలో ఆరోగ్యం బాగాలేదు అంతగా పట్టించుకోలేదు" అని మళ్ళీ నా వైపు సీరియస్‌గా చూస్తూ,

"ఊ ! ఈసారి జాగ్రత్తగా చెయ్యండి" అన్నాడు

"సారీ సర్ ! ఈ పని నాదికాదు ఈ ఫైలు హనుమంతరావుగారు చూశారు" అన్నాను నిర్మొహమాటంగా

"వ్వాట్ !" ఆయన హఠాత్తుగా ముందుకు వంగాడు అలా వంగటంతో కళ్ళజోడు ముక్కు మీదికి జారింది

"ఓసారీ ! మీరు చేశారనుకున్నాను" అని అంతలోనే ఆఫీసర్ హోదాలో "మరి ఇందాకటి నుండి చెప్పరేం నాకు తెలుసు మీరెప్పుడు ఇలా తప్పులు చేయరని" అని ప్రశంశించాడు ఆయనకి నా పనిమీద మంచి గురి ఉంది

"చూడండి హనుమంతరావంటే ఆ ఎర్రగా, సన్నగా ఉంటాడు" అన్నాడు ఆఫీసర్

నేను అవును అన్నట్టు తల ఊపి బయట కొచ్చేశాను

"ఏమిటి సంధ్యారాణిగారు ఆ గండుపిల్లి గట్టిగా కేకలేస్తున్నాడు" అన్నాడు హనుమంతరావు పలకరిస్తూ

నేను వస్తున్న నవ్వు నాపుకుంటూ "అబ్బే







లేదండి! ఆ హనుమంతరావేనా ఈ ఫైలునిండా తప్పులు రాసింది అని నామీద విరుచుకుపడ్డారు'' అన్నాను

ఆ మాట వినంగానే హనుమంతరావు ఎగిరిపడి,

''చచ్చాంరా బాబూ! ఒరేయ్ ప్రసాదూ ఈ రోజు నాకు ఆఫీసర్‌గాడితో చివాట్లు తప్పవు గండుపిల్లి నన్ను పీక్కుతింటుంది'' అని ఏడుపు మొహం పెట్టాడు ఇంతలో చంద్రయ్య రానేవచ్చాడు

''భయపడకు గురూ! ఆ సమయంలో మా ఆవిడకి ఒంట్లో బాగాలేదు సార్! అందుకని మనసు బాగోలేదు అని సంజాయిషీ ఇవ్వు'' అన్నాడు ప్రసాద్ ఓదారుస్తూ

''అయ్యో ఖర్మ! నాకింకా పెళ్ళికాందే'' హనుమంతరావు మొహం ఆ సమయంలో అచ్చు కోతిలాగే ఉంది

విమల నా భుజం గిల్లుతూ ''అచ్చు మంకీనే'' అంది

మొత్తానికి హనుమంతరావు ఆఫీసర్ గదిలోకి వెళ్ళాడు

విమల తన సీట్లోకి వెళ్ళిపోయింది నేను మళ్ళీ ఫైల్లో తలదూర్చాను పది నిముషాల తర్వాత హనుమంతరావు బయటికి వచ్చాడు ఆఫీసర్ బాగానే పెట్టినట్టున్నాడు మొహం ఈలావున చేసుకుని ఫైలు చప్పుడయ్యేలా టేబుల్‌మీద పడేశాడు

''ఏం గురూ! గండుపిల్లి పట్టి పీకినట్టుంది నీ వరుస చూస్తుంటే'' మొదట ప్రసాదే పలకరించాడు హనుమంతరావు ప్రసాద్‌వైపు ఉరిమిచూసి,

''ఒద్దురా గురూ! అంటే బలవంతంగా నన్ను సినిమాకి లాక్కెళ్ళావు ఇప్పుడు చూడు ఇదంతా నీమూలంగానే వచ్చింది'' గంయ్‌మన్నాడు

''అదేంది గురూ! మార్నింగ్ షోకి లాక్కెళ్ళాను సరే, తర్వాత రోజు జాగ్రత్తగా చేయకూడదా?'' తన తప్పేమీ లేదన్నట్టుగా అన్నాడు ప్రసాద్

హనుమంతరావు ఛర్రున లేచాడు ''మర్నాడు నువ్వు పెళ్ళి చూపులున్నాయిరా హనుమంతూ అని లాక్కెళ్ళలేదూ'' అన్నాడు

ప్రసాద్ ఫక్కున నవ్వి ''రేయ్! హనుమంతూ!



## జీవితవనంలో కొత్తగాలి

ఇదీ మరీ అన్యాయంరా ఒక్కరోజు పెళ్ళిచూపులకు తీసుకువెళ్తే నువ్వు ఆఫీసు పని పాడుచేయాలా'' అన్నాడు

హనుమంతుకీసారి ఇంకా కోపం వచ్చింది ''ఆ! మర్నాడంతా నీ పెళ్ళిచూపుల కబుర్లతో ఇష్టం వచ్చినట్టుగా పనిచేశాను. ఛీ! ఛీ!'' అన్నాడు

''పోనీలేరా! ఒక మంచిపని చేశావు అంత మాత్రాన బాధపడతావా నువ్వారోజు అంతగా చెప్పకపోతే అసలు పెళ్ళికి ఒప్పుకునే వాడినేనా'' ప్రసాద్ ఓదార్పుగా అన్నాడు

''నీకేం! హాయిగా పెళ్ళి చేసుకున్నావు మీ నాన్న నీకు శుభ్రంగా పెళ్ళిచేశాడు మధ్యలో నేనేడుస్తున్నాను''

''ఛ! ఎందుకురా వెధవ ఏడుపు నాకు మా నాన్న పెళ్ళిచేస్తే నీకు ఈరోజు గండుపిల్లి పెళ్ళి చేశాడుగా''

ప్రసాద్ తత్వమే అంత వాళ్ళిద్దరూ చదువుకునే రోజుల్లో నుండి స్నేహితులట లక్కీగా ఇద్దరికీ ఉద్యోగం కూడా ఒకేచోట దొరికింది హనుమంతరావు ఫామిలీ పెద్దది అతనికి కాస్త కుటుంబ బాధ్యతలెక్కువ ప్రసాద్‌కి ఆ బాధేం లేదు ప్రసాద్ పెళ్ళి చేసుకున్నప్పుడు అతనూ పెళ్ళి చేసుకోవాలని ఊగాడు కానీ తండ్రి ఒప్పుకోలేదు ముందు కుటుంబాన్ని ఉద్ధరించవోయ్ అని మందలించాడని ప్రసాద్ ఆఫీసులో టాంటాం వేశాడు వాళ్ళిద్దరికీ అలా మాట్లాడుకోవటం అలవాటే వాళ్ళ దెబ్బలాటకి మేమెవరం అభ్యంతరం చెప్పం అందరం అలవాటు పడిపోయాం అందరూ ముసిముసిగా నవ్వుకుంటూ చకచకా ఎవరి పని వాళ్ళు చేసుకుంటున్నారు

నేను మళ్ళీ నా పనిలో పడిపోయాను అలా ఎంతసేపు గడిచిందో కానీ,

''నీకు ఫోన్ వచ్చిందోయ్ సంధ్యా!'' అని విమల పిలిచేవరకు నేను తలెత్తలేదు విమల పిలుపుకి ఉలిక్కిపడినట్లు తలెత్తి —

''ఫోనా!'' అన్నాను ఆశ్చర్యంగా ఖర్మ కాలి మళ్ళీ కిరణ్ ఫోన్ చేయలేదుకదా అన్న అనుమానం తారాట్లాడింది మనసులో

నేను లేచి నిలబడి తల విదిలించాను చాలా సేపటినుండి అలా కూర్చోవటంతో నడుం పట్టినట్టుంది మెడమీద చేత్తో రాచుకుంటూ ఫోన్‌వైపు వెళుతుంటే విమల కవ్వింపుగా అంది,

''ఏమిటోయ్ సంధ్యారాణీ! ఫోన్ ఎక్కడి నుండి అని అడక్కుండానే లేచివస్తున్నావు'' అంది నేను కోపంగా చూశాను

''సారీనోయ్ సంధ్యా! డిజప్పాయింట్ చేస్తున్నానేమో పిలిచింది ఇందాకటి హీరో కాదు ఆడ గొంతు'' అంది

హమ్మయ్య అనుకున్నాను హీరోలు, హీరోయిన్‌లు విమల నాలుకచివర ఉండే పదాలు

''హల్లో'' అన్నాను రిసీవర్ తీసుకుని

''హాయ్ సంధ్యా గుడీవెనింగ్'' ప్రమీల గొంతు పలికింది

''హాయ్! హాయ్ ప్రమీ! గుడీవెనింగ్ ఏమిటి ఇప్పుడే రమ్మంటావా ఎందుకు రమ్మన్నావట?'' నవ్వుతూ అడిగాను

''రమ్మన్నానా! నేనా?'' ప్రమీల గొంతు ఆశ్చర్యంగా పలికింది

నేను చిత్తరపోయాను ఒక్క నిముషం ''ప్రమీ! మిమ్మల్ని రమ్మనమని చెప్పమంది'' కిరణ్ మాటలు గుర్తొచ్చాయి. ఇదేమిటి? వీళ్ళిద్దరూ కలిసి నాటకం ఆడటంలేదుకదా! మై గాడ్! రిసీవర్ పట్టుకున్న నా చెయ్యి క్షణకాలం వణికింది

''ఏయ్ సంధ్యా! ఏమిటి మాట్లాడవేం?''

''ఏం.. ఏం మాట్లాడను!'' నా మాట తడబడింది

''ఏం మాట్లాడేదేమిటి నా మొహం! ముందిది చెప్పు నిన్ను రమ్మనమని నేను చెప్పానా! ఎప్పుడు?'' ప్రమీల నిలదీస్తున్నట్టుగా అడిగింది నేను చప్పున సమాధానం చెప్పలేకపోయాను

''ఆ విషయం నీ కెవరు చెప్పారు?''

''కిరణ్'' నా నాలుకదాకా వచ్చిన మాటని మింగేశాను అలా చెప్తే ప్రమీల ఏమనుకుంటుంది మై గాడ్ నాకేమిటో అంతా అయోమయంగా అనిపించింది

''నివ్వే? నాకు సమాధానం చెప్పవేం ఇప్పుడే కదా నీకు ఫోన్ చేస్తున్నాను. నిన్ను రమ్మనమని నేనెప్పుడు చెప్పాను'' ప్రమీల గొంతులో అనుమానం తారాట్లాడింది

# మీ డబ్బుకి ఇంతకంటె మంచి రక్షణ అవసరం



ఫలానా చోట భద్రత ఉంటుందని గట్టిగా నమ్మి మీ డబ్బును అక్కడ దాస్తారు. ఆ నమ్మకం కాస్తా వమ్మయితే...! అలా జరిగే అవకాశాలు లేకపోలేదు. అందుకే - కష్టార్జితాన్ని ఎక్కడ మదుపు పెట్టాలా అన్న విషయంలో మీరు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావడం చాలా ముఖ్యం.

రెండు దశాబ్దాల అనుభవం ఉన్న మార్గదర్శిలో మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి రక్షణ ఉంటుంది. అందరి అవసరాలకూ సరిపడే విధంగా వివిధ రకాల చిట్‌లు మార్గదర్శిలో మీకు అందుబాటులో ఉన్నాయి. అంతేకాదు, మీరు పొదుపుచేసే మొత్తాలకు ఆకర్షణీయమైన డివిడెండ్లు కూడా తోడవుతాయి.

మార్గదర్శిలోని హితులు మీ ఆశలకూ, ఆశయాలకూ ఒక ఆకృతి కల్పిస్తారు. మార్గదర్శిలో పొదుపు చేస్తే ధనానికి పూర్తి రక్షణ ఉంటుందని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు.

మరి మీ మాటేమిటి ?

**డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!**



## మార్గదర్శి

చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్, ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

శాఖలు: ● ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● చంద్రలోక్ కాంప్లెక్స్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నిసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్

KIRON/MCF/81/1

"ఊ! ఊరకే అన్నాను" బలవంతంగా నవ్వుతూ అన్నాను

"ఊహూ! నువ్వు అబద్ధం చెప్తున్నావు" ప్రమీల నమ్మలేదు

"నిజంగా అంటున్నాను"

"ఆల్ రైట్! నీకు కల వచ్చిందన్నమాట నిజం సంధ్యా! నీతో మాట్లాడదామనే ఇప్పుడు ఫోన్ చేశాను" అంది

"ఏమిటి అంత సీక్రెట్"

"సీక్రెట్ అని కాదు ఇది ఫోన్‌లో మాట్లాడాల్సిన విషయం కాదు సంధ్యా!"

"మరి" నేను చెప్పబోయాను

"పోనీ ఈరోజు ఆఫీసు వదలంగానే ఇంటికి వస్తావా" అంది

"చీకటి పడుతుందేమో" అనుమానంగా అన్నాను

"ఆల్‌రైట్ రేపుగానీ, ఎల్లుండిగానీ నువ్వే తీరికచేసుకుని రా కుదరదంటే నేనే ఆఫీసుకి వస్తాను" అంది ప్రమీల

"ఓ కే" నేను అంగీకరించాను

ఫోన్‌పెట్టేసి ఇవతలకి వస్తుంటే నా మనసేదో కీడు శంకిస్తున్నట్టనిపించసాగింది ప్రమీల అంత సీక్రెట్‌గా మాట్లాడాలన్న విషయం ఏమిటి? ఏమిటో నా మనసంతా చికాకయిపోయింది ఏదో బలమైన కారణం ఉండి ఉంటుంది లేకపోతే ప్రమీల అలా ఫోన్ చేయదు హఠాత్తుగా నా ఆలోచనలు ఇంకోవైపుకి మళ్ళాయి మరి కిరణ్ ఎందుకు ఫోన్‌చేశాడు అతనేమైనా మాట్లాడాలనా? అతను నాతో మాట్లాడే విషయాలేముంటాయి ఒకవేళ నా మనసులో చప్పున ఏదో ఆలోచన స్ఫురించింది మైగాడ్ నా అరచేతుల్లో చెమట పట్టింది అన్నాచెల్లెళ్ళిద్దరూ ఒకరి తర్వాత ఒకరు ఫోన్‌చేశారు ఎందుకు? ప్రమీల మిమ్మల్నొకసారి రమ్మంది కిరణ్ మాటలు ఇంకా ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి 'నీతో సీక్రెట్‌గా మాట్లాడాలి?' అన్న ప్రమీల గొంతు నెమ్మదిగా ఇంకా చెప్తున్నట్టే ఉంది ఏమిటి వీళ్ళ ఉద్దేశం? వీళ్ళిద్దరూ ఏకమై

## జీవితవనంలో కొత్తగాలి

నన్ను ఏడిపించటంలేదు కదా! ఇందులో ప్రమీల పాత్ర ఎంతవరకు?

ఏమిటో! అన్నీ అంతూ దరీ లేని ఆలోచనలు నా మనసులో ఏదో అంతు తెలియని అనుమానం కుర్చీలో కూర్చుని అరచేతిల్లో గడ్డం ఆన్చుకుని కూర్చుని ఆలోచనలతో కొట్టుకుపోతున్న నేను ఎవరో పిలిచినట్టయి ఉలిక్కిపడి చూశాను.

"అయ్యగారు రమ్మంటున్నారు" కబురు కాస్త అందించి చంద్రయ్య వెళ్ళిపోయాడు నేను గాఢంగా నిట్టూర్చి ఫైలు తీసుకుని ఆఫీసర్ రూమ్ వైపు నడిచాను

### 8

"ఏమిటి ప్రమీ! ఏమిటి నువ్వంటున్నది?" నిర్ఘాంతపోతూ అన్నాను

"నిజం సంధ్యా! ముందు నేనూ నమ్మలేకపోయాను కానీ నా కళ్ళతో నేను స్వయంగా రెండు మూడుసార్లు చూసిన తర్వాతే నీకు చెపుతున్నాను" ప్రమీల రెండోసారి అంత ఖచ్చితంగా చెప్తుంటే నా మొహం పాలిపోయింది చప్పున తల వంచుకుని గడ్డిపరకలు లాగసాగాను

అంతకు రెండు రోజుల ముందు నాతో మాట్లాడాలి అంటే ఇంకేమిటో అనుకున్నా తర్వాత రెండు రోజులూ ప్రమీలను కలవటానికి నాకు వీలుపడలేదు మూడోరోజు ప్రమీలే స్వయంగా మా ఆఫీసు కొచ్చేసరికి నేను ఆశ్చర్యపోయాను ఇద్దరం వచ్చి పార్కులో కూర్చున్నాము

"ఏమిటోయ్ అంత సీక్రెట్‌గా మాట్లాడాలన్నావు" ఆ మాటలంటుంటే నా గుండెలు దడదడలాడాయి ప్రమీల నాతో చెప్పబోయే ఆ సీక్రెట్ వినటానికి నేను ఊపిరి బిగబట్టి వేచి చూడసాగాను ప్రమీల చప్పున ఏమీ చెప్పలేదు తటపటాయిస్తున్నట్టుగా నా మొహంలోకి చూడసాగింది నేను ప్రశ్నార్థకంగా మొహంపెట్టి చూస్తున్నాను

ఉన్నట్టుండి నా చేతిని తన చేతిలోకి తీసుకుని



ప్రముఖ ఆంధ్ర నటుడు, మేకప్ నిపుణుడు డక్టర్ చంద్రశేఖరంని తమిళనాడు ప్రభుత్వం ఇటీవల సన్మానించింది ఆ సందర్భంగా ఆయనని అభినందిస్తున్న తమిళనాడు ప్రభుత్వ యువజన సర్వీసుల డైరెక్టరు శ్రీ నటరాజన్, ప్రభుత్వ ఫిలిం టెక్నాలజీ ఇన్‌స్టిట్యూట్ ప్రిన్సిపాల్ శ్రీ నీలకంఠన్ (మధ్యనున్నవారు), డా చంద్రశేఖరం మేకప్‌లో ఉన్న ఫోటోలని చిత్రంలో చూడవచ్చు

నిమురుతూ "సంధ్యా మనిద్దరం ప్రాణస్నేహితులం! అవునా?" అంది

నేను అవునన్నట్టు తలూపుతూ "ఇప్పుడు కాదని ఎవరన్నారు?" అన్నాను

"నేను ఎప్పుడూ నీ శ్రేయస్సు కోరే వ్యక్తిని అని నమ్ముతావా" అంది

నేను ఆశ్చర్యంగా చూడసాగాను ప్రమీల ఇలా మాట్లాడుతున్నదేమిటి చాలా సంవత్సరాల తర్వాత మళ్ళీ ఈరోజు ప్రమీల ఈ ప్రశ్న వేసింది

"ఇప్పుడివన్నీ ఎందుకు అడుగుతున్నావు?"

"కావాలి ముందు నాకు సమాధానం చెప్పు"

"ఈ ప్రపంచంలో నా శ్రేయస్సు కోరే వ్యక్తుల్లో నువ్వు మొట్టమొదటి దానివి సరేనా!" నేను మనస్ఫూర్తిగానే అన్నాను ఆ మాటలు

"సంధ్యా! నేను చెప్పే విషయం విని నువ్వు ఆవేశ పడవుగా" ప్రమీల సంశయంగా అంది

"ఊహూ" అన్నాను అప్పటివరకూ ఉగ్గబట్టుకుని ఎదురుచూస్తున్న క్షణం వచ్చేసినట్టనిపించింది

"సంధ్యా! శశి గురించి నువ్వు ఎప్పుడైనా ఆలోచించావా?" ప్రమీల సీరియస్‌గా అడిగింది

ఒక్కసారి గట్టిగా శ్వాస తీసుకున్నాను హమ్మయ్య అనుకున్నాను అంతలోనే అదేమిటి ఇలా అడుగుతోంది అన్న అనుమానం వచ్చింది

"అదేం అలా అడుగుతున్నావు"

"అబ్బ సంధ్యా! అన్నీ ఎదురు ప్రశ్నలు వేస్తున్నావు" కోపంగా అంది

"మరి నువ్వు చెప్పేదానికి తలా తోకా ఉండటం లేదు."

ప్రమీల వెంటనే ఏమీ అనలేదు



"ఇదేనా ! నువ్వు చెప్పదలుచుకున్న సీక్రెట్" నా కెందుకో చాలా ఆశాభంగంలా అన్పించింది

"శశి ఈమధ్య సక్రమంగా ఇంటికి వస్తోందా? కాలేజీకి సరిగ్గా వెడుతోందా ?" ప్రమీల మెల్లగా అంది

వాలో ఏదో అనుమానం కదిలింది ఒక్కసారిగా వాస్తవంలోకి వచ్చిపడ్డాను

"ఏమిటి సమాధానం చెప్పవేం' ప్రమీల రెట్టించింది

"ఉహూ ! నేనింటికి వెళ్ళేసరికా చీకటి పడుతోంది అది సరిగ్గా రోజూ కాలేజీకి వెడుతూనే ఉందనుకుంటున్నాను ఏం చెప్పటం లేదా" చివరగా కొంచెం అనుమానం ధ్వనించింది నా మాటల్లో

"ఏమో ! నాకూ తెలియదు కానీ "



## జీవితవనంలో కొత్తగాలి

"ఊ! చెప్పు మళ్ళీ కానీలు అర్థణాలు ఏమిటి ?"

"శశిని ఈమధ్య పబ్లిక్ గార్డెన్స్‌లో చూశాను సంధ్యా!" తటపటాయిస్తూ అంది ప్రమీల

"ఫ్రెండ్స్‌తో వచ్చి ఉంటుంది"

"అవును"

"మరి! అందులో విశేషం ఏముంది ?"

"విశేషమే మరి! ఆ ఫ్రెండ్ ఆడో, మగో తెలుసుకున్నావా ?"

ఆ మాట వినగానే నేను అంతెత్తున ఎగిరి పడ్డాను

"ఏమిటీ ?"

"అవును సంధ్యా! ఒకసారి టాంక్‌బండ్‌మీద చూశాను ఇంకోసారి మార్నింగ్ షోకి వెడితే నా ముందు సీట్లో ఓ కుర్రాడితో సంధ్యా! ఏయ్! ఏమిటి నీ మొహం! నీమీద ప్రామిస్ నేను మొట్టమొదట ఎట్టేంచుకోలేదు రెండోసారి సినిమాహాల్లో చూశాక కాని నా అనుమానం ధృడపడలేదు" ప్రమీల చెప్పటం ఆపేసింది

నేను నోరు తెరుచుకుని ప్రమీలనే చూడసాగాను మై గాడ్! ప్రమీల చెప్పేది నిజమా! ఏమో ఎందుకు కాకూడదు ?

"సంధ్యా" ప్రమీల నా చేతిమీద తట్టింది

ఒక్కసారిగా నాకు చెప్పలేని నీరసం వచ్చేసింది నుదుట చిరుచెమటలు అలుముకున్నాయి రుమాలుతో అద్దుకుంటూ,

"నా కప్పుడే ఎందుకు చెప్పలేదు" అన్నాను

"నాకా అనుమానం రాంగానే నీకు చెబుదామనుకున్నాను అసలే నువ్వు ఊపిరి ఆడనట్టు ఆఫీసు పనితో సతమతమవుతుంటావు దానికితోడు కుటుంబ చికాకులు"

"అయితేమాత్రం"

"అదికాదు సంధ్యా! ఒకరోజు కోఠీ సెంటర్‌లో చూశాను నన్ను చూసి అతనితో మాట్లాడుతున్నదల్లా చప్పున ఇవతలకొచ్చి నిలబడింది తర్వాత నన్ను అప్పుడే చూసినట్టు పలకరించింది ఇది జరిగి నాలుగు రోజులయింది" అంది ప్రమీల

నేను ఏం చెయ్యాలో తోచనిదానిలా కూర్చుండిపోయాను నిండా ఇరవై సంవత్సరాలు లేని శశి ఇలా ఎవరితోనో తిరుగుతోందంటే, మై గాడ్! నాకే నమ్మశక్యం కావటం లేదు ఎలా పరిష్కారం అవుతుంది ఈ సమస్య ? ఇన్నాళ్ళ పిల్ల చదువుల గురించిన ఆలోచనలలో ఇంకే విషయం పట్టించుకోలేదు అవును శశికి, ఉషకి, మీనాకి పెళ్ళిళ్ళు కూడా చేయాలి కదూ? ఇదేమిటి నాకీ ఆలోచనే ఇంతవరకూ రాలేదు శశికి అతనితో అసలు ఎలా స్నేహం అయింది ? ఏమో! ఆ స్నేహం అసలు ఎంతవరకు వెళ్ళిందో ? భగవంతుడా! ప్రమీల నా ఆత్మీయురాలు నా క్షేమం కోరే వ్యక్తి! నాతో ప్రాణం పోయినా కూడా అబద్దం చెప్పదు

(ఇంకా వుంది)

( గత సంచిక తరువాయి )
















[ఇంకా ఉంది]

# మనిషి మనిషికి మధ్య...

– 'పెద్దసి'

ఎదురుగా అనంతమైన సముద్రం పూర్ణ్యాస్తమయ కాంతి నీటి అలలమీద ఎర్రటి సింధూరంలా ప్రతిఫలిస్తూ, చూస్తున్న నా కళ్ళకు మిరుమిట్లు గొలుపుతూ అనిర్వచనీయమైన ఆనందాన్ని కలిగిస్తున్నది చల్లటి వుప్పగాలి మనస్సుకు సేద తీరుస్తున్నట్లుగా వున్నది నీటి అలలు నా పాదాలను చల్లగా తాకుతూ తిరిగి సముద్ర గర్భంలోనికి పరుగులు తీస్తున్నాయి నిత్యం పేషంట్లతో విసిగిపోతున్న నేను, ప్రతిరోజు సంధ్యా సమయంలో ఇంటిదగ్గర నుండి నడచివచ్చి ఈ సముద్రపు ఒడ్డున కూర్చుని, తదేక ధ్యానంతో సముద్రాన్ని వీక్షించటం అలవాటు చేసుకొన్నాను దీని వలన నా మనస్సుకి చాలా రిలీఫ్‌గా వుంటుంది అలల మాదిరే నా మనస్సులోని ఆలోచనలు కూడ వువ్వెత్తున ఎగిసి పడుతున్నాయి తెల్లవారితే రాజా వచ్చేస్తాడు మధురమైన జీవితాన్ని వూహించుకొంటూ, భవిష్యత్తును గూర్చి తియ్యని కలల్లో తేలిపోతూ గంపెడాశతో వస్తున్న రాజాని ఏమని సమాధాన పరచాలి ? ఈ విషయాన్ని రాజాకి ఎలా చెప్పాలి ? వాడిని పెంచిన తల్లిగా వాడికి పరిపూర్ణమైన జీవితాన్ని ఏర్పాటు చేయవలసిన నేను నా అభిరుచులకు, నా ఆలోచనలకు తగ్గట్లుగా నడచుకోమంటే వాడు నా మాట మన్నిస్తాడా ? కాని, అంతరాంతరాల్లో రాజామీద ఏదో నమ్మకం వాడిలో సహజమైన మానవత్వాన్ని మరువనీయకుండా నా కొడుకుగా కంటే కూడ, వ్యక్తిగా వాడిని తీర్చి దిద్దుకొన్న నా పెంపకం నాకు ఒక విధమైన ధైర్యాన్ని కలుగ చేస్తున్నది తన జీవిత సమస్యను రాజా మానవతా దృష్టితోనే పరిష్కరించుకోగలడనే కొండంత ఆశ నన్ను ఈ విషయం వాడికి చెప్పటానికి పురిగొల్పుతున్నది





ఉదయం రాజా వ్రాసిన లెటరు చూచిన దగ్గర నుంచి నాలో ముసురుతున్న ఈ ఆలోచనల వుధృతం తగ్గి మెల్ల మెల్లగా మనస్సును ప్రశాంతత ఆవరించింది చల్లబడిన మనస్సుతో ఒకసారి గుండెల నిండా వూపిరి పీల్చుకొన్నాను చుట్టూ పరిసరాలను పరికిస్తున్న నాకు నావైపే వస్తున్న సునీత కనిపించింది ఈ సమయంలో నేను ఇక్కడ వుంటానని సునీతకు తెలుసు మెల్లగా నడుస్తూ వచ్చి నా ఎదురుగా ఇసుకలో కూర్చున్నది

''ఆంటీ ! నన్ను ఎందుకో రమ్మన్నారట ?''

మబ్బులు కమ్మిన చంద్రునిలా అస్పష్టంగా సునీత మొహంమీద బాధామయ రేఖలు కప్పబడి వున్నాయి కాంతులీనుతూ మెరుపులు కురిపించవలసిన ఆ కళ్ళు వర్షించటానికి సిద్ధమౌతున్నట్లుగా నీలినీడలు పరచుకొని వున్నాయి అందమైన ఆ ముఖంలో జీవకళ నశించి నిర్లిప్తతా భావం చోటు చేసుకొన్నది ఆ కళ్ళల్లో నిస్సహాయత కొట్టవచ్చినట్లుగా కనిపిస్తున్నది శరీరం నల్లబడి కొంచెం చిక్కినట్లుగా వున్నది మనస్సుల్లోని ఆవేదన శరీరంమీద ఎంతటి ప్రభావము చూపుతుందో సునీతను చూస్తున్న నాకు అర్థం అవుతున్నది తననే తేరిపార చూస్తున్న నేను సునీత ప్రశ్నతో ఈ లోకంలోకి వచ్చి ''రేపు రాజా వస్తున్నాడు'' అన్నాను క్షణంసేపు వులిక్కిపడిన సునీత సర్దుకొని కళ్ళు క్రిందకు వాల్చుకొని కూర్చుండిపోయింది ఆ మొహంలో కనిపిస్తున్న బాధ నా గుండెను నలిపినట్లయింది ఆ స్థితిలో సునీతను చూస్తుంటే హృదయం ద్రవించగా ఆప్యాయతతో సునీత తల నిమురుతూ వుండిపోయిన నాకు కర్తవ్యం గుర్తు వచ్చి ''సునీ ! జరిగినదానిని గురించి మర్చిపో, ఆ సంఘటనే తలంచుకొంటూ నిన్ను నీవు తక్కువ చేసుకొంటూ బ్రతకటం నేను సహించలేనని నీకు తెలుసు జరిగినదానిలో నీ ప్రమేయం ఏమీలేదు ఆ భయంకర క్షణాలను నీ జీవితం నుంచి తొలగించి తిరిగి నీవు ఎప్పటిలా వుంటూ నా రాజాకి ఆనందాన్ని పంచి ఇవ్వాలి గతాన్ని త్రవ్వుకొంటూ మీ ఇద్దరి జీవితాలను నరకం చేసుకోవద్దు నీ నిర్మలమైన మనస్సు చూచే నిన్ను నా కోడలిగా స్వీకరించటానికి సిద్ధపడ్డాను ఇప్పుడు కూడ ఆదే దృష్టితో నిన్ను స్వీకరిస్తాను నీ శరీరం కళంక పూరితమైనా నీ మనస్సు నిష్కళంకమైనదని నాకు తెలుసు నేను రాజాకి జరిగిన విషయం గురించి చెబుతాను వాడు నిన్ను విశాలమైన మనస్సుతో స్వీకరిస్తాడనే నా నమ్మకం '' దృఢమైన విశ్వాసంతో ఈ మాటలు నా నోటినుండి వెలువడ్డాయి చివాలున తల ఎత్తి నా మొహంలోకి ఆరాధనా పూర్వకంగా చూస్తున్న సునీత కళ్ళల్లో చెప్పలేని కృతజ్ఞతా భావం గోచరించింది

''ఆంటీ ! మీరు దేవతలు '' అస్పష్టంగా గొణిగింది సునీత ''చీకటి పడింది వెళదాం పద'' అంటూ లేచి నిలబడ్డాను

రాత్రి పది గంటలు అయివుంటుంది బెడ్ లాంప్ వెలుగులో శరత్ ''శేష ప్రశ్న'' చదువుతున్నాను శరత్ సాహిత్యంలో నాకు ఇష్టమైనది శేషప్రశ్నే అందులో కమల పాత్ర చిత్రణ చూస్తుంటే స్త్రీలంతా అంతటి ఆత్మ విశ్వాసంతో, వ్యక్తిత్వంతో బ్రతికే స్థితికి ఎదగాలని ఆశిస్తూ శరత్ ఆ పాత్రను సృష్టించాడనిపిస్తుంది లేకుంటే

# చేనేత వస్త్రాల అందాల ప్రపంచంలోకి అడుగిడండి!




20%
ప్రత్యేక
రిబేటు

**హైదరాబాదు**
**ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో**
**1981, నవంబరు 1 నుండి**
**30 వరకు**

రండి! ఈ వర్ణమయ చేనేత ప్రపంచంలోని అందచందాల్ని ఆస్వాదించండి - దేశంలోని వివిధ రాష్ట్రాల చేనేత పనివారి నాణ్యతను చూసి అబ్బురపడండి! నూలు, పట్టు, నూలు/పాలియెస్టర్ కలనేతలు, జరీచీరలు — అత్యంత నేర్పరితనంతో మిమ్మల్ని అచ్చెరువొందించే అసమాన చేనేతల్లో మీకు నచ్చినవి ఎంచుకోండి! సాంప్రదాయపు నేషనల్ హ్యాండ్లూమ్ ఎక్స్‌పో 81 లో మీకోసం వేచిఉన్నాయి మిమ్మల్ని ముగ్ధులనుకావించే ముచ్చటైన చేనేతలు!

ఎక్స్‌పో-సమయాలు
రోజూ మధ్యాహ్నం
**3-00** నుండి రాత్రి **9-00** వరకు
ఆదివారాలు మరియు సెలవు దినాల్లో
ఉదయం**11-00** నుండి రాత్రి
**9-00** వరకు

ప్రముఖ కళాకారులచే ప్రతి రాత్రి
నవంబరు **11** నుండి **30** వరకు
సాంస్కృతిక కార్యక్రమాలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సహకారంతో
ది డెవలప్‌మెంట్ కమీషనర్ ఫర్
హాండ్లూమ్స్ మినిష్ట్రీ ఆఫ్ కామర్స్
గవర్నమెంట్ ఆఫ్ ఇండియా
వారిచే ఏర్పాటు చేయబడినది

KIRON/ NH /813

# మనిషి మనిషికీ మధ్య

అతని జీవితంలో కమల లాంటి స్త్రీలు ఎవరైనా తారసపడ్డారేమో! భారతదేశంలో పుట్టిన ప్రతి స్త్రీకి పవిత్రత పేరుతో ఈ సంఘం ఎన్నో కట్టుబాట్లు విధించింది ఈ దేశంలో న్యాయానికి కూడ జాతి విబేధాలున్నాయి డాక్టర్‌గా నా దైనందిన జీవితంలో దగాపడిన స్త్రీలను, ఈ సమాజంలో వంచింపబడిన స్త్రీలనూ ఎంతోమందిని చూస్తుంటాను వారి శారీరక అశ్వస్థతలకు వారి మానసిక అశాంతే కారణం అనిపిస్తుంటుంది పరిస్థితులలో రాజీ పడలేక, వున్న పరిస్థితులను అధిగమించి ముందుకుపోయే ధైర్యం లేక, నిత్య సంఘర్షణలో శారీరకంగా, మానసికంగా రోగగ్రస్తులైన స్త్రీలు ఎందరో నా 'క్లినిక్'కి వస్తుంటారు వారి బాధామయ జీవితాలను గురించి వింటుంటే మనిషిలోని మానవత్వం రోజు రోజుకి ఎంత సన్నగిల్లిపోతున్నదో అర్థం అవుతుంటుంది జీవితంలో ఏ విలువలకు ప్రాధాన్యత ఇవ్వకుండా పురుషులమనే అహంకారంతో ప్రవర్తించే వారు కొందరైతే, రాక్షసత్వంతో తమ పశువాంఛతో స్త్రీల జీవితాలను నలిపి నాశనం చేస్తున్న వారు మరికొందరు వీరి చర్యలు వింటుంటే హృదయం బాధతో పిగిపోతుంటుంది స్త్రీ జీవితానికి, శీలానికి విలువ ఇవ్వని ఈనాటి సమాజ పరిస్థితులు బాగుపడి తిరిగి స్త్రీల జీవితాలలో వెలుగు రేఖలు విచ్చుకొనే సమయం ఎప్పటికైనా వస్తుందా? అనేదే నా నిరంతర ఆలోచన ఈ పరిస్థితులను తట్టుకొని కమలలా ప్రతి స్త్రీ ఎదగాలంటే సాధ్యపడకపోవచ్చు కాని అటువంటి స్థితిని సాధించిన స్త్రీ తానూ ఒక వ్యక్తిగా తన జీవితాన్ని మలచుకోగలదు బహుశా శరత్ అదే ఆశించి వుంటాడేమో! పుస్తకం మూసి లైటు ఆఫ్‌చేసి నిద్రకుపక్రమించాను తెల్లవారితే రాజా వచ్చేస్తాడన్న ఆలోచన నా కళ్ళకు నిద్రను దూరం చేస్తున్నది

* * *

అద్దంలో మోహం చూసుకొంటూ పౌడర్ అద్దుకుంటున్న రాజాను చూస్తుంటే నాకు రాధను చూస్తున్నట్లుగానే వుంది రాజాలో రాధ పోలికలు చాలా వున్నాయి రాధలా రాజాకూడ పొడగరి వైట్ కలర్ ప్యాంట్‌లో సిలం గళ్ళషర్టు టక్ చేస్తున్న రాజా మొహంలో ఆనందం కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నది అది సునీతను కలుసుకోబోయే ఆనందమని నాకు తెలుసు రాజా, సునీత చిన్నప్పటి నుంచి కలిసే పెరిగారు నా హాస్పటల్ ప్రక్కనే సునీత వాళ్ళ ఇల్లు బి ఎ, కంప్లీట్ చేసిన సునీత ఇంట్లోని ఆర్థిక పరిస్థితులవలన జాబ్ చేస్తున్నది సునీతలో కనిపించే నిరాడంబరత, మంచితనం, ఆ నిష్కల్మషమైన హృదయం సూదంటురాయిలా రాజాను ఆకర్షించినట్లే నన్నూ ఆకర్షించాయి అందుకే వారి స్నేహానికి నేను ఎన్నడూ అడ్డు చెప్పలేదు చదువు పూర్తవగానే సునీతనే చేసుకొంటానన్న రాజా కోరికను నేను కాదనలేదు సునీతకు నా దగ్గర చనువుతోపాటు నేనంటే గౌరవం కూడ వుంది పవిత్రమైన స్నేహంలో నుంచి పుష్పించిన వారి అనురాగానికి ఈ సంఘటన ఆటకం కాదు కదా? లేదు లేదు పవిత్రత అనేది హృదయాలదేగాని శరీరానికి వర్తించేది కాదు ఈ నిజాన్ని గ్రహించగల రాజా తప్పకుండా సునీతను స్వీకరిస్తాడు.

"అక్కడే నిలబడిపోయావే మమ్మీ, లోపలికి రా!" అన్న రాజా పిలుపుకు వులిక్కిపడి లోపలకు నడిచాను

"ఎక్కడికి బయలుదేరావు?" ప్రశ్నించాను

"సునీతను కలవటానికి మమ్మీ!" టై కట్టుకొంటూ మొహంలో వింతకాంతి మెరుస్తుంటే సమాధానం ఇచ్చాడు రాజా రాజా నోటివెంట సునీత పేరు వింటుంటే ఆనాటి సునీత రూపం నా కళ్ళముందు సాక్షాత్కరించింది ఆ రోజు —

మెడికల్ జర్నల్ తిరగేస్తున్న నేను "ఆంటీ!" అన్న పిలుపు వినిపించి తల ఎత్తి చూశాను

ఆంటీ! అంటూ సుడిగాలిలా బావురుమంటూ చుట్టేసుకొంది నన్ను సునీత క్షణంసేపు దిమ్మెర పోయిన నేను నన్ను నేను నిగ్రహించుకొని నా ఒళ్ళో వెక్కి వెక్కి ఏడుస్తున్న సునీతను లేపి సరిగా కూర్చో బెట్టాను తలవంచుకొని వున్న సునీత కళ్ళ వెంబడి అశ్రుధార అవిరళంగా ప్రవహిస్తున్నది ఆ ఏడుపు తగ్గేవరకూ నేను ఎదురుగా కూర్చొని మౌనంగా సునీతనే తిలకిస్తూ వుండిపోయాను ఆనాటి సునీత రూపం చూస్తున్న నాలో ఆశ్చర్యం, బాధ పెల్లుబికి నన్ను అచేతనంగా చేసినవి వాడిన పూవులా వుంది సునీత రూపం సునీత దుఃఖంలో తన కన్యాత్వాన్ని పోగొట్టుకొన్న అభాగిని పొందే ఆవేదన వుంది ఆ కళ్ళల్లో ద్వేషం అవమానం, నిస్సహాయత ముప్పిరిగొనివున్నాయి చెదిరిన ముంగురులతో అస్తవ్యస్తంగా వున్న సునీత రూపం డాక్టర్‌నైన నాకు పరిస్థితిని క్షణంలో తెలియచెప్పాయి అయిపోయింది ఆడదాని శీలానికి రక్షణలేని ఈ దేశంలో రోజూ ఎంతోమంది నిస్సహాయులైన స్త్రీలు పురుషుడి పశువాంఛకు బలి అవుతున్నట్లే, సునీత కూడ తన శీలాన్ని బలి చేసుకొన్నది జరిగిందదే అందుకే సునీత మూర్తీభవించిన శోకదేవతలా వుంది లేకుంటే కన్నీరు కార్చవలసిన అవసరం సునీతకు లేదు నా మనో వీధిలో రాజా మెదిలాడు రాజా గుర్తువచ్చిన నాలో విపరీతమైన బాధ సుళ్ళు తిరిగింది మెల్లగా లేచి సునీత తల నిమురుతూ,

"సునీ! ఎలా జరిగిందిది?" ప్రశ్నించాను

"మా ఆఫీసర్ రాస్కెల్ వాడు నన్ను టైప్‌చేసే కాగితాలు వున్నాయని రూమ్‌కు పిలిపించి నన్ను నన్ను బలవంతంగా" బాధతో కంఠం పూడుకొని పోగా తడబడుతూ మెల్లగా సమాధానం ఇచ్చింది జుగుప్సాకరమైన ఆ దృశ్యం తిరిగి గుర్తు చేసుకొనేటప్పటికి భయంతో ఆకులా గజగజా వణికిపోయింది సునీత నిశ్చలంగా నిలబడి వింటున్న నాకు పరిస్థితి అర్థం అయింది కాల ప్రవాహంలో వెనక్కు వెళితే ఇదే సంఘటన నాతో పాటు నా తల్లి రక్తం పంచుకొని పుట్టిన నా చెల్లెలు రాధ విషయంలో కూడ జరిగింది మనసిచ్చి వంచనకు గురికాబడ్డది రాధయితే, దౌర్జన్యంగా దోపిడీకి గురి అయింది సునీత ఏ విధంగా వంచింపబడ్డా నష్టపోయేది ఆడదే రాధ వంచనకు ప్రతిస్వరూపమే రాజా మనసిచ్చిన మనిషిని మర్చిపోలేని, పెంచుకొన్న మమతలను చంపుకోలేని రాధ తన గర్భంలో పెరుగుతున్న అతని ప్రతి స్వరూపాన్ని పెంచి పెద్దచెయ్యాలని అనుకొన్నది కాని రాజా ఈ లోకంలోకి ప్రవేశించటంతోపాటే రాధ ఈ లోకం నుంచి నిష్క్రమించింది తల్లిని, తండ్రిని, తోబుట్టువును అందరిని పోగొట్టుకొని ఏకాకిగా మిగిలిన నేను రాజాని నా ఆశయాలకు, అభిరుచులకు అనుగుణంగా తీర్చిదిద్దాలనే ధ్యేయంతోనే బ్రతుకుతున్నాను ఇటువంటి దారుణ సంఘటనలు సున్నిత మనస్కులైన స్త్రీలమీద ఎంతటి ప్రభావాన్ని చూపుతాయో, వంచింపబడ్డ రాధ ప్రవర్తన నాకు స్ఫురింపచేసింది ఉత్సాహంతో, ఉరవడితో గలగలా పారే సెలయేరులా కాలం గడిపే రాధ ఈ సంఘటనతో సర్వం కోల్పోయినదానిలా, జీవచ్ఛవంలా కాలాన్ని గడిపింది తిరిగి ఈనాడు ఇదే పరిస్థితిలో సునీతను చూస్తున్న నేను "ఆంటీ ఈ బాధ భరించలేను ప్రాణం పోటానికి నాకేదైనా ఇవ్వండి కళంకితమైన ఈ శరీరంతో రాజాను చూడలేను" అన్న మాటలతో నా ఆలోచనలలో నుంచి బయటపడి కర్తవ్యాన్ని స్ఫురణకు తెచ్చుకొన్నాను

"సునీ! జరగకూడనిదే జరిగింది నేను కాదనను జరిగినదానిలో నీ బాధ్యత ఏమీలేదు అతన్ని నీ శాయశక్తులా ప్రతిఘటించటానికే ప్రయత్నించి వుంటావు అతని పశుబలం ముందు నిన్ను, నీవు రక్షించుకోలేక శీలాన్ని కోల్పోయావు శీలం పోగొట్టుకొన్న నీ జన్మ వృధా అని నీవు అనుకొంటున్నావు ఈ ఆలోచన చాలా తప్పు సునీ!

ఉన్నత విద్యాభ్యాసానికి అమెరికా వెళ్తున్న శ్రీ రాజ్‌కుమార్ గ్రంధి (నల్లకోటు వేసుకున్నవారు)కి యిటీవల ఢిల్లీ విమానాశ్రయంలో ఘనంగా వీడ్కోలు యిచ్చిన సందర్భంగా తీసినచిత్రం ఈయన ఎస్కార్ట్స్ లిమిటెడ్ జనరల్ మేనేజరు డా జి వి ఆర్ మూర్తిగారి కుమారుడు



## మరొక జవహర్

చిల్లరరాళ్లలో జీర్ణ సమాధుల్లో కాకుండా
కష్టించే కార్మికుల్లో రాళ్లుకొట్టే శ్రామికుల్లో
దైవాన్ని చూడగల్గిన ఆస్తికుడతడు
శాంతిని ప్రవచించి కాంతిని ప్రభవించి
పంచశీలను ప్రపంచ దేశాలకు పంచి
మానవ హృదయాల్లో మంచిని పెంచిన
కర్మయోగి అతడు
బాపూ నిత్య సత్య వ్రతాన్ని
నిత్యమూ సత్యంగా పాటించిన
నిజమైన వారసుడతడు

మిలియనీర్ అయినా - తనదంటూ ఏమీ
మిగుల్చుకోకుండా సర్వం దేశానికే అర్పించి — తన
జీర్ణ భస్మాల్ని సైతం పంటపొలాల కర్పించిన
ధర్మయోగి అతడు
ప్రతిపక్షాలు సైతం అప్రతిగా ప్రేమించిన
అజాత శత్రువతడు —
కళ్ల ఎదుట లేకున్నా కోట్ల హృదయాల్లో నిల్చిన
పూజ్య ప్రజామిత్రుడతడు
మరొక్క జవహర్ జన్మించాలంటే
చరిత్ర రెండు వేల వత్సరాలు
నిరీక్షించాలి

— సురాశర్మ

మలినమయినది నీ శరీరామేగాని, నీ మనస్సు కాదని నాకు తెలుసు ప్రతిరోజూ ఎంతోమంది స్త్రీలను ఎన్నో రూపాలుగా ఈ సమాజం దోపిడీ చేస్తున్నది స్త్రీ శీలానికి రక్షణ ఇవ్వకపోగా అత్యాచారానికి గురియైన స్త్రీల పట్ల అమానుషంగా ప్రవర్తిస్తున్నది నీలాంటి వంచితులు ప్రాణాలను బలి చేసుకొన్నంత మాత్రాన క్రూరమైన ఈ సంఘం స్త్రీల పట్ల తన దృష్టిని మార్చుకోకపోగా, నీలాంటి పిరికివారి ప్రోద్బలంతో స్త్రీలను ఇంకా భయపెట్టి బెదిరిస్తోంది నీలాంటి వారంతా పరిస్థితులను ఆత్మవిశ్వాసంతో ధైర్యంతో ఎదుర్కొని తలఎత్తి తిరిగే మనస్థైర్యాన్ని అలవర్చుకొంటే ఇటువంటి సమస్యలకు పరిష్కారం లభించినట్లే పిరికితనంతో ప్రాణం తీసుకోవటం అవివేకం సునీ ఈ ఆలోచన నీ మనస్సులోకి ఎట్టి పరిస్థితులలోనూ రానివ్వకూడదు," అనునయంగా మాట్లాడుతున్న నా వైపు ఆశ్చర్యంగా విప్పారిత నేత్రాలతో చూస్తుండి పోయింది సునీత "ఆంటీ! మీరు నన్ను రాజాను " సునీత కళ్ళల్లో సందేహాన్ని గ్రహించిన నేను "పిచ్చిపిల్లా! నన్నూ, రాజాను నీవు ఇంతేనా అర్థం చేసుకొన్నది ?" అంటూ చిరునవ్వు నవ్వాను ఆంటీ అంటూ ఆశ్చర్యానందాలతో నన్ను చుట్టేస్తూ "ఆంటీ! రాజా లేకుండా నేను బ్రతకలేనని మీకు తెలుసు " గద్గద స్వరంతో గొణిగింది సునీత వారిద్దరి అనురాగం తెలిసిన నా కళ్ళకు సన్నటి కన్నీటి పొర అడ్డుపడింది ఆ తరువాత సునీతకు నేను ఎంత ధైర్యాన్ని కలిగించినా అంతరంగంలో తాను ఏదో తప్పు చేసినట్లుగ ఫీలౌతూ రోజు రోజుకీ శారీరకంగా శుష్కించిపోసాగింది సునీతకు నా మాటలతో తాత్కాలిక వుపశమనం కలిగించగలనే గాని తన అంతరాంతరాల్లో వుబుకుతున్న ఆవేదనను పోగొట్టేది ఒక రాజాయేనని నాకు తెలుసు చిన్నతనం నుంచీ నిజాయితీతో కూడిన స్వభావం రాజాది నిజాయితీ లోపించిన మనషులు వాడి దృష్టిలో మనషులు కానట్లే! అందుకే ఈ విషయాన్ని రాజాకి చెప్పటానికే నిర్ణయించుకొన్నాను వీరిద్దరి జీవితాలకు సంబంధించిన ఈ సమస్యను రాజా మానవతా దృష్టితో పరిష్కరించుకొనగలగటానికి తోడ్పడాలనే నా తాపత్రయం 'మనిషి మనిషికీ మధ్య' వుండే మానవ సంబంధాలను రాజా విస్మరించడనే నా నమ్మకం ఈ విషయంలో నేను ఎంతవరకు కృతకృత్యురాలను కాగలనోగాని, నే నెరిగిన రాజా స్వభావం నన్ను ఈ విషయం రాజా దృష్టికి తెచ్చేందుకు సాహసింపజేసింది జరిగింది చెప్పకుండ మభ్యపెట్టి రాజా జీవితాన్ని వేదనామయం చేసే

# మనిషి మనిషికీ మధ్య

హక్కు నాకు లేదు వాడిని ఎంత ప్రేమతో పెంచినా వాడి జీవితం వాడిది జీవితం పట్ల సరియైన నిర్ణయం తీసుకోవలసింది వాడే "మమ్మీ ఏమిటి ఆలోచిస్తున్నావు ?" రాజా ప్రశ్నతో వాస్తవంలోకి వచ్చాను ఈ విషయం ఎలా చెప్పాలో బోధపడని నా నోటివెంట గాఢమైన నిట్టూర్పు వెలువడింది

"రాజా! సునీ అంటే నీకు నిజమైన ఇష్టం వుందా ?"

ఇది అర్థంలేని ప్రశ్న అని నాకు తెలుసు ఆదుర్దాగా నా వైపే చూస్తున్న రాజా మొహంలో గంభీరత అలుముకొంది

"నీకు తెలియదా మమ్మీ" రాజా కళ్ళల్లో దృఢమైన విశ్వాసం కదలాడింది

"ప్రస్తుతం సునీత మానసికంగా దెబ్బతిని వుంది నీకు సునీత అంటే ప్రేమవుంటే నీవు సునీతను తిరిగి ఎప్పటిలా చేయటానికి ప్రయత్నించు ఈ పని నీ చేతుల్లోనే వుంది " చెప్పవలసిన దానికి ఉపోద్ఘాతంలా చెప్పాను

"సునీకేమయింది మమ్మీ ?" ఈసారి రాజా కళ్ళల్లో ఆందోళన కనిపించింది మెల్ల మెల్లగా మనస్సు వుగ్గబట్టుకొని జరిగింది చెప్పేశాను అంతా విన్న రాజామొహం కోపంతో అరుణ వర్ణందాల్చింది

"మమ్మీ ఏమిటిది ? పశువులా ప్రవర్తించిన ఆ దుర్మార్గుడిని మీరంతా ఎందుకు వదిలివేశారు ? పోలీస్ కంప్లయింట్ ఎందుచేత ఇవ్వలేదు ?" వుద్రేకంతో వూగిపోతూ అరిచాడు రాజా

"రాజా! ఈ విషయం విన్న నీకు వుద్రేకం కలిగేమాట సహజమే కాని జరిగినదానిని సావకాశంగా ఆలోచించి అర్థం చేసుకో మన సమాజంలోవున్న పరిస్థితులు నీకు తెలియనివికావు ఇటువంటి కేసులెన్నో నీవు పేపర్లో చూస్తూనేవుంటావు ఏ న్యాయ వ్యవస్థ ఇటువంటి వారిని పట్టుకొని శిక్షించింది ? పోలీస్ కంప్లయిట్ ఇచ్చినంత మాత్రాన ఈ సమస్యకు పరిష్కార మార్గం లభించి తీరుతుందా ? మన న్యాయస్థానాలు సునీతకు జరిగిన ఈ అన్యాయానికి సరియైన పరిష్కారాన్ని చూపగలవా ? ఏదిఏమైనా నష్టపోయేది స్త్రీయే కదా! ఈ భయంకర సంఘటన సునీత మనస్సుమీద ఎటువంటి ప్రభావాన్ని చూపుతుందో ఆలోచించు నేరస్థుడిని పట్టుకొని శిక్షించినంత మాత్రాన సునీత తిరిగి మామూలుగా అవగలదా ? సునీత మనస్సు నిర్మలమైనదని నీకు తెలుసు నిర్మలమైన అంతఃకరణే మనిషి మనుగడకు ముఖ్యం నశించిపోయే భౌతిక శరీరానికి పవిత్రత పేరుతో ఏవేవో విలువలు ఆపాదించి మనుషులనే బలి పెడుతున్నాము మనిషి కోసమే పవిత్రత కావాలి పవిత్రతకై మనిషి బలి కారాదు రాజా! మనిషిగా మానవత్వంతో ఈ సమస్యను పరిష్కరించు ఆవేశంవలన సమస్యలకు పరిష్కారం దొరకదు ఒక దుర్మార్గుడి కామానికి బలి అయిపోయిన సునీత పట్లసానుభూతితో, విశాలమయిన మనస్సుతో ఆలోచించు సునీత ప్రమేయం ఏమీలేని ఈ సంఘటనతో సునీత జీవితాన్ని బలి చేయవద్దు వంచింపబడ్డ స్త్రీని మన సమాజం ఇంకా ఇంకా వంచనకు గురిచేయాలనే చూస్తుంది గాని, చేయూతనిచ్చి లేవనెత్తాలని ప్రయత్నించదు వారిలో నీవూ ఒకడివి కావటం నాకు ఇష్టం లేదు సునీత అంతరంగాన్నే ప్రేమించావో, బాహ్య శరీరాన్నే ప్రేమించావో నీవే ఆలోచించి నిర్ణయించు భౌతిక శరీరానికి విలువ ఇవ్వని ప్రేమ నీదైతే సునీతను అర్థాంగిగా స్వీకరించు లేకుంటే నీవు సునీతను కలవటానికి వీల్లేదు ఆలోచించి నీ నిర్ణయం చెప్పు " హృదయంలో పేరుకొన్న భారాన్ని దింపుకోగానే, తేలికపడిన మనస్సుతో శరీరంతో రాజాను ఒంటరిగా వదలి గదినుండి నిష్క్రమించాను

ఆ రాత్రి నా రూమ్‌లో శరత్ "చరిత్రహీనులు" చదువుతున్నాను మానవత్వం మూర్తీభవించిన మహాపురుషుడు శరత్ సంఘంచే వంచింపబడ్డ స్త్రీలపట్ల ఆయనకు గల అపారమైన కరుణ, సానుభూతి చూస్తుంటే ఆయనపట్ల ఎనలేని గౌరవభావం కలుగుతుంది అందుకే "పురుషులందు పుణ్య పురుషులు వేరయా" అన్నాడు వేమన భారతి స్త్రీల జీవితాల పట్ల ఆయనకు గల వేదనే శరత్ సాహిత్యంలోని స్త్రీ పాత్రలు శరత్ పట్ల నాకు కలిగిన పూజ్యభావం నా గుండెల నిండా ఆవరించింది పుస్తకం మూసి లేవబోతుండగా హఠాత్తుగా రాజావచ్చి నా వళ్లో తలపెట్టుకొని వుండిపోయాడు మౌనంగా రాజా తలనిమురుతున్న నాతో "మమ్మీ! సునీత లేకుండా నేను బ్రతకలేనని ఆలోచించి తెలుసుకొన్నాను సునీతను నేను మనస్ఫూర్తిగ స్వీకరిస్తాను రేపే సునీతను కలుస్తాను" అంటూ మెల్లగా తన నిర్ణయాన్ని తెలిపాడు నాకు తెలుసు, నేను జయిస్తానని మానవత్వమే ప్రాతిపదికగా పెంచిన నా పెంపకం మీద నాకు అచంచల విశ్వాసం వుంది మనిషిగా బ్రతకటంలోనే మానవ జీవితానికి పరిపూర్ణతవుంది గుండెలు నిండిన ఆనందంతో రాజా తల నిమురుతున్న నా చేతి వ్రేళ్ళ కొనలగుండా నాలోని ప్రేమాభిమానాలు వెల్లువలా ప్రవహించి రాజాని తడిపేస్తున్నాయి 

# పిలుపు

వి. వి. బి. రామారావు



“యావండీ!” అని గోముగా పిలిచి మళ్లీ మౌనంగా ఆలోచనలలో పడిపోయింది సులోచన

ఆమెవంకే అలాచూస్తూ బెడ్‌పక్కన స్టూలు మీద కూచున్న సుధాకర్ లేచి ఆమె తలదగ్గరకు వంగి అడిగాడు—

“ఏమిటి లిల్లీ ఆలోచన ఒంట్లో బాధగా ఉందా ?”

“హా ! లేదండీ ! ” ఆమె పెదవులు వణుకుతున్నాయి

“మీ నాన్నగారికి టెలిగ్రాం ఇచ్చేదా ?”

“వద్దు నాదొక చిన్నకోరిక. కాదనకండి హహా !”

మళ్లీ గట్టిగా నిట్టూర్చింది

“చెప్పు లిల్లీ ! చాక్లెట్ కావాలా ?”

—నవ్వుతూ మళ్లీ స్టూలుమీద కూచున్నాడు

“నవ్వులాట కాదండీ ! మీరిక నన్ను నవ్వించలేరు ఇక నాకు నవ్వురాదు మీ అక్కయ్యగారు మిమ్మల్ని 'బాబీ' అని పిలిచేవారు కదూ! తల్లిలా మిమ్మల్ని పెంచారు మీరిద్దరూ మాటాడుకుంటూ ఉంటే కళ్లారా ఒక్కసారిచూస్తాను ”

“అక్కని రమ్మని రాయమంటావా అంతేనా ? ఓ యస్! ఇప్పుడే రాస్తా ఎల్లుండికి వచ్చేస్తుంది ”

చాలా తేలికగా అనేశాడు సుధాకర్ అతను అంత సులువుగా ఉత్తరం రాయలేడని తెలుసు సులోచనకి

* * *

కెవ్వున కేక వేసింది మీనాక్షి

పక్కనున్న డాక్టర్ కరుణాకర్ లేచి ఆమెను కుదిపి లేపాడు

ఆమె అరుస్తూనే ఉంది

మీద ట్యూబ్‌లైట్ వెలిగాక ఆమె కుదుట పడింది మొహమంతా చెమటపట్టింది

“ఏమైంది, మీనా?”

“ ”

పీడకల వచ్చిందా ?”

“పెద్దమ్మాయిని పిలవ... ”

“ఇప్పుడు టైమెంతయిందో తెలుసా ?”

“ పోనీ నేనే వెళతా !?”

అయోమయంగా చూశాడాయన

ఆమె లేచి పెరట్లోకి వెళ్లిపోయింది

డ్రస్సింగ్ టేబిల్‌మీద కరుణాకరరావ్‌గారికి ఓ ఉత్తరం కంటపడింది “మహాలక్ష్మి సంపన్నురాలైన అక్కకి బాబీ నమస్కరించి వ్రాయునది నేను చేసినది పొరపాటని నేననుకోను కాని నువ్వు పొరపాటే అనుకుంటే ఈ తరుణంలో నన్ను క్షమించి ఒక్కసారి నీ మరదలిని చూడడానికి రా సులోచనకు కాన్పు కష్టమయ్యేటట్టుందని, ఇంకా కొంత టైమున్నా వెంటనే నర్సింగ్‌హోమ్‌లో చేర్పించమని లేడీడాక్టరు సలహా ఇచ్చింది డాక్టరు చెప్పిన మాటల్లో ఏదో ప్రమాదం కనబడుతున్నా నేను సులోచనకు ఏం చెప్పకుండానే చేర్పాను నేను ఎంతో జాగ్రత్తగా దాచాలనుకున్న రహస్యం సులోచనకు ఎలాగో తెలిసిపోయింది తను చనిపోతానన్న భయంతో—కుంగిపోతోంది తనవాళ్లకు ససేమిరా రాయవద్దంది

నన్ను నీబిడ్డలా పెంచావ్ ! అక్కా ! మన మిద్దరం మాటాడుకుంటుంటే చూస్తాననిముచ్చట పడుతోంది నీ మరదలు సులోచన ఇది 'కడసారి కోరిక' అంది ఒక్కసారి వస్తావుకదూ!”—కరుణాకరరావ్ మనస్సు కలుక్కుమంది తనభార్య ఐదేళ్ల బిడ్డనించి పెద్దవాడిని చేసింది—తనబిడ్డలతో సమా

సంగా తన తల్లికిచ్చినమాట నిలబెట్టుకుంది తన మీద వాడికి అంతఅసహ్యం కలిగిందంటే తన పెంప కానికే మచ్చ ఎంత సరిపెట్టుకోవాలన్నా వాడు చేసినపని సమంజసంగా కనబడటంలేదు

అంత మనసుపడితే చదువుకున్నవాడు--యుక్తాయుక్త విచక్షణ తెలిసినవాడు 'నేను ఆ అమ్మాయిని చేసుకుంటా'నంటే తను కాద నేదా?--

- ఉపకారం చేసి మరచిపోవాలన్నారు కుడి చేతితో ఇచ్చినది ఎడమచేతికి తెలియనివ్వకూడదనీ అన్నారు నిష్కామ కర్మ చెయ్యాలన్నారు

— మమతచూసి మమతను అపేక్షించడం తప్పా ?

మమతకు ప్రతిగా మమత రాకపోగా నిరసన భావం--తృణీకరణవస్తే మనసు గాయపడకుండా ఉండగలదా ? --

మనసుని గాయపరచుకోకుండా ఉండడం ఎలా సాధ్యం ? కాని తనేమో భార్యతో ఆనాడే చెప్పాడు

''రెక్కలొచ్చిన పక్షి మరోగూడు కట్టుకుని ఎగిరిపోయింది--దానికోసం నీమనసుకు బాధపెట్టు కోవడం అవివేకం మీనాక్షీ నువ్ ఆ విషయం మరచిపో !

తల్లీ తండ్రీ లేకపోతేనేం చిన్నవాడేమిటి ? వాడికి తెలియనక్కరలేదూ? ఎవరో వాడిని బుట్టలో వేశారంటున్నావ్ !

వాళ్లని నేననను పిడిలోనే ఉంది మన బంగారం మంచిదయితేకదా! పైవాళ్లమీద దుఃఖపడ డానికి

ఎంత ఆలోచించినా ఒక్కవిషయమే నాకు బోధపడుతోంది మన చిన్నమ్మాయిని వాడికి కట్ట బెట్టేదృష్టితో మనం ఈ పెళ్లికి అడ్డుపెడతాం అనుకున్నాడేమో వర్ణాంతరమట మనం పెళ్లికి వెళ్లడంకూడా ఇష్టంలేదన్నమాట ! వాడంతట వాడయ్యాడు వాడిడబ్బు వాడి ఆఫీసు ఎడ్రసుకు పంపేశాను నువ్ అమాయకురాలివి మీనా డబ్బు కోసం ఎన్నాళ్ళు వస్తాడు వాడు! నువ్ కంటతడి పెట్టి ఏం లాభం? అడ్డాలనాడే బిడ్డలన్నమాట ఊరికే వచ్చిందా ? నా ఎదుట వాడి ప్రస్తావన తేకు !''

భార్య మనసు నొప్పే ఏళ్లయి కాపురం చేస్తున్న కరుణాకరరావ్‌కు తెలియనిదికాదు

మీనాక్షి తమ్ముడి ప్రస్తావన మళ్లీ ఎప్పుడూ తేలేదు మాటంటే మాటే

అంతేకాదు ఆమె పడేబాధ తనకూ తెలుసు తమ్ముడి ప్రస్తావన తీసుకురావడం మనసులోని గాయాన్ని కెలికినట్టే అవుతుంది !

కరుణాకరరావ్ ఉత్తరం అక్కడ పడేసి తన పనిలో తను మునిగిపోయాడు

పదకొండుగంటలకి నర్సింగ్‌హోమ్‌లో ఉండగా తనపేర వచ్చింది ఉత్తరం

డాక్టర్ కరుణాకరరావ్ గారికి !

నేనెవరో మీకు చెప్పుకోవలసిన అవసరం ఉంది నేను మీరు పెద్దచేసిన 'బాబీ' గారి భార్య సులోచనని

మీకు చెప్పకుండా నన్ను చేసుకుని, చేసుకున్నాక చెప్పలేదని కుమిలిపోతూ ఈ స్థితిలో ఒంటరి వాళ్ళయే ప్రమాదంలో చిక్కుకున్నారు 'బాబీ' !

నర్సింగ్‌హోమ్‌లో నన్ను జాయిన్ చేశారు నా ప్రాణం ప్రమాదంలోఉందని డాక్టర్ చెప్పినట్లు నా దగ్గర దాచారు

ధైర్యంచేసి ఉత్తరం రాస్తున్నాను

ఆరోజే నేను చచ్చిపోయాననుకుని గుండె రాయి చేసుకున్నారు నా వాళ్ళు నా వాళ్లకు రాసి ప్రయో జనంలేదు వాళ్ళవచ్చినా ఆయన్ను ఆదుకోలేరు

నన్ను చేసుకున్న ఆనందం కంటె మీకు దూర మయ్యానన్న వేదనే ఆయనలో ఎక్కువగాఉంది రోజు రోజుకీ ఆయనకు దిగులు ఎక్కువైపోతోంది

ఆయనది చాలా సున్నితమైన మనసు

జరతారు కలలు బంగారానివే అయినా కలలే నా అన్నవాళ్ల మమతే నిత్యం, సత్యం ఆయన మిమ్మల్ని వదలలేరు

మీరంటే భయం అందుకే ఇలా చేశారు నా మాట నమ్మండి

నా తదనంతరం ఆయన్ను ఆదుకుని ఆసరాగా నిలిచి మీరు ఎంచిన పిల్లనే ఆయనకుచేసి ఆయన మనసులోని మంటలనార్పి నా ఆత్మకి శాంతి చేకూ ర్చండి మీ బాబీమీద కోపం మీ కుంటుందని నేనను కోను నేనేసైదాన్ని మనుషులమీదనున్న ద్వేషం, క్రోధం వారితో బుగ్గిచెయ్యండి పోతు పోతూ నే కోరుకునే కోరిక ఇది

అభాగ్యురాలు
సులోచన--

ఉత్తరం చదివి ఓ నిశ్చయానికి వచ్చారు కరుణాకరరావ్‌గారు

* * *

డాక్టర్ అహల్య నర్సింగ్‌హోమ్ వరండాలో చాలామంది స్త్రీలు ఆమెకోసం వెయిట్ చేస్తు న్నారు సులోచనను చూడాక కరుణాకరరావ్‌గారు నేరుగా లోపలికి వెళ్ళిపోయారు

''హలో డాక్టర్ కరుణాకరరావ్ ! వెరీగ్లాడ్ టు సీయూ ! ఎప్పుడొచ్చారు ఏమిటి విశేషాలు?'' డాక్టర్ అహల్య లేచినుంచుని పలకరించింది

అహల్యా, తనూ పాతికేళ్లక్రితం కలసి చదువు కున్నారు

''ఇప్పుడే వచ్చా ఇటురండి '' దోవలో చెప్పాడు

''నే చూశా ఇక పదినిమిషాల్లో ఆపరేట్ చేసి బిడ్డను తీసెయ్యాలి ''

''ఎవరిగురించి మాటాడుతున్నారు ఈ ఊరెప్పు డొచ్చారు?''

''ఇటురండి ''

సులోచన బెడ్‌దగ్గరకు తీసుకొచ్చాడు--

ఆమెకూడా ఎగ్జామిన్ చేసి--వడివడిగా బయ టకు వచ్చింది

''కమాన్ డాక్టర్ !'' అంటూ కరుణాకర్‌ను వెంటబెట్టుకుని థియేటర్‌కు వెళ్లింది

''మీరు చెప్పింది రైటే కొన్నిరోజులనించే అబ్జర్వేషన్‌లో పెట్టా పొద్దున్న పరిస్థితి ఇలా లేదు ''--ఆవిడ స్టాఫ్‌కి చకచకా ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చేసింది

''మీరు కొంచెం సహాయం చెయ్యాలి ఐ నీడ్ యువర్ బెస్ట్ ''

కరుణాకరరావ్ తనలో ఒక్కక్షణం ఆలోచనలు సుడులు తిరిగాయి

హే భగవాన్ ఏమిటి పరీక్ష !

ఈమె చనిపోతే గాడ్‌ఫర్‌బిడ్ !

నేను కక్షకొద్దీ ఆమెను చంపానని బాబీ అనుకోవచ్చు మనిషికి ప్రాణంపోసేశక్తి నాకులేదే!

— తనకేం తెలుసు--తను ఆ క్షణంలో రాక పోతే నర్సింగ్‌హోమ్ పని ముమ్మరంతో అహల్య వచ్చేసరికి సమయం మించిపోయి ఉండేది --

--తను బాబీ కోసం పలకరించలేదు

ఎవరో డాక్టర్‌లా తను ఆమెను పరీక్ష చేశాడు --

--చూస్తున్న వైద్యురాలికంటె ఘనుడి నను కుని వచ్చాను ఇప్పుడెలా ?

-- లేదా ఇంతవరకూ వచ్చింది ఆమెమంచికే

''బాబయ్యగారూ'' అంటూ స్ట్రెచర్ మీద నుంచి చేతులు జోడించింది సులోచన

''ఏం భయం లేదమ్మా నువ్ కంగారు పడకు నీబిడ్డను నీచేతికిచ్చే పూచీ నాది ''

థియేటర్ లోపలికి స్ట్రెచర్ వెళ్లింది

బాబీ చేతులు జోడించటం, కళ్లు తుడుచు కోవడం కరుణాకరరావ్ చూడలేదు

--థియేటర్‌లోకి అడుగుపెట్టిన కరుణాకర్ రావ్ తలలో మరో ఆలోచన లేదు

గంటయ్యేసరికి కేర్ కేర్ మని పురిటికందు ఏడుపు

''మీరు రాకపోయిఉంటే ఈమె బ్రతికేది కాదు సమయానికి వచ్చారు''

''గాడ్ ఈజ్ గ్రేట్ మరల తీరికగా మాటాడు కుందాం ఐ హేవ్ ఎ సీరియస్ కేస్ ఎట్ హోం ఐ హేవ్‌టు గో'' మాట్లాడుతూనే మాస్కుతీసేసి 'ఐవిల్ మీట్ యూ ఎగైన్'' అంటూ బయటకు వచ్చాడు

''కంగ్రాట్యులేషన్స్ ! ఓ అరగంట తరువాత నువ్ బిడ్డని చూడవచ్చు అన్నట్టు మరచిపోయాను ఆడబిడ్డ '' థియేటర్ ముందున్న బాబీకి చెప్పాడు

ఇంటి కొచ్చేసరికి రాత్రి ఎనిమిదైపోయింది

''మధ్యాహ్నం భోజనానికి రాలేదు ''

''పురిటి కేసుకెళ్లాను నేను పేషెంటును తొందర చెయ్యలేనుగా నీ తమ్ముడికి కూతురు పుట్టింది--నువ్వెళ్లిచూడు రేపు తెల్లారాక!''

భర్త చెబుతూఉంటే అలా నుంచుండిపోయింది ఆ ఇల్లాలు --

''మీరు మీరు వెళ్లారా?''

''పిలుపు వచ్చింది వెళ్లాను వెళ్లకూడదా?

వాడైతే నీకు తమ్ముడు నిన్ను మరచి పోయినా వాడిని నువ్వు మరచిపోయినా అది క్షమార్హ మైన నేరంకాదు

ఆర్తనాదం చేస్తున్న రోగి పిలుపు నందుకో పోతే వృత్తిధర్మం దృష్ట్యా నేను క్షమార్హుణ్ణే ''

భర్త తర్కం మీనాక్షమ్మకి బోధపడలేదు ఆయనవంకచూస్తూ ఆవిడ అలా నుంచుండి పోయింది ●

'బొబ్బిలి పులి'లో రామారావు, జయచిత్ర

'కాళనాగమ్మ'లో మమత



# సినిమా

—జి.వి.జి.

## తల్లి కొడుకుల అనుబంధంలో తల్లకిందులైన తతంగం

జయ (జయప్రద) ఆస్తిపాస్తులకు ఇటుపైన కూడా తననే సంరక్షకుడుగా ఉండమంటుందేమోనని ఆశించాడు రాజగోపాలం (సత్యనారాయణ).

లాయర్ వచ్చి, "అమ్మా, జయా! నిన్నటితో నీ మైనారిటీ తీరిపోయింది. ఈరోజు నుంచీ నువ్వు సర్వ స్వతంత్రురాలివి. ఈ ఆస్తిపాస్తులు, సిరిసంపదలు నీవి," అన్నాడు.

జయ "థాంక్యూ, సర్!" అంది.

లాయర్ ఒకసారి రాజగోపాలం వంక చూసి, "ఇన్నేళ్ళూ పాపం, ఎంతో శ్రమ తీసుకొని నిన్నూ నీ ఆస్తినీ పెంచి పెద్దచేశారు రాజగోపాలంగారు. ఇక నుంచి కూడా ఆయనే నీ ఆస్తిని నిర్వహించాలని ఉంటే, ఈ పవర్ ఆఫ్ అటర్నీమీద సంతకం చెయ్యి. లేదా —ఈ డాక్యుమెంట్ తీసుకో," అన్నాడు.

జయ ఏం చెప్తుందోనని ఆత్రుతతో ఎదురు చూశాడు రాజగోపాలం. కాని, ఆమె డాక్యుమెంట్ తీసుకొని, "ఇప్పటికే బాబాయ్ నా కోసం ఎంతో కష్టపడ్డారు, లాయర్‌గారూ! ఇక నుంచైనా కాస్త విశ్రాంతి తీసుకోనివ్వండి. ఈ ఆస్తి వ్యవహారాలు నేనే చూసుకుంటాను," అని వెళ్ళిపోయేసరికి రాజగోపాలం దిగాలుగా లాయర్ వంక చూశాడు.

కె. ఎస్. ఆర్. దాస దర్శకత్వంలో పింజల నాగేశ్వరరావు సమర్పించే "తల్లీ కొడుకుల అనుబంధం" చిత్రానికి ఎం. సుబ్రహ్మణ్యన్ నిర్మాత.

## వి. మధుసూదనరావు, కృష్ణల తొలి చిత్రం

చరిత చిత్ర సమర్పణలో వి. ఎం. డి. ప్రొడక్షన్స్ నిర్మించే చిత్రం షూటింగ్ అక్టోబర్ 27న ప్రారంభమైంది. కృష్ణ, జయప్రద, కవిత, శుభ, పుష్పలత, నిర్మల, సత్యనారాయణ, జగ్గయ్య, గిరిబాబు, రమణమూర్తి, సాయిచంద్, రాళ్ళపల్లి, పి. ఎల్. నారాయణ పాత్రధారులు. సత్యానంద్ సంభాషణలకర్త. శ్రీశ్రీ., ఆత్రేయ గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు. పుష్పాల గోపీకృష్ణ, సాయికుమార్, ఆదుర్తి హరనాథ్, తార, ఎస్. దామోదర్ ప్రభృత సాంకేతికవర్గంతో విష్ణుప్రసాద్ శర్మ నిర్మాత.

## మాయదారి అల్లుడులో
## వృత్తి ధర్మాన్ని తప్పని ఉన్నతాధికారి

రహస్య స్థావరం ... బందీగా ఉన్న మోహన్ (శ్రీధర్) ఎదుట పాండురంగం (సత్యనారాయణ) నిలుచొని, "చెప్పు ఎక్కడ దాచారా నగలు? అవే... నువ్వూ, నీ బావమరిదీ చాలా తెలివిగా నకిలీ నగలు పెట్టి దోచుకుపోయారే — అసలు నగలు ... అవి!" అని గద్దించాడు.

"నాకు తెలియదు," అన్నాడు మోహన్.

"మోహన్! నువ్వు పోలీస్ ఆఫీసర్ వి. నేరస్థులు సులభంగా నిజం ఒప్పుకోరని నీకు తెలుసు. వాళ్ళచేత నిజం ఎలా రాబడ్తారో కూడా తెలుసు," అంటూ పాండురంగం నయాన భయాన ఎంతో చెప్పి చూసి, చివరికి మోహన్ భార్య లలిత (గీత)ను కూడా అక్కడికి బలవంతంగా తెప్పించాడు. భర్తను ఆ స్థితిలో చూసిన లలితకు ఉప్పెనలా దుఃఖం ముంచుకొచ్చింది. పాండురంగం మరింత కర్కశంగా "స్టాప్! కౌగిళ్ళు, కన్నీళ్ళు అన్నీ తర్వాత ముందు మా పని కానియ్! మోహన్! నీ భార్య గర్భవతి ... అంటే — మూడు ప్రాణాలు ఇప్పుడు మా గుప్పిట్లో ఉన్నాయ్. నిన్ను చంపితే రహస్యం నీతోనేపోతుంది. అది బయటకు రావాలంటే, నీ బిడ్డను మోస్తున్న నీ భార్యను ..." అంటూ వికటాట్టహాసం చేశాడు.

"చావుకు భయపడి అంతరాత్మను చంపుకోలేను. చంపుకోను," అన్నాడు మోహన్.

"షంషేర్! పోలీసాఫీసర్ అంటే అలా ఉండాలి," అంటూ పాండురంగం పక్కకు తిరిగి, తన అనుచరునితో "రేయ్! అయ్యగార్ని మర్యాదగా మన జీప్ వెనక కట్టండి," అన్నాడు.

లలిత భోరున విలపిస్తూ, "వద్దండీ—వద్దు. వారినలా చిత్రహింస పెట్టొద్దు. దయచేసి వదిలి పెట్టండి. మీ కాళ్ళు పట్టుకుంటాను," అంటూ ప్రాధేయపడ్డా — ప్రాధేయపడింది.

"నా కాళ్ళు పట్టుకునేం లాభం? వెళ్ళి నీ భర్త కాళ్ళు పట్టుకో. ఆయనచేత మాక్కావలసిన రహస్యం చెప్పించు," అన్నాడు పాండురంగం.

"ఏమండీ, మనకోసం కాకపోయినా — మన బిడ్డకోసం ..." అంటూ లలిత ఎంత ప్రాధేయపడ్డా — మోహన్ సమాధాన మొక్కటే: అధర్మంతో ప్రాణం పోసుకుని పుట్టడం కన్నా చావడమే మంచిది." దాంతో పాండురంగం మరింత రెచ్చిపోయి, మోహన్‌ను చిత్రవధ చెయ్యమని తన అనుచరునికి ఆజ్ఞాపించాడు.

కృష్ణ, జయప్రద నాయకా నాయికలుగా కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో 'నవభారత్' బాబూరావు నిర్మించిన "మాయదారి అల్లుడు" చిత్రం నవంబర్ విడుదల.


'పుణ్యభూమి కళ్ళు తెరిచింది'లో సంగీత



'డబ్బు! డబ్బు! డబ్బు!'లో మురళీమోహన్, రాధిక

# సినిమా

## ప్రేమ నక్షత్రంలో ప్రేమ కానుక

ఫణీంద్ర (కృష్ణ), శైలజ (శ్రీదేవి) పార్కులో నడుస్తున్నారు.

"శైలూ! ఓ వస్తువు మనదగ్గర ఉన్నప్పటి కంటే — అది దూరమైనప్పుడే దాని విలువ, గుర్తింపు మనకు తెలుస్తాయి. అవునా?" అన్నాడు ఫణీంద్ర.

"అవును. ఇప్పుడా విషయం ఎందుకు?" శైలజ క్రీగంట చూసింది.

"ఆ విషయం నాకు నిన్ననే తెలిసింది, శైలూ! నిన్న నిన్ను చూశాక తెలిసింది. అందుకే నీకు చిన్న బహుమానం ఇవ్వాలని నిర్ణయించుకున్నాను."

"ఏమిటది?"

"చెప్పుకో. చూద్దాం. 'మ'తో మొదలవుతుంది."

"మల్లెపూలా?"

"మట్టిబుర్ర!... ముక్కుపుడక," అంటూ అరచేతిలోని ముక్కుపుడకను చూపించాడు ఫణీంద్ర ధీమాగా.

"ఎక్కడిది?"

"కొన్నాను."

"మరి... డబ్బు?"

"మా ఇంటి ఓనర్‌గారి మూడు కిలోల చిన్నారి బిడ్డకు ట్యూషన్ చెప్పడం మొదలెట్టి, ఓ వంద అడ్వాన్సు తీసుకున్నాను."

"డబ్బు రాగానే నా బాకీ తీర్చేయాలనుకున్నా వన్నమాట? అంటే — నన్ను పరాయిదానిగా అనుకుంటున్నావా?" చిరుకోపంతో చూసింది శైలజ.

"కాదు, శైలూ! నా డబ్బే ఈ జేబులోంచి తీసి, ఆ జేబులో పెట్టుకున్నానన్నమాట ... ఎందుకంటే — నువ్వు నాదానివి కాబట్టి. నేనే నువ్వు కాబట్టి..."

శైలజ ముఖం ప్రకాశవంతమైంది. "చాలండీ — ఈ మాటలు చాలు; నువ్వు నాదానివన్న నాలుగక్షరాలు నాకు వేదాక్షరాలు."

అప్పుడు ఫణీంద్రకు కల్గిన ఆనందం వర్ణనాతీతం.

పి. సాంబశివరావు దర్శకత్వంలో ఎస్. హెచ్. హౌస్పేస్ సమర్పించే "ప్రేమ నక్షత్రం" చిత్రానికి కె. బుజ్జిరెడ్డి, పి. సురేంద్రరెడ్డి, ఎం. రాధారెడ్డి, ఎం. జనార్ధనరెడ్డి నిర్మాతలు. కొమ్మూరి వేణుగోపాలరావు కథకుడు. జంధ్యాల సంభాషణల కర్త. ఎం. ఎస్. విశ్వనాథం సంగీత దర్శకుడు. వి. ఎస్. ఆర్. స్వామి ఛాయాగ్రాహకుడు. కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, వెంకటరత్నం కూర్పు నిర్వహిస్తున్నారు.

'ఏమండోయ్ శ్రీమతిగారూ'లో
నిర్మల, కె. విజయ, గిరిబాబు



# అమ్మా! నా బూటు ఎంత బాగా మెరుస్తుందో చూడు.

టింకూలాంటి బాబు మీకు ఉన్నప్పుడు తెల్ల బట్టలు అతి త్వరగ మురికైపోతాయి. అయినా పరవాలేదు. రీగల్ ప్రతి ఉతుకుకు అధిక తెల్లదనాన్నిస్తుంది.




రీగల్‌కు గల అధిక తెల్లదనాన్నిచ్చే శక్తి మీ బట్టలను తళతళలాడే తెలుపుతోను, వెలుగుతోను మెరిసేలా చేస్తుంది. రీగల్‌కు గల అధిక నురుగునిచ్చే శక్తి బట్టలలోనికి చొచ్చుకొనిపోయి ఎంతటి మురికినైనా తొలగిస్తుంది రీగల్‌కు గల పొదుపు శక్తి ఏ యితర డిటర్జెంట్ సబ్బుకన్న ఎక్కువ ఉతుకులు యిస్తుంది. రీగల్‌ను మీ కుటుంబపు డిటర్జెంట్ సబ్బుగా చేసుకోండి.

## రీగల్

ఇండియాలో అత్యధిక శక్తిగల డిటర్జెంట్ బట్టల సబ్బు

## “సాంప్రదాయ సిద్ధమయిన భారతీయ ఔషధాలకి ప్రత్యేకమయిన శక్తివుంది. ఉదాహరణకి, అమృతాంజన్.”

AMRUTANJAN
Pain Balm
Amrutanjan Ltd.

ప్రకృతిలో లభించే అత్యంత శక్తివంతమయిన పది మూల ఔషధాలతో అమృతాంజన్ తయారు చేయబడుతోంది. అంటే అమృతాంజన్ చాలా శక్తివంతమయినది.

అందుచేత అమృతాంజన్ తలనొప్పులకు, జలుబులకు, వంటినొప్పులకు, బెణుకులకు శీఘ్రంగానూ, నిశ్చయంగానూ ఉపశమనం కలిగిస్తుంది. అంతేకాదు అమృతాంజన్ సురక్షితమయిన బాధా నివారిణి.

**అమృతాంజన్ :**
**80** సంవత్సరాలకు పైబడిన నమ్మకమైన దివ్య ఔషధము

AM-2148

# అమృతాంజన్

## తలనొప్పులకు .జలుబులకు. వంటినొప్పులకు.బెణుకులకు





'నాయుడుగారబ్బాయి'లో కృష్ణ, కవిత

## కోదండరామిరెడ్డి దర్శకత్వంలో ఎన్. టి. ఆర్.

"ఎన్. టి. రామారావుగారు ద్విపాత్రలు నిర్వహిస్తారు," అన్నారు కె. విద్యాసాగర్. ఈయన నిర్మించే ప్రధాన్ పిక్చర్స్ తొలి చిత్రాన్ని కె. ప్రభాకరరావు సమర్పిస్తారు. చక్రవర్తి స్వరకల్పనలో త్వరలో కొన్ని గీతాలు రికార్డ్ చేయబడతాయి. ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు.

## "కళాసాగర్"చే వాక్చిత్రాల స్వర్ణోత్సవం

వాక్చిత్రాల స్వర్ణోత్సవం సందర్భంగా అక్టోబర్ 17న మద్రాసులో "కళాసాగర్" శ్రీ ఎం. ఎస్. రెడ్డి అధ్యక్షతన శ్రీయుతులు ఎల్. వి. ప్రసాద్, భానుమతి, పి. రామకృష్ణ, పి. పుల్లయ్య, ఎస్. రాజేశ్వరరావుగార్లను ఘనంగా సన్మానించింది. తెలుగు టాకీ పుట్టుపూర్వోత్తరాలను గురించి డైరెక్టర్ శ్రీ సి. ఎస్. రావు విపులంగా తెలియ చేశారు. 'మన' సత్యం అందజేసిన రఘుపతి వెంకయ్యనాయుడు, హెచ్. ఎం. రెడ్డి, సి. పుల్లయ్య, గూడవల్లి రామబ్రహ్మం, నాగయ్య, కాంచనమాల, వై. వి. రావు, బి. ఎన్. రెడ్డి, కె. వి. రెడ్డి, ఆదుర్తి సుబ్బారావుగార్ల చిత్రాలను 'తెలుగు సినీ ఆర్టిస్ట్స్ అసోసియేషన్ పబ్లిక్ చారిటీ ట్రస్ట్' నిమిత్తం విక్రయించగా పాతికవేల రూపాయలకు ఫలన చిత్ర ప్రముఖులు కొనుగోలు చేశారు. ఆ మొత్తం ద్వారా వచ్చే వడ్డీతో స్కాలర్‌షిప్ ఇవ్వడం జరుగుతుందని 'కళాసాగర్' ఎగ్జిక్యూటివ్ వైస్ ప్రెసిడెంట్ శ్రీ టి. వి. కె. శాస్త్రి తెలియ జేశారు.







# సినిమా

## సరిత

"హీరోయిన్ ప్రధాన పాత్రగా గల కథ. హీరోయిన్ పేరు సరిత. చిత్రం పేరు కూడా అదే," అన్నారు ఎన్. గోపాలకృష్ణ. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో శ్రీ విజయదుర్గ కంబైన్స్ నిర్మించే చిత్రానికి అక్టోబర్ 17న తొలి గీతం ధ్వని ముద్రితమైంది. గోపీ గీతానికి రోహిణీచంద్ర స్వరకల్పన చేశారు. మన రాష్ట్రంలో ఒకే షెడ్యూల్‌లో పూర్తయ్యే ఈ చిత్రాన్ని కాంచన చిత్ర సమర్పణలో శ్రీమతి వై. శేషారత్నం నిర్మిస్తారు.



పేదరాణీ ఎంటర్‌ప్రైజెస్‌వారి చిత్రంలో
రంగనాథ్, నాగేశ్వరరావు

## హిమబిందు

"గుడ్డిప్రేమలో చెప్పుడు మాటలు తెచ్చిన అనర్థాలకు విడిపోయిన ఇద్దరు ప్రేమికుల మధ్య జరిగిన భయంకరమైన సంఘర్షణ ఈ చిత్ర కథాంశం," అన్నారు సద్గుణా కంబైన్స్‌వారి పై చిత్రానికి నిర్మాణ బాధ్యతలు వహిస్తున్న వి. సి. గణేశన్. సుమలత, రతి, సుమన్, చారుహాసన్, మోతి ముఖ్య పాత్రధారులు. రాజశ్రీ మాటలు, పాటలు రాశారు. ఇళయరాజా సంగీత దర్శకుడు. ప్రసాద్ దర్శకుడు. నవంబర్‌లో విడుదల చేయదలచినట్లు గుమ్మళ్ళ లక్ష్మణరావు తెలియజేశారు.



# బలిపీఠం

కంచుమర్తి వెంకటేశ్వరరావు

"అమ్మా, అదిగో రాజకుమారుడొస్తున్నాడే. అతను నా దగ్గరకు వచ్చాడు. అబ్బ, ఎంత అందంగా ఉన్నాడు. నన్ను పెళ్ళి చేసుకుంటానని నా చెవిలో చెబుతున్నాడమ్మా"

కల్పన ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది.

తండ్రి రామనాధం ఆమె తల మీద చెయ్యివేసి లాలనగా చూసాడు.

"కల వచ్చిందా అక్కా"

మమత అక్క కళ్ళలోకి చూస్తూ అడిగింది.

"ఏంపాడు కలలో అవే మనకి మిగులుతాయి" అంది మాణిక్యమ్మ బాధగా.

సిగ్గుతో కుచించుకుపోయింది కల్పన.

"తప్పయింది నాన్నగారూ"

రామనాధం దోషిలా తల దించుకున్నాడు. కూతుళ్ళ పెళ్ళిళ్ళు చెయ్యలేని అసమర్థుడు. కలల్లో కల్యాణమండపాల్ని తిలకిస్తున్న కన్నకూతుర్ల ఊహల్ని వాస్తవాలుగా చెయ్యలేకపోతున్నాడు. కోరికలు గుండెలో చిచ్చు పెడుతుంటె, కలలు రంగు రంగుల సుందరమైన దృశ్యాలను చూపెడుతుంటె పిన్నాళ్ళు ఆ చిచ్చును గుండెల్లో దాచుకుంటారు. మత్తుగొలిపే ఆ సుందర దృశ్యాలనుచూస్తూ భ్రమలో పిన్నాళ్ళు సమాధిగా ఉండాలి

రామనాధం గుమస్తాగా పట్నంలో జీవితం ప్రారంభించి ఇద్దరు అమ్మాయిలకు తండ్రిగా మారినా అతనేమాత్రం సంపాదించలేకపోయాడు. అబ్బాయి పుడితే కాస్తంత చేదోడుగా ఉంటాడని అనుకున్నాడు

అయితే ఆ అదృష్టం అతనికి దక్కలేదు.

అమ్మాయిలు పెరిగే కొద్ది ఖర్చులు పెరుగుతున్నాయేగాని ఆదాయం అంతంత మాత్రమే. వచ్చిన జీతం ఇంటి అద్దె, మిగతా ఖర్చులకే సరిపోయేది అమ్మాయిల పెళ్ళిళ్ళకు అణా పైసా కూడా పొదుపు చేయలేకపోయాడు ఏ నెలకానెల పొదుపు చేద్దామని అనుకున్నా ఏదో ఖర్చు అతని ఆశను మింగేసేది ఇంకేం పొదుపు చేయగలడు?

పెద్దమ్మాయి కల్పనకు ఇరవై ఏళ్ళొచ్చాయి ఎలగైనా పెళ్ళి చెయ్యాలనుకున్నాడు ఆఫీసులో ఐదువేలకు లోన్ పెట్టి, పెళ్ళికొడుకుల కోసం వెదకడం ప్రారంభించాడు. ఐదువేల రూపాయల కట్నం ఇచ్చి, మరో రెండువేలు ఎలాగైనా సంపాదించి పెళ్ళి చెయ్యాలని అతడి ఉద్దేశ్యం.

ప్రస్తుత సభ్య సమాజంలో అంత చవకగా ఏ మగాడు అమ్ముడుపోవటం లేదు. ఉద్యోగాన్ని బట్టి ఒకరేటు, వెనుక ఆస్తిపాస్తులుంటె మరో రేటు ఇలా తమ తమ అర్హతలు, ఆస్తులను బట్టి ఒక్కొక్కడు ఒక్కొక్క రేటును నిర్ణయించుకుని అమ్మకానికి సిద్ధంగా ఉన్నారు.

రామనాధం అనుకున్న ధరకు ఏ మగాడూ దొరకడని తెలుసుకున్న తరువాత బెంగ పెట్టుకుంది. కూతురకు పెళ్ళిళ్ళు చెయ్యగలనా అనే సంశయంలో పడ్డాడు.

ధర ప్రకటించక ముందు వచ్చిన పెళ్ళిచూపుల పెద్దలు స్వీటు, హాటు తిని కాఫీ, టీలు సేవించి అమ్మాయితో మూడు మాటలు మాట్లాడి తృప్తిగా త్రేన్చి గుమ్మం దాటి బయటకు వచ్చి అబ్బాయి వెల ఇంత అనేసరికి రామనాధం కొయ్యబారిపోయేవాడు.

ప్రతి పెళ్ళిచూపులకు బలివ్వడానికి తయారుచేసిన పశువులా తయారుచేసి కూతురును ఆ పీఠం మీద కూర్చోబెట్టి, భగవంతుణ్ని ప్రార్థించేవాడు. ఈ సారైనా ఆ పీటను కల్యాణవేదికగా మార్చమని.

రోజులు ...

నెలలు ...

సంవత్సరాలు గడిచాయి.

రామనాధం ఉద్యోగంలోంచి రిటైరయ్యాడు.

కల్పన ఇరవై ఐదేళ్ళ వయసులోని అందాలను, ఆశలను, కోరికలను నిండుగా

దాచుకుని ఉంది. మమత పద్దెనిమిదేళ్ళ ప్రాయాన్ని ఎగరవేస్తోంది. అందమైన కలలు కల్పించే నవలలు ఆమెకు ఏవేవో మధుర లోకాలను చూపిస్తున్నాయి. ఏపుగా ఎదిగిన పైరును చూస్తే ఎవరికైనా ముచ్చటేస్తుంది.

ఇంటర్మీడియట్ చదువుతున్న మమత ఓ అందమైన అబ్బాయి ప్రేమలో పడింది. అందమైన అబ్బాయిలో అంత అందమైన మనసుంటుందని భ్రమ పడిన మమత ఆ అబ్బాయితో సినిమాలు... సినిమాల్లో హీరో హీరోయిన్ల ప్రేమకలాపాలు ఆమెను గిలిగింతలు పెడుతుంటే ఆ పులకింతలో ఆ అబ్బాయికి మరింత దగ్గరకు చేరుకునేది. అలా మమత మరో లోకాలను చవిచూస్తూ వాస్తవాన్ని మరచిపోయేది.

రామనాథానికి మమత ప్రేమ కలాపాలు చూచాయగా తెలిశాయి. రెండు లెంపకాయలేసి అడిగితే మమత రోషంతో ఎదురు తిరిగింది.

"మీరు పెళ్ళిళ్ళు చెయ్యలేరు. మీ గురించి మా ఆశలు, కోరికలు చంపుకునేకంటే ఏ నుయ్యో, గొయ్యో చూసుకోవడం మంచిది. అక్కను అలాగే చంపెయ్యండి. కానీ నేను అలా చెయ్యను. నేనొకతన్ని ప్రేమిస్తున్నాను. అతను నన్ను పెళ్ళి చేసుకుంటాడట. మీరు అవునన్నా, కాదన్నా నా నిర్ణయం మా..."

రామనాథం ఆశ్చర్యంతో కూతురు వైపు చూసాడు.

ఎదుటపడి మాట్లాడ్డానికి భయపడే కూతురు అలా ఎదురు తిరుగుతుందని ఎప్పుడూ ఊహించలేదు. అంత ధైర్యం ఎలా వచ్చింది?

ఆమె వయసు...

కోరికలతో కైపెక్కిన వయసు..

ఆశలతో వేడెక్కిన వయసు.

ముఖ్యంగా పెళ్ళిమీదగల తపనతో తల కెక్కిన తిక్కతో అడ్డుదారులు తొక్కుతున్న వయసు.

ఆ వయసు ఆమెకు ధైర్యాన్ని, చేయూతను ఇచ్చింది.

అందుక్కారణం తన అసమర్థత.

ఎదిగిన కూతుళ్ళ పెళ్ళిళ్ళు చేయకపోవడం అనేదే నేరం. తన అసమర్థతను మరోసారి

నవాలు చేసాయి మమత మాటలు. రామనాథం తల వంచాడు.

ఆడపిల్లలను కన్న ప్రతి తండ్రి పెళ్ళి విషయంలో తన అసమర్థతే వారి జీవితాలతో ఆడుకుంటే, ఊహాల ఉయ్యాలలో ఊగిసలాడుతున్న అమ్మాయిల ముందు తలవంచక తప్పదు.

అయితే వారి పెళ్ళిళ్ళు చెయ్యలేకపోవడానికి పూర్తిగా తనే బాధ్యుడా ?

కాదు... కాదు...

సభ్య సమాజం... ఆ సమాజంలో మగపిల్లల తల్లిదండ్రులు కన్నందుకు, పెంచినందుకు విలువకట్టి పెళ్ళికొడుకుల బజారులో వేలం వెయ్యడానికి అలవాటు పడ్డారు.

ఎందుకిలా జరుగుతోంది ?

ఎన్నాళ్ళిలా జరుగుతుంది ?

వరకట్న నిషేధ చట్టం 1961 లో తయారుచేసింది ప్రభుత్వం ఇరవై ఏళ్ళలో ఈ చట్టం ఏమాత్రమైనా విజయం సాధించిందంటే జవాబు శూన్యం. చట్టాలు కాగితం వరకు మాత్రమే. ఏ చట్టం కూడా ఈ దురాచారాన్ని రూపు మాపలేదు. ఏ చట్టం కూడా రామనాథం లాంటి తండ్రుల గుండెల్లో చిచ్చుపెడుతున్న పెళ్ళిళ్ళసమస్యను ఆర్పలేదు ఏ చట్టం కూడా కల్పనలాంటి కన్నెల కలలను నిజం చెయ్యలేదు.

మగవాళ్ళ మనసును ఏ చట్టం కూడా మార్చలేదు

ఎందుకీ చట్టాలు... ఎందుకీఆర్భాటాలు?

మళ్ళీ ఈనాడు ఆ చట్టం తీరుతెన్నులు, సాధించిన ప్రగతిని పరిశీలించడానికి ప్రభుత్వం ఒక కమిటీని ఏర్పరచి దేశం నలుమూలలకు పంపింది ఎందరు నిర్భాగ్యులు ఈ చట్టం వలన లాభం పొందారు. ఒకవేళ కమిటీ చూపించినా, వరకట్నం తీసుకోకుండా పెళ్ళి చేసామన్న పెద్ద మనుష్యులు నిజంగా డబ్బు తీసుకోలేదని గుండెమీద చెయ్యివేసి చెప్పమనండి ?

రామనాథానికంతా అయోమయంగా ఉంది.

ఎలాగైనా పెళ్ళిళ్ళు చెయ్యాలి.

ఎలా...

పింఛను డబ్బు అంతంత మాత్రమే.

ఈ డబ్బుతో ఇద్దరు కూతుళ్ళ పెళ్ళిళ్ళు జరిపించగలడా తను ?

చివరకు రెండో పెళ్ళివాడైనా చవకగా దొరుకుతాడేమోనని వెదకడం మొదలు పెట్టాడు. కాని వారు మాత్రం అంత తేలికగా దొరుకుతారా! భర్త పోయిన స్త్రీకి సమాజం 'విధవ' బిరుదునిచ్చి మరో పెళ్ళికి అడ్డుపడతదిగాని మగవాడు ఎన్ని పెళ్ళిళ్ళయినా చేసుకోడానికి అనుమతినిస్తుంది. కట్నం మామూలే, అయితే కొంత కన్సెషన్ ఇస్తారు.

"భగవాన్ నా లాంటి అసమర్థునికి ఆడపిల్లలను ఎందుకు ఇచ్చావు"

రామనాథం ఎన్నోసార్లు తనను తాను తిట్టుకున్నాడు

అతని ఆలోచనలన్నీ మమత మీదే.

మమత ఏదైనా పొరపాటు చేసిందంటే వంశానికే మచ్చ

కల్పనకు ఈ జన్మలో పెళ్ళి చెయ్యలేడు.

అందుకే ముందు మమత ప్రేమించినతన్ని కలుసుకోవాలి.

అయితే ..

ఉదయం వెళ్ళిన మమత సాయంత్రం వరకు రాలేదు.

సాయంత్రం గడిచి రాత్రి వచ్చి వెళ్ళింది.

కాని ..

మమత జాడ తెలియలేదు.

మూడు రోజులు గడిచాయి.

రామనాథం ఎక్కడెక్కడో వెదికాడు. ఫలితం శూన్యం.

రామనాథం పిచ్చివాడిలా తయారయ్యాడు.

మాణిక్యమ్మ వంటిల్లు దాటి బయటకు రావడం లేదు.

కల్పనకు జీవితంమీద విరక్తి, అసహ్యం కలిగాయి.

మమత పుస్తకాల్లో కనిపించిన ఉత్తరం రామనాథం అసమర్థతను హేళన చేసింది.

నాన్నగారికి నమస్కులు,

అమ్మాయిల పెళ్ళిళ్ళు చేయలేకపోతున్నారంటే అది మీ అసమర్థతోపాటు మన సమాజం కూడా కొంత వరకు కారణమే. మీకు కూతుళ్ళుగా పుట్టినందుకు ఏడుస్తూ కోరికలను, ఆశలను చంపుకోలేక నా ఏదో దారి వెదుక్కుని జీవించడంలో తప్పేమి లేదనిపిస్తుంది నాకు మిమ్మల్ని బాధ పెట్టాలని కాదు మీకు విముక్తి కలిగించాలని వెళుతున్నాను. ప్రేమించిన వ్యక్తి వచ్చేయమన్నాడు. అతను మంచివాడైతే దంపతులుగా మారి మీ ఆశీర్వాదం కోసం వస్తాను. ఎందరో అమ్మాయిలలాగే దగాపడి రోడ్డున పడితే నా ముఖం మీకు చూపించలేక ఆత్మహత్య చేసుకుంటాను. అన్నిటికి తెగించి ఈ నిర్ణయం తీసుకున్నాను. వారం రోజులలోగా మీ దగ్గరకు రాని పక్షంలో 'మోసపోయిన ఆడదానిగ' మరో లోకంలో ఉంటాను. చిన్నకూతురు చనిపోయిందనుకోండి. అక్కకైనా పెళ్ళి చెయ్యండి.

ఇట్లు

మిమ్మల్ని క్షమించమని కోరుతున్న

మమత.

మాణిక్యమ్మ గుండె బాదుకుని ఏడ్వడం మొదలుపెట్టింది.



వాళ్లాయనకి పూలవ్యాపారంటే!!
అది ఆవిడ గర్వం!!



# బలిపీఠం

కల్పన పిచ్చిగ శూన్యంలోకి చూస్తుండి పోయింది.

వారం రోజులు గడిచాయి.

ఉత్తరంలో మమత ఇచ్చినగడువు పదేపదే గుర్తుకు వస్తుంటే రామనాథం, మాణిక్యమ్మ, కల్పనకు మమత ఏ అఘాయిత్యానికి తలపడిందోనని భయం ఎక్కువయింది.

రామనాథం వెదకని స్థలంలేదు.

ఖాళీగ కూర్చున్నప్పుడు 'నా కూతురును నేనే చంపేసాను' అనుకుని తల బాదుకునేవాడు.

బెంగతో మాణిక్యమ్మ మంచం పట్టింది.

డాక్టరు రోజూ మందులిస్తున్నా మానసిక క్షోభ ఆమెను తేరుకోనీయడం లేదు.

దిగులుతో పిచ్చివాడిలా ఉన్న తండ్రి.

చిక్కి శల్యమై మంచంపైనున్న తల్లి.

వెలుగు చూడని చీకటి భవిష్యత్తు.

అన్నీ భయంకరంగా కనబడుతున్నాయి కల్పనకు.

ఆ రోజు ఉదయాన్నే లేచి తలంటు స్నానంచేసి తులసి మొక్క దగ్గర పూజ చేస్తోంది కల్పన.

రామనాథం కూతురు దగ్గరకు వచ్చి కన్నీళ్లతో చూసాడు.

"కల్పనా దేవుణ్ణి ఏమని ప్రార్థిస్తున్నావు. ఏ జన్మకైనా ఇటువంటి తండ్రికి కూతురుగా పుట్టించవద్దని అడుగుతున్నావా తల్లీ. కూతుళ్ల పెళ్ళిళ్ళు చెయ్యలేని అసమర్థుడైన ఏ తండ్రికి కూడా ఆడపిల్లలను ఇవ్వద్దని కోరుతున్నావా."

కల్పన తండ్రి గుండెలమీద వ్రాలింది.

"లేదమ్మా, నీకైనా పెళ్లి చేస్తాను"

రామనాథం కంఠంలో బాధ

మధ్యాహ్నం కల్పన తల నిండా పూలు పెట్టుకుని, తెల్లచీర కట్టుకుంది.

రామనాథం కూతురుచర్యలను ఆశ్చర్యంతో చూస్తున్నాడు.

వరండాలో కూర్చుని ఆలోచనలో పడ్డాడు.

సాయంత్రం అయిదయినా కూతురు బయటకు రాకపోవడం వింతగా ఉందాయనకు. నాలుగ్గంటలకే ఇంటిపనులు మొదలుపెడతది కల్పన.

గబ గబ ఇంట్లోకి వెళ్లాడు.

కల్పన గదిలోపల గడియ వేసి ఉంది.

తలుపు బాదాడు రామనాథం.

గదిలోంచి ఏటువంటి సమాధానం రాలేదు.

"కల్పనా..."

"కల్పనా..."

గట్టిగా అరిచాడు.

భర్త అరుపులకు మంచం మీద ఉన్న మాణిక్యమ్మ నడవడానికి ప్రయత్నించి తూలి పోతున్నా, గోడను ఆసరాగా చేసుకుని నెమ్మదిగా బయటకు వచ్చింది.

"మాణిక్యం ... కల్పన తలుపు తీయడం లేదు."

అరచి. అరచి మరిక సహించలేక పెద్ద రాయితో తలుపుమీద కొట్టాడు.

తెరచుకున్న తలుపులు చూపించిన దృశ్యం—

మాణిక్యమ్మ, రామనాథం కొయ్యబారి పోయారు

పీటకు పసుపు వ్రాసి ముగ్గు వేసి తెల్లని గుడ్డ పరచి ఉంది

ఆ పీట మీద తెల్లచీర కట్టుకుని, పాదాలకు పారాణి, నుదుట కళ్యాణ తిలకం దిద్దుకుని, బుగ్గన కాటుక చుక్క పెట్టుకుని పెళ్లి కూతురులా కూర్చుని ఉంది కల్పన.

కల్పన చీరకొంగు ప్రక్కనే ఉన్న దేముడి పటానికి ముడివేసి ఉంది.

కల్పన పెళ్లికూతురై పీటమీద కూర్చుంది

పెళ్లికోసం కాదు ...

బలికోసం.

అది పెళ్లి పీట కాదు ...

బలిపీఠం.

'కల్పనా...'

బావురుమన్నాడు రామనాథం.

అతను ముట్టుకోగానే అంతవరకు నిటారుగ ఉన్న కల్పన శరీరం వాలిపోయింది.

రామనాథం, మాణిక్యమ్మ కల్పన దేహం మీద పడి విలపిస్తుంటే అప్పుడు కనిపించింది...

కల్పన చేతిలో మాణిక్యమ్మకు డాక్టరు ఇచ్చిన నిద్రమాత్రల సీసా.

## అంకితం

కళ్లు తెరవని మన
కుళ్లు సమాజంలో
మమత లెందరో...
కల్పన లెందరో...
అటువంటి అక్కా
చెల్లెళ్లకు కన్నీటితో
ఈ "బలిపీఠం" అంకితం.

—రచయిత

బట్టలన్నీ
ఉతికేందుకు
కీ డిటర్జెంట్ పౌడర్ కన్న
మరింత
మంచిదేది ?



# కొత్తది! మెరుగు పరచ బడింది!

## కీ

**అంతేకాదు,
ఇంకా దీని ధర
యితర ప్రముఖ
డిటర్జెంట్ల కన్న
30%. తక్కువే!**




ఈ మెరుగుదలలు చూడండి!



ఇప్పుడు కీ మరింత సమృద్ధిగా నురగ నిస్తుంది.



ఇప్పుడు కీ బట్టలకు మరింత తెల్లదనాన్ని, తళతళను ఇస్తుంది.

గోద్రెజ్
ఉత్పాదన

**అందరికీ కనిపించే ఆ అదనపు తెల్లదనం, తళతళ-కొత్త, మెరుగు పరచబడిన కీ లో**

CHAITRA-G-167 TEL

# వారఫలం

**25-12-1981 శుక్రవారం మొదలు 31-12-1981 గురువారం వరకు**

మేషం: సర్వ విధాలా మేలైన వారం. ఆదాయానికిగాని, వ్యాపారానికిగాని, వ్యవహార విజయానికిగాని, చేసిన నూతన ప్రయత్నాలలో లాభం పొందుటకుగాని అనుకూల వారం. బంధువులకో, మిత్రులకో, ఆశ్రితులకో సహాయం చేయవలసి రావచ్చు. స్త్రీలకు: ఉద్యోగంలో పెంపు, వృత్తికొరకు ప్రాకులాడు వారికి మేలు కనిపించే వారం.

వృషభం: ఆదాయం నాల్గు విధాలా సమకూడే దినం. అలాగే వారమంతా జరిగిపోయే అవకాశముంటుంది. దైవ కార్యాలు సుకరంగా నెరవేర గలవు. చాలమందికి వ్యాపారానుకూలత, అనుకొన్న అధికలబ్ధి చేకూరగలవారం. స్త్రీలకు: బంధువర్గీయులనుండి అధికాదరం, బాధ్యతాయుతమైన వ్యవహారాలు స్థిరపడటం సంభవమయ్యే వారం.

మిథునం: మీ వ్యాపార వ్యవహారాలు సుకరంగా సాగిపోతాయి. మీకుగల లావాదేవీలలో అనుకూలత, చేకూరగలదు. దైవారాధనకు, వృత్తిలో పెంపునకు, రావలసిన ధనం చేతికందుటకు, నూతన వస్తు సేకరణకు అవకాశం గలవారం. స్త్రీలకు : అధిక శ్రమకరమైన వారంగా గ్రహించదగినదే. ఆదాయం కించిత్తు గల వారమే.

కర్కాటకం : కళాసాహిత్య రంగాలలో, కథారచనలో, పత్రికా ప్రకటనలో, చిత్రరంగ రచనా విధానంలో వేషధారణంలో అవకాశం గల వారమే. నూతన వ్యవహారాలు తెలిసికోవటం, నూతనమిత్రుల సమాగమం ఇత్యాది ఫలితాలు చెప్పదగిన వివరాలు. స్త్రీలకు: సుఖశాంతులు, వృత్తిలో పెంపు, ఆదాయంలో వృద్ధి గలవారమే.

సింహం: ఎన్నో విషయాలు వారంలో గ్రహింపనున్నారు. ఎన్నోవిధాల మేలుచేకూరనున్నవారం. అన్ని విధాలా ప్రగతి గలవారం. తెలివితేటలు రాణించగల వారం. ధనాదాయం స్వల్పమో, అల్పమో గలవారమే. స్త్రీలకు : కుటుంబ సందడి, సంతానం మూలాన ఆనందం సమకూర గలవారం. స్త్రీలకు: [illegible] మాటలకు దిగవలసిన పరిస్థితులేర్పడుతాయి. ఎందుకో గ్రహించండి.

కన్య : ఆదాయానికి లోటురాదు. ఆరోగ్యానికి భంగంరాదు. ఆత్మీయులతో కీచులాటలుండగలవు. అయినా కూడా అంతంతమాత్రమే. స్థలంమార్పు వలన అశాంతి క్రమంగా సర్దుకోగలదని మీరే గ్రహిస్తారు. స్త్రీలకు : వినోదం, పెంపు, ఆదాయాభివృద్ధి, సభాగౌరవానికి అవకాశం గల వారం.

తుల: రాశికి వ్యయమందున్న 'శని' గ్రహం వలన, చేతికి అందినట్లేఅంది అవకాశాలు పోవుతాయి. చిక్కినట్లే చిక్కి ధనం వృథాగా ఖర్చు అయ్యే అవకాశం గల వారం. వ్యవహారాల్లో చిక్కులు సంభవించే అవకాశమున్నది. కష్టనివారణకు యింకా కొంతకాలం పట్టగలదు. స్త్రీలకు: ఆదాయలోపం ఉద్యోగంలో ఇబ్బందులుంటాయి.

వృశ్చికం: మీమేలు కోరినవారు, వ్యాపారంలో మీకు సహచరులుగా ఉన్నవారు బాగా తోడ్పడే అవకాశము గల వారం. ఉద్యోగం చేసికొనే వారికి స్థలమార్పు, ఉద్యోగమార్పు సంభవించేఅవకాశమున్నది. బంధుసమాగమం, మిత్రమూలకసహాయం ఏర్పడగలదినమే. స్త్రీలకు: ఉద్యోగ, వృత్తులందు, వ్యాపారమునందు అభివృద్ధి సూచక వారం.

ధనుస్సు : మిత్రాలూకు వస్తువులు ఏమైనా పోతాయేమో! మీకుగల వ్యవహారాలలో అంతరాయాలున్నా నిగ్రహంతో కార్యసాధన గావించుకోండి. బంధుద్వేషమో, జరుగవలసిన పనులు జరుగక పోవటమో, అధికంగా, వారికి ధనం వ్యయించవలసిన పనులు రావటమో సంభవమని, గ్రహించాలి. స్త్రీలకు : నూతనవ్యవహారాలు తెలిసికొనుటకు, నూతనవస్తుసేకరణకు ఆస్కారం గల వారం.

మకరం: సుఖశాంతులకుగాని, సౌభాగ్యానికిగాని, క్రీడారంగంలో అవకాశాలకుగాని, నూతన వస్తువులుకొనుగోలుచేయుటకుగాని వస్త్ర సేకరణకుగాని వ్యాపారంలో వ్యయంగా ఆర్జించుటకుగాని, అనుకూల వారం. వైద్య, ఉపాధ్యాయ, రచనా విధాన నిపుణులకు మేలైన అవకాశాలు గడింపనున్నారని గ్రహించాలి. స్త్రీలకు: యుక్త వయస్సులకు వివాహానికి అనుకూలసార్థం. ఉద్యోగప్రగతికి ఆక్షేపణలేదు.

కుంభం : చలన చిత్రరంగంలో రచనా విధానంలో, రేఖాచిత్రాలు గీచేవారికి, దర్శకులకు, రంగస్థలంలో అనుభవం గలవారికి అధికంగా అవకాశాలు ఏర్పడనున్నవని గ్రహించాలి. వ్యాపారస్థులు తటపటాయించుటతో కాలం వ్యయం చరాదు. మీతోసహకంచేవారిని గుర్తించి, సహాయం అందుకోండి. స్త్రీలకు: శుభం, ఆనందనం, సంతాన మూలకంగా ఉత్సాహం సంభవం.

మీనం: ఆలోచనగలమీరు ఏంసాధించలేరు? ఎవరితో సంప్రదించాలి, ఎవరి సహాయంఅపేక్షించాలి అని ఆలోచించి మెలగండి. ధన సేకరణకు అవకాశముంటుంది. అంటే అప్పులు వసూలు కాగలవని అర్థం. స్త్రీలకు: కళా సాహిత్య రంగంలో అవకాశాలు, బంధు, సమాగమం, సుఖశాంతులకు లోపం లేని వారం.

**— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి**

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగ్రొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు, గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్ బాగ్, హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.

గాలీ వానా వస్తే కథే నేసేవారు మా తాతగారు. గాలీ వానా పెద్దగా కాక పోయినా వాన పడుతుంటే వేడి వేడి పకోడీలు తింటూ కథలు చెప్పేవారు నాన్నగారు. మరిప్పుడీ కథ నేనెందుకు చెప్తున్నానంటే విద్యార్థులు సృష్టించిన గాలి వాన ప్రైవేటు కళాశాలల యాజమాన్యాల పునాదుల్ని కదిలించి వేసింది కాబట్టి.

* * *

అనగా అనగా ఒక వూరు. ఆ వూరు పెద్దదే అని చెప్పొచ్చు. కారణం అక్కడున్న మంచి పేరున్న డిగ్రీ కళాశాలలు కాదు రాష్ట్ర మొత్తంలో అతి తక్కువున్న ఉపాధ్యాయ శిక్షణా కళాశాల ఉందనీ కాదు. ఆ వూరిలో ఒక 70 ఎమ్. ఎమ్. సినిమా హాలూ [మామూళ్ళవి చాలా ఉన్నాయి] ఒక వుమెన్స్ కాలేజీ ఉన్నాయి అన్నీ ప్రైవేటు మేనేజిమెంట్ కింద ఉన్నాయి.

ఈ పెద్ద ప్రైవేటు మేనేజిమెంట్‌లో లోపం ఏమిటో చిన్నవాణ్ణి నాకు తెలీదు కానీ ప్రతీ టెర్మ్ ఫీజు కడుతున్నప్పుడూ తం బాధ పడేవాణ్ణి అదీ ఇంటర్మీడియట్ గవర్నమెంట్ కాలేజీలో చదివి ఆ ఫీజుకి అలవాటు పడ్డాను కాబట్టి; మా నాన్నగారు రైల్వేలో ఓ గుమాస్తా అందువలనే మా కాలేజీ ప్రెసిడెంట్ పది రెడ్లు వందెకరాల పొలం ఉన్నా హాఫ్ ఫీ కన్సెషన్ పొందినట్టు పొందలేక పోయాను. పోనీ కాలేజీ ఎలక్షన్‌కి మూడు వేలు ఖర్చు పెట్టగలిగిన అప్పల్నాయుడులాగ వెనకబడ్డ వాణ్ణైనా అయితే ఫుల్ ఫీ కన్సెషన్ పొంది ఉండేవాడిని. సరే మొత్తానికి నాలాంటి వాళ్ళు కడుతున్న ఫీజులన్నీ ఏమయ్యాయో తెలీదు కానీ కాలేజి మేనేజిమెంటు సిబ్బందికి జీతాలివ్వడం మానేసి ఐదు నెలలయింది

మొదటినెల గాలీ వానా మొదలవుతుంది. పరీక్షలు పోస్ట్ పోన్ అవుతాయని విద్యార్థులు ఆశగా ఎదురు చూసారు. కానీ డ్యూటీ ఫస్ట్ అన్నట్టు లెక్చరర్లంతా బుద్ధిగా స్ట్రిక్ట్‌గా పరీక్షలు జరిపించేసారు. ఆ పైన పేపర్స్ వేల్యుయేషన్ కూడా పూర్తి చేసి మళ్ళీ కాలేజీలు తెరచిన రెండవ రోజు నుంచే పాఠాలు చెప్పడం మొదలెట్టేసారు.

రెండ్రోజులు చూసి ఇలా లాభం లేదనుకుని నల్ల బేడ్జీలు ధరించి కోపంగా పాఠాలు చెప్పడం మొదలెట్టారు. గంట విరిగిపోయేలా

# కథ నిజమైతే!

పంతుల నాగేశ్వరరావు



గంట కొట్టి తన కోపాన్ని ప్రదర్శించాడు ప్యూను గొళ్ళాలూడిపోయేలా క్లాస్‌రూముల తాళాలు వేసీ తీసీ తనకోపాన్ని ప్రదర్శించాడు మరో ప్యూను. అయినా మేనేజిమెంటుకి చీమ కుట్టినట్టయినా అన్పించలేదు.

కాలేజీలు సమయానికి సిలబస్ పూర్తి చెయ్యకపోడమో, కంజెక్టివేటిస్ కారణమో కానీ యూ॰ ర్సిటీ పరీక్షలు ఆలస్యంగా పూర్తి॰ డ . వెంటనే కాలేజీ॰ తెరవడం జరిగి విద్యార్థులకి సెలవులు లేకుండా పోయాయి. కాలేజీలు పట్టగాన ॰ మ్మె చేస్తారనుకున్న సిబ్బంది సమ్మె చెయ్యక పోవడంతో "జీతాలు లేకపోయినా తంచనుగా మా పేపర్లు దిద్ది మా పాఠాలు చెప్తున్న లెక్చరర్లను చూస్తూ ఉంటే మా కడుపు తరుక్కుపోతోందంటూ, వారు మా మీదెంత దయతల్చినా జీతాల్లేని వారిచేత ఇలా పాఠాలు చెప్పించేసుకోవడం అమానుషం" అంటూ విద్యార్థులే రెండ్రోజులు తరగతుల్ని బహిష్కరించారు. అప్పటికీ మేనేజిమెంటు లొంగలేదు.

ఒకరోజు మంచిముహూర్తం చూసుకొని సాయంత్రం ఆరు గంటలకి మేనేజిమెంట్ వారి కార్యాలయంలో పెద్దలెవరూ లేని సమయం చూసి లెక్చరరంతా పెద్ద ఊరేగింపుగా బయల్దేరి, ఆఫీసు ముందు నిల్చుని నాలుగు కేకలేసి మరీ వచ్చారు అయినా ఏమీ లాభం లేకపోయింది.

ఉత్తినే గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటే లాభం లేదు. ఆ పనేదో నిరాహార దీక్షలంటూ శిబిరాలు వేసి మరీ చేద్దాం అనుకొని రిలే నిరాహార దీక్షలు ప్రారంభించారు లెక్చరర్లు. మొదటి రెండు నెలూ ఎలాగో గడిచినా జీతాలివ్వని మూడో నెల నుంచి అయినా లెక్చరర్ల ఇళ్ళలో ఒకపూట చేస్తున్నదీ ఇదే కదా అని మేనేజిమెంటు వారు దీన్ని పట్టించుకోలేదు.

ఇక చూసి చూసి లాభం లేదని సిబ్బంది అంతా ఫలానా తేదీనుండి సమ్మె చేస్తామంటూ నోటీసిచ్చారు. మరింత కాలంగా పుట్టని వేడి ఇప్పుడిలా ఎందుకు పుట్టిందీ అంటే అదో పెద్ద రాజకీయం ॰ండి. అది మీరడగా కూడదు, వీళ్ళ ఎసోసియేషన్ నాయకులకి ఇప్పుడు అవసరంవచ్చింది కాబట్టి ఇలా జరుపబడుతున్నదని నేనూ చెప్ప కూడను.

సరే వీళ్ళు సమ్మె చెయ్యడం మొదలెట్టగానే మా సహకారం వీళ్ళకెలా అందించాలా అని ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాం. నాలాగే మర్యాదగా ఫీజులు కట్టేస్తున్న కొంతమంది కల్సి పెద్ద ఊరేగింపుగా ప్రిన్సిపాల్ గారి దగ్గరికి బయల్దేరేం.

ఆయన అనుభవజ్ఞుడూ, విద్యార్థుల మనస్తత్వాలు చక్కగా తెలిసినవాడూను. అతనితో –

"అయ్యా మా తల్లిదండ్రులు ఎంతో శ్రమపడి సంపాదించిన సొమ్ములోంచి ఫీజు కడుతున్నాం. అందువల్ల ఒక్కక్లాసు పోయినా మాకు బాధగా ఉంటుంది. మేం ఫీజుకట్టేం. కాబట్టి మేం క్లాసులకి ఎటెండ్ అయితే ఎలాగైనా క్లాసులు జరిపించాల్సిన బాధ్యత కాలేజీ వారిది క్లాసులకి మేం ఎటెండ్ అవుతున్నాం. అవి జరిగేలా చూడవల్సిందిగా మా ప్రార్థన. ఒకవేళ మాకు క్లాసులు జరగకపోతే ఈ నష్టాన్ని మేం థర్డ్ టెర్మ్ ఫీజులో॰చి

## గమనిక

వ్యక్తుల పేర మీ రచనలు పంపితే వాటి పరిశీలనలో ఆలస్యం జరిగే ప్రమాదాలెక్కువ కనుక మీ రచనలన్నీ కూడా శీర్షిక పేరు కవరు పైన లేదా కార్డుపైన ఉదహరిస్తూ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ–520 003 అన్న చిరునామాకి పంపండి.

సం.

## కథ నిజమైతే?

మినహాయించుకోవల్సి వస్తుంది. ఈ విషయంలో మేమంతా కల్సి నిలబడతాం'', అని విన్నవించుకున్నాం.

క్లాసులు జరిపించడానికి లెక్చరర్లు లేరు. జరగకపోతే మూడవ పెర్మ్‌ఫీజు ......

వెంటనే లెక్చరర్ల కోరికలు కొన్ని తీర్చబడ్డాయి. ఎందుకంటే వాళ్ళు క్లాసులకి వచ్చి పాఠాలు చెప్పవలసిన అవసరం ఉంది కాబట్టి.

* * *

అదీకథ. మరి ప్రతీ కథకీ ఒక నీతి అంటూ ఉంటుందికదా? మరీ కథ నీతేవిటి అని అడగకండి. ఆలోచించండి!

## కా. వి. వే. — అబూబ

మేం ముగ్గురం. విభిన్న కులాలకు చెందిన వాళ్లమైన స్నేహితులం. . మీరు మీ ... గారిని ఇంట్లో ఎలా ట్రీట్ చేస్తారు?

స్నేహానికి కులం లేదు. . . . నేనెప్పుడూ ఎవరినీ— కులం అడిగి ఎరగను. అంతేకాదు—నా స్నేహితులని వారి 'మానిన.పులిలాగా' రక్షించాలని చూస్తాను. అందుకే— నాకు స్నేహితులూ హితులూ ఎక్కువ— నా సమాధానాలు నచ్చుతున్నాయి అనీ, నేనంటే ఇష్టమనీ చెప్పి—నన్ను వారి ఉబ్బే స్తున్నారు — ఇక నా భర్తగారు. కవి. చాలా సున్నిత మనస్కులు. పైగా నాకు చాలా చాలా స్నేహపాత్రులు. స్నేహం ఎలా మిగులుతుంది? ఒకరిపై ఒకరికి గౌరవం మిగుల్చుకోడం వల్ల. గౌరవం ఎలా మిగులుతుంది? ఒకరికొకరు— ఈక్వల్ అనుకోవడం ద్వారా. అందుకే — ఉయ్ లివ్ లైక్ గుడ్ ఫ్రెండ్స్. అండ్ లవ్వర్స్ (దో హోల్డ్? ) ఇప్పటికీ. (మా పెళ్లయి పాతికేళ్లు దాటింది?)

## పి. ఎమ్. — కూనవరం

ప్రపంచంలో అతి విలువైనది అతి పవిత్ర మైనది ఏది?

ఏమీ లేదు — ప్రాణంకంటే.

విభిన్న మనస్తత్వాలు కల యువతీయువకులకు వివాహం చేస్తే?

హోయి ఎప్పుడూ 'ఆపోజిట్ పోల్స్ఎట్రాక్ట్' కదా! చిన్నప్పటి సైన్సు పాటాలు మర్చిపోతే ఎలా?

## ఎస్. పి. — ఉరవకొండ

నచ్చుగా బతికుతుంటే చూసి ఓర్వలేని వారిని ఏమనాలి?

పాటి మనుషులు!

## వి. వి. ఎస్. ఎమ్. — సికింద్రాబాదు

అధిక మంత్రులు — అధిక సౌఖ్యాలా నిజమే నంటారా?

దగ్గరగా ఉండి మీరే అలా అడిగితే ఎలా? ఒక్కటి మాటుకు చెప్పగలను— ఒక్క గొర్రె కాపలాకి— వో అరడజను ''కాపరులు''న్నట్టుంది పాపం ఆంధ్ర రాష్ట్ర మాత!

## కె. ఆర్ ఆర్. — అత్తివరం

పెదాలకు రంగు పూసుకున్న ఆడవాళ్ల ప్రేమ అర్థంగు ఉన్నంతవరకే ఉంటుందట. కామెంట్?

అత్తివరంలో కూర్చుని ఎంతవుందిని లెక్కేశారు స్వామీ? పెదాల రంగు వేసుకోడానికి ప్రేమకీ — సంబంధం ఏమిటి? మీ లెక్క ప్రకారం—అసలు రంగువేసుకోనివారి ప్రేమ గతేమిటి? పిచ్చి పిచ్చి ఆలోచనలు మానండి ఆడవాళ్ల విషయంలో. అలంకరణం స్త్రీ శీలానికి గీటురాయి కాదు. అది అభిరుచికి చిహ్నం మాత్రమే నని—గుర్తించండి.




## జి. వి. ఆర్ — విశాఖపట్నం

పెద్దల పట్ల దొంగ మర్యాదలు ప్రదర్శించే వారి నేమనాలి?

అసలు— మమత లేని డిగ్నిటీ, చిత్తులవారి తెలివీ— విలువలేనివంటారు. మరి వాటినే పెంపొందిస్తాయి మన విశ్వవిద్యాలయాలు— పబ్బంగడుపు కొందుకు మర్యాద— పదవి కోసం తెలివి ఉప యోగిస్తే చాలును అనుకునే రోజులివి.

## సిహెచ్, సిహెచ్ — గుంటూరు

బలహీనవర్గాలకు చేయూత అంటూ హెడ్డింగ్ వ్రాసి....

వద్దు ఇంకేం చెప్పకండి... ఇలాగే పిడించుకు తింటూ ఉంటే నేనూ మతం మార్చుకొంటాను!

## డి., యి. డి., - భోగాపురం

ముక్కుకు సూటిగా మాట్లాడే వాళ్లంటే నాకెంతో ఇష్టం. మీరేమంటారు?

నాకూ ఇష్టమే. కాని చాలామంది సూటిగా మాట్లాడ్డం అంటే పుల్లవిరుపుగా మాట్లాడ్డం అనుకొంటారు! అంటే సూటిగా మాట్లాడ డానికి కూడా నేర్పుండాలి.

## పి. వి. పి. తయిలూరు — కర్నాటక

పెద్ద చిన్న లేదు, భయమూ భక్తీ లేదు. సభ్యత మర్యాద అసలులేదు. ఇంకెక్కడి వర్షాలురా. పంటలురా, ఆ కాలాలు వేరు అంటారు మా తాతగారు.

తాతలంతా అంతే! వెనుకచూపేగాని ముందు చూపు ఉండదు!

## జి. వి. పి. ఆర్ అలూరు

వంచకులైన ఈనాటి ఆడవారి గూర్చి మీ అభిప్రాయం ఏమిటి?

పరిస్థితులకుతగినతెలివితేటలు పుట్టుకొస్తూ ఉంటాయని—కదా సాంఘికశాస్త్రం మానవ శాస్త్రం చెప్తుంది!ముల్లుని ముల్లుతో, వజ్రాన్ని వజ్రంతో సాధించాలి. మరి మోసకారి మగవారిని మోసంతో జయించక— తప్పదు.

## ఎస్. వి ఎన్ - ఏలూరు

రోజు రోజుకీ పాపం పెరిగినట్టు పెరుగుతున్న ఈ రచయితలవల్ల కష్టనష్టాలు కలుగకుండా ఉండడానికి జ్యోతిలాంటి అమాయకులకి మీరిచ్చే సలహా ఏమిటి?

గ్రో అప్.... అరిందాల్లాగా ప్రవర్తించే ముందు— మనసు పెరగనివ్వండి. నా పిల్లలకి ఒక్కటేచెప్తాను.'' చదవండి. కాని వాటి నిజానిజాల గురించి ఆలోచించే ఇంగితం కూడా అలవరచు కోండి'' అని. పిల్లలకి నిజాయితీగా ప్రవర్తించ కల చేవనివ్వాలి— తల్లిదండ్రులు. ధైర్యం ఏర్ప డేలా చేయాలి. ''తల్లి దగ్గర దాపరికం దేనికి?'' అంటాను నేను. తప్పో ఒప్పో — తల్లికేనా చెప్పుకో కల్గాలి— ఆడపిల్ల—మగపిల్లవాడైనాసరే!

## వి వి. — ఉరవకొండ

మగవాళ్ల ప్రేమ కనుక్కోవడం ఎలాగ?

చాలా సులభం.... చుట్టూ తిరిగి తిరిగి చెప్పక చెప్తారు వాళ్ల అవసరాలు.

## వి. ఎస్ ఎస్. గుణపూరు

ఆడదాన్ని మోసం చేసిన వాడిని కాల్చాలంటు న్నారు.న్యాయంకావాలి. ఏది ధర్మం? ఏదిన్యాయం అని కోర్టుకెక్కుతున్నారు. కాని అదే ఆడదాని మాటలు నమ్మి గుడ్డిగా ప్రేమించి సాహసగించ బడిన మగవాడు ఏం చెయ్యాలి?

మోసపోయిన మగవాడిని చేతకానివాడం టారు.మోసపోయిన ఆడదాన్నిచెడిపోయినదంటారు. అందుకే—ఈగోల!






**ఎస్. వి – పిఠాపురం**

మా అమ్మాయి వయసు 16 సంవత్సరములు. ఎనిమిది సంవత్సరముల వయస్సులో బి. సి. జి. ఇంజక్షన్ చేయించాము. ఇంజక్షన్ చేసిన చోట చిన్న కాయలాగ లేచి దినదినము పెరిగి పుర్రెత్తుగాను, వెడల్పుగాను తయారయినది. దీనికి ఏమి చేయవలెను ?

కొందరికి శరీరతత్వాన్ని బట్టి దెబ్బతగిలిన చోటగాని, ఆపరేషన్ చేసిన చోటగాని, వాక్సినేషన్‌చేసిన చోటగాని "కీలాయిడ్స్" ఏర్పడే అవకాశం ఉన్నది.

దీనిని అలాగే వదలి వేయటం మంచిది. ఆపరేషన్ చేసి ఈ "కాయ"ని తీసివేసిన తరువాత ఇంకా పెద్ద కాయ ఆ భాగంలో ఏర్పడే అవకాశం ఉన్నది.

**వి ఎస్ పి. – కొత్తగూడెం**

నాకు ఎడమవైపు బీజము కొద్దిగా పెద్దదిగా వున్నది. బాధ ఏమీలేదుగాని నలుగురిలో తిరుగుటకు సిగ్గుగా ఉన్నది.

మీకు హైడ్రోసిల్ అనే రోగం ఉండవచ్చును.

దీనిని ఒక చిన్న శస్త్ర చికిత్స ద్వారా నయం చేయవచ్చును. ఒకవారంపాటు ఆస్పత్రిలో ఉండాలి. ఇంకొకవారం రెస్టు తీసుకొంటే చాలు.

**వి. వి. – హైదరాబాద్**

నా వయస్సు 25 సంవత్సరములు. ముగ్గురు పిల్లలున్నారు. చివరి పాప వయస్సు ఆరు నెలలు. వివాహము నాటికి నా బరువు 51 కి. గ్రా వుండేది. ప్రతి కాన్పుకి బరువు పెరుగుతూ ఇప్పటికి 70 కి. గ్రాలు అయింది. పొట్ట విపరీతంగా పెరుగుతోంది. నా వయస్సుకి ఎంత బరువు వుండవచ్చు. అనవసరమైన బరువు, పొట్ట తగ్గుటకు మందులుగాని, వేరే ఏమైనాపద్ధతులుగాని వుంటే తెలుపప్రార్థన?

ఆహార విషయంలో జాగ్రత్తలు, క్రమబద్ధమైన వ్యాయామం మాత్రమే మీరు చేపట్టగల చికిత్సా విధానాలు. దీనికిగాను పెద్దగా మందులు ఏవీ లేవు. ఆకలిని తగ్గించటానికి మందులు వాడగలిగినా వాటివల్ల ఇతర విధాలుగావచ్చే హానిఎక్కువ. ఆహారంతగ్గించటం చాలా అవసరం. రోజుకి దాదాపు 3 కి.మీ. దూరం నడవటం అవసరం.

**వి. వి. బి – కదిరి**

నాకు మూడు సంవత్సరముల నుండి పండ్లు తోమే సమయములో పళ్లనుండి రక్తమువచ్చేది కొన్ని దినములకు క్రింది వరుసపండ్లు చుట్టు ఎరుపుగాఉన్నది. ఇంజక్షన్‌లు తీసుకున్నా తగ్గలేదు డాక్టరు విటమిన్ 'సి' మాత్రలు వాడమన్నారు వాడినా పంటిచుట్టు ఎరుపు తగ్గలేదు. దీని తీసుకోవలసిన జాగ్రత్తలు ఏమిటి ?

కొందరికి విటమిన్ 'సి' ఎక్కువ మోతాదుల్లో అవసరం అవుతుంది. ఆ మోతాదుల్లో ఎక్కువ రోజులపాటు వాడవలసి ఉంటుంది కూడా. విటమిన్ 'సి' లోపం మాత్రమే గాకుండా ఇన్‌ఫెక్షన్ ఏర్పడటం వల్ల కూడా ఇలా జరుగవచ్చును. ఈ ఇన్‌ఫెక్షన్ తగ్గటానికి సల్ఫా, పెన్సిలిన్, టెట్రాసైక్లిన్ వంటి యాంటీ బయాటిక్‌లు వాడవలసి ఉంటుంది. దంత పరిశుభ్రత చాలా అవసరం.

**వి. ఎస్. ఆర్. – తెనాలి**

నా వయస్సు 19 సంవత్సరములు. నాకురెండు సంవత్సరములనుండి నిదురలో వీర్యముపోవుచున్నది. రాత్రిపూట రోజూ అవుచున్నది. నాకు భయముగా ఉన్నది.

యువ్వనదశలో ఉండే సహజ కోరికల దృష్ట్యా సెమెన్ ఉత్పత్తి ఎక్కువ అవటం కూడా సహజమే! ప్రస్తుత సామాజిక వ్యవస్థలోని పుస్తకాలు, సినిమాలు మొదలయిన వాటి ప్రోద్బలంవల్ల ఈ కోరికలు ఎక్కువ అవుతాయి.

సెమినల్ వీసికిల్‌లోని స్థలం ఒక నిర్ణీత వాల్యూమ్‌లో ఉండటం, ఆ వాల్యూమ్‌ని మించి సెమెన్ ఉత్పత్తి అవటం వల్ల ఆ సెమెన్ మన శరీరం మన కంట్రోల్‌లోలేని సమయంలో [నిదురలో] బహిర్గతం కావటం సహజమే! ఈ లక్షణం ఏదో ఒకదశలో అందరికీ సహజమనే చెప్పవలసి ఉంటుంది.

దీనిని గురించి ఆందోళన అనవసరం. ప్రత్యేక చికిత్సలూ అనవసరమే !

టి శ్రీనివాసాచార్యులు !

తూర్పుకొండ శిఖ
రమ్మ వీధికి నెక్కి
సెను చీకటులు,
వేళాయె కొలువునకు,
మకరందమ్ముల్
కురిసె పుష్పము లెల్ల,
లు దేవతలు
తండాలుగా వచ్చి,
తిర్చిరి మ్రోల
కోసరి తద్వాహమ్ముల్
ు ప్రతతి
మురజాది వాద్యమ్ముల్
ము కడలివలె
రోదసీ దఘ్నమ్ముగ
ులే!
శేష తల్పము వీడి'' —

ధురంగా శ్రీ రంగానాధుని సుప్ర
ల్పారు మిత్రులు బొమ్మకంటి
పులిక మనిపించే ఈ సుందర
ని "తిరుప్పళ్ళి యెళుచ్చి" కి
వాల్మీకి 'కౌసల్యా సుప్ర
సుప్రభాతం తర్వాత దేశ
ం విప్ర నారాయణుని
విష్ణ్వాలయాలలో
డుతారు, విష్ణువును
శ్రీనివాసాచార్యులు
డు.వారణమాయిరం
ు ద్రవిడ ప్రబంధ
ు చేశారు.

# హైదరాబాద్ నోట్‌బుక్

తేసిన పిదప ఆశుకవిత్వాలు, అష్టావధానాలు చేశారు. కొంత కాలం పిదప, తెలుగు భాషా సమితి—తెలుగు విజ్ఞాన సర్వస్వంలో ఉప సంగ్రాహకులుగాను, సంగ్రాహకులుగాను డాక్టర్ గిడుగు వెంకట సీతాపతి, శ్రీ మల్లంపల్లి సోమ శేఖరశర్మ, శ్రీ చిలుకూరి శేషగిరిరావు, మున్నగు వారితో కలసి పదకొండేండ్లు పని చేశారు. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఇంగ్లీషు—తెలుగు డిక్షనరీ ఉప సంపాదకులుగా ఆరేళ్ళు, నూజివీడు, ఆగిరిపల్లి కళాశాలలో నాలుగేళ్ళు, మద్రాసులోని దక్షిణ భారత పుస్తక సంస్థలో తెలుగు సంపాదకులుగా ఐదారేళ్ళు పని చేశారు. సిరి నోము, నివాళి, నోవరి, అన్యాపదేశం, గోపుర సందేశం మున్నగు కావ్యాలు రసవంతంగా చెప్పారు. ఎమెస్కో వారు ప్రచురించిన ప్రబంధాలకు చక్కని పెద్ద పెద్ద పీటికలు సంతరించారు. ఆంగ్లాంధ్రాలలో వివిధ విషయాలపై పెక్కు వ్యాసాలు రచించారు. పిల్లల కోసం బొమ్మల రామాయణం, మనిషి దేవుడు, ఎమెస్కో పాకెట్ సైజు తెలుగు,—ఇంగ్లీషు డిక్షనరీ రచించారు. పెక్కు ఆంగ్ల పుస్తకాలను తెలుగు చేశారు. తమ అన్నగారు కీర్తిశేషులు బొమ్మకంటి సింగరాచార్యులతో కలసి, ఏలూరులో సాహిత్యమండలిలోను, విశాఖలో కీర్తిశేషులు అబ్బూరి రామకృష్ణారావుతో కలసి విశాఖ రచయితల సంఘంలోను, కీర్తిశేషులు డా. తిమ్మావజ్ఝల కోదండరామయ్యతో కలసి తిరుపతి సాహిత్య సమితిలోను చురుకుగా పాల్గొన్నారు. పెక్కు అనువాద సదస్సులలో పాల్గొన్నారు. 1970లో వైసూరులో జరిగిన అఖిల భారత నిఘంటు నిర్మాణ సభలో ఒక సమావేశానికి అధ్యక్షత వహించారు. ఇంతటి అనుభవ వైశాల్యమూ, అనుభూతి గాంభీర్యమూ, రచనా వైశారద్యమూ గల ఆచార్యులు దివ్య ప్రబంధాన్ని సిరినోములోని కవితలాగే తెలిగిస్తే తెలుగు వారికి, తెలుగుకు చాలా సేవచేసిన వారవుతారని నా ఆశ. కాని శ్రీ ఆచార్యులు—

''ఆశకు నాల్గు కాళ్ళు గల,
పాపము వాలమునుండె, అట్టి ఈ
ఆశను బాపటం గొని భ
వాంబుధి నీద దలంతు మీశ, మ
స్త్రీ శునకావతారము భ
జించి తరించె నెవండు తెల్పవే ?
ఆశను కోసి వేయవె! ని
రాశ్రయ ద్వారక వెంకటేశ్వరా!''

అన్న ఆశ కాదు నాది. నార్లగారన్నట్టు ఉచితమైన ఆశ మంచిది, దురాశ తగదు నాది దురాశ కానే కాదుగదా! కనుక బొమ్మకంటివారు దానిని పూరిస్తారు.

**ఉపశ్రుతి :**

నేటి యువకులు జ్ఞాన సంపాదనలోను, సంప్రదాయ పరిజ్ఞానంలోను, ఎంత ఉపేక్షతో వుంటారనడానికి మిత్రులు డాక్టర్ రావూరి భరద్వాజ ఒక ఉదాహరణ చెప్పారు ''ఇటీవల ఒక నవ యువకవి నా వద్దకు వచ్చారు. 'పూరి కృష్ణశాస్త్రి గారి రచనలు చదివారా ?' అనడిగాను. 'ఏ కృష్ణశాస్త్రి గారు ?' అని ఆ కవి ప్రశ్నించారు. అయ్యో! ఎంత పొరపాటు చేశాను. మిమ్మల్ని అడిగవలసిన ప్రశ్న కాదది అనుకొని పశ్చాత్తాప పడ్డాను.

— తిరుమల రామచంద్ర.

రు. ఎర్రన
గాపిలినవారకి
ది. ఈ ఆరు
గ్రంథంగా
తం ప్రతి
ద్వారక వెంక
ఆయన.

ట్రయున్

చు తం

సత్కవి

శ్వరా !''

కావ్యంగా
1920
కా తిరు
విద్వాన్,
లో కడ



కృష్ణంరాజు సమర్పించు  రాధాకృష్ణా మూవీస్

# గువ్వల జంట

కలర్

దర్శకత్వం: కె. వాసు నిర్మాత: జి. సత్యనారాయణరాజు

అన్నపూర్ణ

'కళాభారతి' దశమ వార్షికోత్సవ సభలో వేదిక నలంకరించిన శ్రీయుతులు ఎల్. వి. ప్రసాద్, ఎన్. టి. రామారావు, దాసరి, మిక్కిలినేని, ఆచార్య ఆత్రేయగార్లని చిత్రంలో చూడవచ్చు.

## దాసరి – ఎన్.టి.ఆర్. కాంబినేషన్‌లో జి. సి. కృష్ణంరాజు చిత్రం

"డిసెంబర్ 1 నుంచి 10 వరకు ఫస్ట్ షెడ్యూల్ ఉంటుంది," అన్నారు దాసరి నారాయణరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం వహించే విశ్వరూపం సిరి ఆర్ట్స్‌వారి తొలి చిత్రానికి నవంబర్ 7, 8 తేదీల్లో కొన్ని పాటలు రికార్డయ్యాయి. ఎన్. టి. ఆర్., శ్రీదేవి, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రావు గోపాలరావు ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. రాజన్–నాగేంద్ర సంగీత దర్శకులు. కె. ఎస్. హరి ఛాయాగ్రాహకుడు. భాస్కరరాజు శిల్పం, మార్తాండ్ కూర్పు, రాధాకృష్ణ సహ దర్శకత్వం, రాజేంద్ర సహకార దర్శకత్వం నిర్వహిస్తున్నారు. "డిసెంబర్, జనవరి, ఫిబ్రవరి నెలల్లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు నిర్మాత జి. సి. కృష్ణంరాజు.

తెలుగు సాంస్కృతిక సంస్థ కళాభారతి (మదరాసు) దశమ వార్షికోత్సవం అక్టోబరు 11న మదరాసు యూనివర్సిటీ హాలులో వైభవంగా జరిగింది. నటరత్న డా॥ ఎన్. టి. రామారావు సభకి అధ్యక్షత వహించగా దర్శకరత్న శ్రీ దాసరి ముఖ్యవక్తగా విచ్చేశారు. తెలుగు సినిమా స్వర్ణోత్సవం, తెలుగు నాటక రంగం శతజయంతిని పురస్కరించుకుని శ్రీయుతులు ఎల్. వి. ప్రసాద్, మిక్కిలినేని, ఆచార్య ఆత్రేయగార్లని సన్మానించారు. సంస్థ అధ్యక్షులు శ్రీ రామమోహనరావు వారిని దుశ్శాలువలతో, పుష్పమాలలతో సన్మానించగా, సంస్థ తరఫున శ్రీ రామారావు వారిని సువర్ణ మరియు రజిత పతకాలతో సత్కరించారు.

నటి జయసుధ లక్కీ డిప్ నిర్వహించగా నటరత్న రామారావు విజేతలకి బహుమతి ప్రదానం చేశారు.

గత దశాబ్దంగా సభ్యులుగా ఉన్నవారిని రజిత పతకాలతో సత్కరించారు.

అనంతరం శ్రీ చక్రవర్తి నిర్వహించిన సంగీత విభావరిలో సుశీల, బాలసుబ్రహ్మణ్యం, శైలజ, ఆనంద్, రమేష్‌లు శ్రోతలకి వీనుల విందు చేశారు.

(బి. వి.)

'నివురు గప్పిన నిప్పు'లో జయప్రద, కృష్ణ





# కోరిక తీరే వేళ

సీరియల్

## విన్నకోట సుశీలాదేవి

మగాడు వయసులో వున్న ఆడపిల్ల కనబడగానే 'నిన్ను ప్రేమిస్తున్నాను, నిన్ను చూడందే వుండలేను, నువ్వు లేనిదే బ్రతకలేను,' అని అనగానే ఆ మాటలు నమ్మేసి తమ సర్వస్వాన్ని అర్పించే పిచ్చిపిల్లలు ఈ దేశంలో చాలామంది వున్నారు.

శారద కూడా అటువంటి పిల్లల్లో ఒక్కతి! శారద జీవితంలో మళ్లీ ఆ సాయంత్రం రాలేదు!

నిరంజన్ కనబడలేదు!

* * *

శారద రాజమండ్రిలో రైలు దిగేసరికి మధ్యాహ్నం రెండు గంటలయింది.

ప్రొద్దున్నెప్పుడో రెండు ఇడ్లీ తిని, కాఫీ త్రాగింది కాని అదెప్పుడో అరిగిపోయింది. నీర్సంతో కళ్లు తిరుగుతున్నాయి! స్టేషన్ దగ్గర్లో వున్న హోటల్ కెళ్లింది! వాష్ బేసిన్ దగ్గర చన్నీళ్లతో ముఖం కడుక్కుని వచ్చి భోజనం చేసింది. కాస్త ప్రాణం తెప్పరిల్లినట్లయింది శారదకి!

బయటికొచ్చి రోడ్డుమీద పోతున్న రిక్షాని పిలిచి —

"హాస్పిటల్‌కి వస్తావా ?" అనడిగింది

**(గత సంచిక తరువాయి)**

"ఏ ఆసిపిటాలండీ ?" రిక్షా అసామీ ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నతో శారదకి పెద్ద అనుమాన మొచ్చింది.

ఈ వూళ్లో ఎన్ని ఆస్పత్రులున్నాయో! అదే అతన్ని అడిగింది.

"అబ్బో! శానా వుండాయండీ!"

శారద ఆలోచించింది!

అప్పుడు తనకి రోజూ చర్చి గంటలు విన్పిస్తుండేవి! నర్సుని అడిగితే – "హాస్పిటల్ ప్రక్కనే పెద్ద చర్చి వుంది ఈ వూళ్లో వున్న చర్చి అదొక్కటే!" అంది.

"అదేనయ్యా! చర్చి ప్రక్కన వున్న హాస్పిటల్!" రిక్షావాడితో చెప్పింది శారద

"అదా! కూసోండి!"

శారద రిక్షా ఎక్కింది.

రిక్షా నెమ్మదిగా సాగుతోంది!

శారద వూరుని ఆసక్తితో చూస్తోంది!

పన్నెండేళ్ల క్రితం.

నిరంజన్ అలా తనని మోసం చేసిపోయాక తనెంత మానసిక వ్యధ అనుభవించిందో ఆ దేవుడికే తెలియాలి!

కొన్ని రోజులకి అమ్మకి తన విషయం తెలిసింది. మొదట తనని తిట్టి, ఏడ్చినా, తర్వాత తన భవిష్యత్తు గూర్చి ఎంతో ఆలోచించింది

తనకప్పుడు అయిదవ నెల రావడంతో ఎబార్షన్‌కి వీలులేకపోయింది.

అప్పుడు అమ్మ రాజమండ్రి దగ్గర వున్న పల్లెటూళ్లో వాళ్ల మేనత్త వుంటే తనని తీసికెళ్లి అక్కడ వుంచి వచ్చింది! ఆవిడ తనని ఎంతో బాగా చూసుకుంది

ఆ తర్వాత తొమ్మిదో నెలలో, నొప్పులు వచ్చినపుడు, తనని ఈ హాస్పిటల్‌కి తీసుకొచ్చారు.

రిక్షా గోతిలో పడి మళ్లీ పైకి లేచింది.

"నీ అమ్మ. రోడ్డు...!" రిక్షా అసామీ తిడుతున్నాడు.

ఆనాడు ఈ వూరు వచ్చేటప్పుడు సగం స్పృహలో వచ్చింది!

ఆ తర్వాత ఇక్కడినుండి వెళ్ళేటప్పుడు, బాబుని వదిలి వెడ్తున్నాననే దుఃఖంలో స్పృహ లేకుండానే వెళ్లింది.

తిరిగి ఇన్నాళ్ల తర్వాత బాబు కోసం వచ్చింది!

తన బాబు ఎలా వున్నాడో! ఏం చదువు తున్నాడో! తను వాడి అమ్మని తెలిస్తే ఏమంటాడు! తన దగ్గిరికి వస్తాడా?

లేక ఇన్నాళ్ళూ వాడిని వదిలి వున్నందుకు తనపై కోపగించుకుంటాడా? ఒకవేళ వాడు కోపగించుకున్నా తను బ్రతిమాలుతుంది!

బాబు ఈ అమ్మని తప్పక క్షమిస్తాడు! క్షమించి — ఈ అమ్మ దగ్గరకు వస్తాడు! తనకా నమ్మకం వుంది.

కాని, బాబు తనతో వస్తానన్నా మరియమ్మ వాడిని పంపకపోతే!

అవును సుమా! ఇందాకట్నించీ తనా విషయమే ఆలోచించలేదు.

మరియమ్మ ఇవ్వనంటే!

ఆ! ఎందుకివ్వదు!

ఎంత డబ్బు కావలిస్తే అంతా ఆవిడ ముఖాన పారేస్తే సరి!

ఆవిడే ఒప్పుకుంటుంది!

తను వెంటనే బాబుని తీసుకుని సాయంత్రం ట్రైయిన్‌లోనే హైద్రాబాద్ వెళ్లిపోతుంది.

తనూ, తన బాబూ ఒకరికొకరై ఏ చీకూ చింతా లేకుండా జీవితం గడుపుతారు!

అబ్బ! ఇంకా ఎంతసేపు! ఈ రిక్షా ఇంత నెమ్మదిగా వెడుతోందే! విసుక్కుంది శారద.

"అమ్మగారూ! వచ్చేశామండీ!"

శారద రిక్షా దిగి, డబ్బులిచ్చి, హ్యాండ్‌బాగ్ పుచ్చుకుని హాస్పిటల్‌వేపు నడిచింది!

గేటు దగ్గిర నిలబడి లోపలికి చూసింది! హాస్పిటల్ ఎంతో మారిపోయినట్లుగా తోచింది!

హాస్పిటల్ అటు ప్రక్క పెద్ద మర్రిచెట్టు వుండేది! తనకి బాగా గుర్తు! ఆ చెట్టుకొమ్మలు తను పడుకున్న గది కిటికీ పైవరకూ వ్యాపించి వుండేవి! సాయంత్రం అయిందంటే చాలు పక్షుల అరుపులతో, రెక్కల చప్పుళ్లతో ఆ ప్రదేశం మారుమోగుతుండేది!

వాటి అరుపులకి బాబు లేస్తాడేమోనని తను గాబరాపడుతూ వాడి వుయ్యాలవేపు చూసేది!

ఏదీ! ఇప్పుడా చెట్టు? ఆ చెట్టుమీది పక్షులు! అవి కట్టుకున్న గూళ్ళు!

రెక్కలురాని పిల్లలు! ఏవయ్యాయో! అనుకుంటూ నెమ్మదిగా గేటు తీసుకుని లోపలకు వెళ్లింది శారద.

మెట్లెక్కి లోపలకు వెళ్లబోయి ఆగింది! చప్పున లోపలకు వెళ్లడానికి ధైర్యం చాలలేదు.

ఇంతలో ఒక నర్సు బయటికొస్తూ కన్పించింది!

శారద ఆవిడ దగ్గరకెళ్లి — "నర్స్!" అంది.

ఆవిడ శారదవేపు తిరిగి 'ఏమిటన్నట్లు' చూసింది!

"ఇక్కడ మరియమ్మనే నర్సు వున్నారా!"



# కోరిక తీరే వేళ

"ఏమో నాకు తెలీదు!" నిర్లక్ష్యంగా చెప్పి తిరిగి చూడకుండా వెళ్లిపోయింది.

శారద తెల్లబోయింది.

ఏంచెయ్యాలా అని అనుకుంటుండగా ఒక వార్డ్‌బోయ్ కన్పించాడు! అతడ్ని పిలిచి అడిగింది

"మరియమ్మ ఏమోగానీ, మేరీ అనే నర్సు వున్నారండీ!" అన్నాడు.

శారద ముఖం విప్పారింది! మరియమ్మనే మేరీ అని పిల్వొచ్చుగదా! ఆవిడే అయివుంటుంది!

"ఆవిడ ఎక్కడున్నారు! బాబూ! కాస్త చూపిస్తావా?" అనడిగింది శారద.

"ఆవిడతో మీకేం పనండీ!" ఎదురు ప్రశ్న వేశాడు.

"ఆవిడ. . ఆవిడ... మా బంధువు!"

శారద కట్టుకున్న తెల్లచీరవేపు, బొట్టులేని ముఖంవేపు చూసి ఏమనుకున్నాడో ఏమోగానీ —

"ఇలా సరాసరి వెళ్లండి! ఎడమ చేతివేపు ఒక గది విడిగా కన్పిస్తుంది! దానిలోనే వున్నారు," అన్నాడు.

ఆ మాటలు వినగానే బాబుని చూసినంత ఆనందం కలిగింది శారదకి!

"చాలా థాంక్స్ బాబూ!" అంటూ గబగబా లోపలికి నడిచింది! అతడు చెప్పిన గది దగ్గిరికి వచ్చి, తడబడుతున్న చేతులతో స్ప్రింగుడోరు తెరిచింది! ఎదురుగా 'మేరీ!' అటువేపు తిరిగి కూర్చుని ఏదో చదువుకుంటోంది.

శారద చిన్నగా దగ్గింది!

ఆవిడ ఇటువేపు తిరిగింది. ఆ నర్సుని చూసి శారద నీరుగారిపోయింది. ఆ నర్సుకి ఇరవై ఏళ్లుంటాయేమో! ముఖంలో ఇంకా పసితనపు ఛాయలు పోలేదు.

"ఎవరు మీరు?"

**జరిగిన కథ — 2:** రకరకాల దొంగతనాలలో ఆరితేరిన ఓ కుర్రాడి మూలంగా భర్త శ్రీధర్, కూతురు బేబీ ఇద్దరూ ఆక్సిడెంట్‌కు గురికాగా ఒంటరిదవుతుంది శారద. తర్వాత పోలీసులు ఆ కుర్రాడ్ని అరెస్ట్ చేస్తారు. 'నీకు ఇంకో పాప వుంటే బావుండేది' అన్న పక్కింటి కమల మాటలకు, గతంలో ఓ నర్సుకు అప్పగించిన తన బాబు కోసం రాజమండ్రి బయలుదేరుతుంది. రైల్లో ఆమె మనసు గతాన్ని తన కళ్ల ముందుంచుతుంది. శారద, నిరంజన్ ఒకర్నొకరు గాఢంగా ప్రేమించుకొని, పెద్దలతో మాట్లాడి పెళ్లి చేసుకోవాలని నిశ్చయించుకొంటారు. తరచూ అతన్ని పార్కులో కలిసే శారద ఈసారి నిరంజన్ అర్థింపుతో అతని గది కెళ్లటానికి నిశ్చయించుకొంటుంది. గది కెళ్లిన శారద నిరంజన్ వత్తిడులకు లొంగిపోతుంది. తరచు ఇద్దరూ తమ కోరికలు తీర్చుకుంటుంటారు. ఫలితంగా శారద గర్భవతి అవుతుంది. త్వరలో పెళ్లి చేసుకుంటానని ఆమెకు హామీ ఇస్తాడు నిరంజన్.

శారద అతికష్టంమీద గొంతు పెగుల్చుకుని - "మీ పేరు మేరీనా?" అనడిగింది. లేదంటుందేమోనని ఆశపడింది.

"అవును ఏం?" అంది నర్స్.

హతాశురాలయింది శారద! ఈ అమ్మాయి మేరీ... ఆనాటికి ఈ అమ్మాయికి పదేళ్లుంటాయేమో!

"ఇక్కడ మేరీ, మరియమ్మ అనే పేరు గల వాళ్లు ఇంకెవరైనా వున్నారా?"

ఆ అమ్మాయి ముఖం చిట్లిస్తూ — "లేరే! ఎందుకూ?" అంది.

శారద పూర్తిగా నిరాశపడిపోయింది! ఇక నిలబడే ఓపికలేనట్లు కుర్చీలో కూలబడింది.

మేరీ శారదవేపు తెల్లబోయి చూసింది!

"కాసిని మంచినీళ్లిస్తారా?" శారద అడిగింది

మేరీ ఒక మూలగా వున్న కూజాలోనుంచి నీళ్ల గాజు గ్లాసులోకి ఒంపి శారద కిచ్చింది.

ఆ చల్లటి నీళ్లు తాగగానే శారద కాస్త తెప్పరిల్లింది.

"మీకు కావల్సింది మేరీనా? మరియమ్మా!" నర్స్ అడిగింది.

"మరియమ్మ! దాదాపు పదేళ్లక్రితం ఇక్కడ పని చేసింది."

"అలాగా! నేను కొత్తగా వచ్చాను. కాని నా ఫ్రెండ్ వనజ చాలా రోజుల్నించీ ఇక్కడ పని చేస్తోంది! ఆవిడకేవన్నా తెలుసేమో?"

శారదకి మళ్లీ ఆశ కలిగింది!

"వనజగారు ఎక్కడున్నారు?"

"ఆవిడకి నైట్ డ్యూటీ! రాత్రికి వస్తుంది!"

"కానీ నేనీ రాత్రికే తిరిగి వెళ్లిపోవాలండీ!" అంది శారద.

"అలాగా! పోనీ వాళ్లింటి అడ్రసు ఇస్తాను వెళ్లండి," అంది మేరీ.

ఆ మాటకి ఆనందపడిపోతూ — "అలాగే! ఇవ్వండి!" అంది శారద.

మేరీ కాగితం, పెన్ను తీసింది.

"కాస్త నన్ను పరిచయం చేస్తూ ఉత్తరం కూడా ఇవ్వండి," అనడిగింది శారద ప్రాధేయపూర్వకంగా!

మేరీ వ్రాసి ఇచ్చింది! అవి తీసుకుని శారద లేచి నిలబడి "థాంక్సండీ! వస్తాను," అని బయటికి వచ్చింది. రిక్షా మాట్లాడుకుని ఎక్కింది.

వనజ ఇల్లు తేలిగ్గానే కనుక్కోగలిగింది!

వాకిట్లో ఇద్దరు పిల్లలు నిలబడి గాలిపటాలు ఎగరేసుకుంటున్నారు. వాళ్ల దగ్గిరకెళ్లి —

"బాబూ! వనజగారని హాస్పిటల్ నర్సు ఎక్కడుంటున్నారో తెలుసా?" అడిగింది శారద.

"అదిగో! ఆ ప్రక్క సందులోంచి వెళ్లండి," అని చూపారు.

శారద అటు వెళ్లింది.

అటుప్రక్క గది తలుపులు తీసేవున్నాయి.

వనజే అనుకుంటూ, బయట కుర్చీలో కూర్చుని తల దువ్వుకుంటోంది.

"వనజగారు మీరేనా?"

ఆవిడ తలెత్తి — "అవును" అంది.

శారద తన చేతిలోని కాగితాన్ని ఆవిడకిచ్చింది







ఆవిడ దాన్ని చదువుకుని, శారదవేపు చూసి — ''కూర్చోండి!'' అంది.

శారద ఈ మర్యాదల్ని పట్టించుకోవడంలేదు! బాబుని చూడాలని ఆరాటపడిపోతోంది!

''మరియమ్మ మీకెలా తెలుసు ?'' వనజ ప్రశ్నించింది.

శారద జరిగిన విషయమంతా క్లుప్తంగా చెప్పింది.

''ఆ కుర్రాడు మీ అబ్బాయా ?''

శారద ఆశ్చర్యంగా చూస్తూ — ''మీరు చూశారా బాబుని'' అనడిగింది.

''ఆ! అదెప్పటి సంగతో! దాదాపు ఎనిమిదేళ్లవుతుందేమో? అప్పుడు నేనిక్కడికి కొత్తగా వచ్చాను! మరియమ్మ ఇంటికి రెండు మూడుసార్లు మాత్రం వెళ్లాను. ఆ తర్వాత ఆవిడకి ఒంట్లో బాగుండక హాస్పిటల్ డ్యూటీ మానేసింది. ఆవిడున్న ప్రదేశం అంత బాగుండదు! నాకు అక్కడికి వెళ్లడం ఇష్టం లేక మానేశాను,'' అంది వనజ.

''బాబు ఎలా వుంటాడు!'' శారద అడిగింది.

''ఎర్రగా, బొద్దుగా చాలా అందంగా వుండేవాడు.''

''అలాగా! ఆవిడిల్లు ఎక్కడో చెప్తారా ?''

''ఆ! వుండండి! ఇప్పుడే వస్తాను,'' అని వనజ లోపలికెళ్లింది.

''బాబు అందంగా వుండేవాట్ట! ఇప్పుడింకా బాగుండివుంటాడు. వాడిని తొందరగా చూస్తే బాగుణ్ణు'' శారద అనుకుంది! ఇంతలో వనజ కాఫీ కప్పుతో తిరిగొచ్చింది.

''తీసుకోండి!''

శారదకి కూడా తలనొప్పిగా వుంది. కప్పు అందుకుంది. వనజ మరియమ్మ ఇంటి అడ్రసు చెప్పింది. కాఫీ త్రాగి శారద లేచి నిలబడింది!

''వెళ్లొస్తానండీ,'' అంది వనజతో.

''బాబుని తీసికెళ్లేటప్పుడు నాకు ఒకసారి చూపించండి! చాలా ఏళ్లయింది బాబుని చూసి!''

''అలాగే! తప్పకుండా.''

శారద మళ్లీ రిక్షా ఎక్కి బయలుదేరింది. కాని మరియమ్మ ఇల్లు తెలుసుకోడానికి చాలాసేపు పట్టింది.

వనజ ఇచ్చిన అడ్రసు ప్రకారం రిక్షా వూరికి ఒక ప్రక్కగా వున్న గుడిసెల దగ్గరికి వచ్చింది.

గుడిసెలు పిచ్చుగూళ్లలా వున్నాయి! వాటి ముందు మురుగుకాలవలు, ఆ కాలవల్లో పందులు స్వేచ్ఛా విహారం చేస్తున్నాయి. ఆ కాలవల ముందు సన్నటి మట్టిరోడ్డు! ఆ మట్టిరోడ్డునిండా పేడా, బురదా. ఆ మట్టిలో కూర్చుని ఆడుకునే పిల్లలు కదిలే అస్థిపంజరాల్లా వున్నారు.

అదంతా చూడగానే శారద శరీరం ఒక్కసారి జలదరించింది. మరియమ్మ వుండేది ఇక్కడా! ... అయితే తన బాబు కూడా ఇక్కడేనా వుండేది? ఈ బురదలో ... తిరుగుతూ, ఆడుకుంటూ! ... కడుపులో దేవినట్లయింది.

''అమ్మగారూ! ఏ ఇల్లండీ!'' రిక్షావాడు అడుగుతున్నాడు.

శారద తల బయటపెట్టి — ''వుండు బాబూ! నాకూ తెలీదు. కనుక్కోవాలి'' అంటూ రోడ్డుమీద పోతున్న ఇద్దరు ముగ్గుర్ని అడిగింది.

కాని వాళ్లు చెప్పలేకపోయారు.

రిక్షావాడు విసుక్కుంటున్నాడు.

శారద ఆ గొణుగుడు భరించలేక రిక్షా దిగి అతనికి డబ్బులిచ్చి పంపేసింది.

ప్రొద్దు పడమటికి వాలిపోతోంది.

ఈపాటికి తిరుగు రైల్లో వుండాలనుకుంది. కాని ఇంతవరకూ తన బాబుని కనీసం కంటితో కూడా చూసుకోలేదు.

రోడ్డుమీదే దృష్టంతా వుంచుకుని, జాగ్రత్తగా నడుస్తోంది శారద. ఆ రోడ్డుమీద కాలు పెట్టడమే చాలా కష్టంగా వుంది.

అదీకాక ఎటు వెళ్లాలో తెలీదు.

ఇంతలో ఇద్దరు ఆడవాళ్లు బిందెలతో నీళ్లు తెచ్చుకుంటూ కన్పించారు. శారద వాళ్లని ఆపి, అడిగింది.

''మరియమ్మా! అంటే నర్సమ్మేనా! ... అదిగో ... ఈ ప్రక్క సందులోని పెంకుటిల్లు. దాని ముందు పంపు వుంటుంది. అదే గుర్తు!''

''అమ్మయ్య!'' అనుకుంది శారద.

ముందుకు నడిచి సందు మలుపు తిరిగింది. ఎదురుగా నీళ్లు పట్టుకునే ఆడవాళ్లు ... వరసాగా పెట్టిన బిందెలు కన్పించాయి కాని పంపు మాత్రం కనబడలేదు.

దగ్గరిగా వచ్చింది.

గజం లోతు గోతిలో వుంది పంపు. గోతినిండా నీళ్లు ... ఆ నీళ్లల్లోనే నిలబడి, బిందె ఆ మురికి నీటిలో పడిపోకుండా వంగుని నీళ్లు పట్టుకుంటున్నారు వాళ్ల అవస్థ చూసి జాలిపడింది శారద.

''పంపు ఎదురుగా పెంకుటిల్లు ... అన్నారు గదా! ఏదీ'' అనుకుంటూ తల త్రిప్పిచూసిన శారదకి ఒక పెద్ద గానుగ చెట్టు, దాని ప్రక్కనే ఒకవేపు ఒరిగిపోయి వున్న పెంకుటిల్లు కనబడింది.

ఇల్లు కన్పించిందనే ఆనందంలో పరిసరాలను గమనించలేదు శారద.

గబగబా ఆ ఇంటివేపు నడిచింది ఆ ఇంటి అరుగుమీద ఒక ముసలావిడ కూర్చుని నులక మంచానికి ముళ్లు వేస్తోంది. ఆవిడని —

''మరియమ్మ ఎక్కడా వుండేది?'' అనడిగింది.

కాని ఆవిడ తలఎత్తి కూడా చూడలేదు.

'ఈవిడకి చెముడా ఏమిటీ ఖర్మ!' అనుకుంది శారద. ఆవిడ నుంచి సమాధానం రాబట్టేసరికి ప్రాణం పోయినంత పనయింది.

ఆవిడ చెప్పిన ప్రకారం ఇంటి వెనక్కివచ్చింది. తలుపులు ఓరగా వేసివున్నాయి. 'అదే మరియమ్మ గది అయి వుంటుంది.' అనుకుంటూ తలుపు నెట్టింది. కిర్రుమని శబ్దం చేస్తూ తలుపులు తెరుచుకున్నాయి.

''ఎవరూ! కన్నమ్మా!''

లోపలినుండి సన్నటిగొంతు విన్పించింది.

శారద లోపలికు వచ్చింది.

గదంతా చీకటి. దానితోపాటు అదోరకమైన గబ్బు వాసనొస్తోంది. కళ్లు ఆ చీకటికి అలవాటు పడ్డానికి అయిదు నిముషాలు పట్టింది.

''కన్నమ్మా! అన్నం తెచ్చావా ?'' ఆ గొంతు మళ్లీ ప్రశ్నించింది. ఆ మాట ఎక్కడ్నించి వస్తోందో శారదకి చప్పున అంతుపట్టలేదు.

గది నాలుగువేపులా చూస్తున్న ఆమెకు ఒక చోట మూలగా ఒక మంచం ... ఆ మంచంలో ఒక మానవాకారం కన్పించింది.

''కన్నమ్మా! మాట్లాడవా ?''

శారద గొంతు సవరించుకుని —

''నేను కన్నమ్మని కానండీ! నా పేరు శారద'' అంది. ఆ మాటతో ఆ ఆకారంలో కొద్దిపాటి చలనం కన్పించింది. ఆ తర్వాత అతి కష్టంమీద ఇటు తిరిగింది. ఆ ఆకారం ఒక స్త్రీది. ఆవిడని చూసి ఝడుసుకుంది శారద. నల్లగా కప్పేసుకుపోయిన ముఖం ... ముందుకు తోసుకొచ్చిన పళ్లు.

''మీరు ...!'' ఆవిడ అడిగింది.

## చాచా నెహ్రూ! మరల మరలిరా!

ప్రేమకు మరో రూపం పిల్లలని
పిల్లలకు ప్రతిరూపం రోజాలని
ప్రేమించావు ధరించావు
పంచశీలను బోధించావు
ప్రేమను పంచమన్నావు
శాంతి పావురాన్ని ఎగురవేసావు
అంతర్జాతీయ శాంతిని సాధించావు
అఖండఖ్యాతిని ఆర్జించావు
పొట్టకోసం పేదలు పాట్లుపడుతుంటే
పదవులకోసం నాయకులు కొట్లాడుకుంటున్నారు
ఉద్యోగంకోసం నిరుద్యోగులు పోటీపడుతుంటే
అధికారంకోసం పార్టీలవారు పాకులాడుతున్నారు
నేతలు మేతలు మేస్తున్నారు
అధికారులు చేతులు చాస్తున్నారు
వ్యాపారస్తులు ధరలు పెంచుతున్నారు
సంఘ విద్రోహులు దోచుకుంటున్నారు
మధ్యతరగతివారు నలిగిపోతున్నారు
అవినీతిపరులు అందలమెక్కుతున్నారు
అశాంతిని సృష్టిస్తున్నారు
నీవు ఆశించిన శాంతి ఎక్కడ ?
పంచమన్న ప్రేమ ఎక్కడ ?
మంచికి చోటు ఎక్కడ ?
అందుకే ఓ శాంతిదూతా !
చాచా నెహ్రూ ! మరల మరలిరా !
మాకు శాంతిని ప్రసాదించు !

—"శ్రీవాణి"

## కోరిక తీరే వేళ

శారదకి వచ్చిన పని జ్ఞాపకం వచ్చింది.

"మరియమ్మ మీరేనా ?"

"అవును !"

"దాదాపు పన్నెండేళ్ల క్రితం ! మా అమ్మ మీకొక బాబునిచ్చింది పెంచుకోడానికి, జ్ఞాపకం వుందా ! నేను ఆ బాబు తల్లిని. వాడిని తీసికెళ్ల డానికి వచ్చాను. నా బాబు ఎక్కడున్నాడు ?" గబగబా అడిగింది.

ఆ మాటలకి ఆ అస్థిపంజరం విపరీతంగా కదిలిపోయింది. ఆ తర్వాత మెల్లగా మూలిగింది

"ఆ బాబు ... !" ఆయాస పడ్తోంది.

"చెప్పండి ! ఏడీ నా బాబు ?"

"మీ బాబు నా దగ్గర లేడమ్మా ! వాడిని డాక్టరుగారికి అమ్మేశాను !"

శారద స్తంభించిపోయింది ! అయిదు నిమిషాల పాటు ఆమె బుర్ర పని చెయ్యడం మానేసింది.

"బాబు ఎంత చక్కగా వుండేవాడో ! పాపిష్టిదాన్ని ! డబ్బు కాసపడ్డాను. బాబుని ఏ క్షణాన అమ్మానో కాని అప్పట్నించీ నాకీ మాయదారి రోగం పట్టుకుంది."

"ఏ డాక్టరుకి అమ్మారు?" నీరసంగా అడిగింది శారద.

"డాక్టరు రాఘవరావు ! హాస్పిటల్లోనే వుండే వారు. ఇప్పుడెక్కడున్నారో ... ?" దగ్గు గొంతులో అడ్డుపడడంతో ఆ తర్వాత మాట్లాడలేకపోయింది మరియమ్మ.

శారద మనస్సు గిజగిజలాడిపోయింది.

బాబుని డాక్టరుకి అమ్మేసిందిట ! ఎంత ధైర్యం ! అయినా ఎవరిచ్చారా అధికారం ! బాబేమన్నా వస్తువా అమ్మడానికి ! ఛీ డబ్బుకి గడ్డి తినే మనుషులు.

క్షణం కూడా అక్కడ వుండాలనిపించలేదు. విసురుగా బయటికొచ్చింది శారద.

మళ్లీ రిక్షా మాట్లాడుకుని వనజ దగ్గరకు వచ్చింది.

వనజ నైట్ డ్యూటీకి తయారవుతోంది. శారదని చూసి —

"ఏడీ బాబు ?" అనడిగింది.

శారద కళ్లల్లో నీళ్లు తిరిగాయి. నిలబడలేక అక్కడున్న కుర్చీలో కూలబడిపోయింది.

"ఏమయిందండీ !" వనజ అడిగింది.

శారద కళ్లు తుడుచుకుని, మరియమ్మ చెప్పిన విషయమంతా వనజతో చెప్పింది.

"డాక్టర్ రాఘవరావుగారా ! ... ఆయనిప్పుడు గుంటూరులో వున్నారు !" అంది వనజ.

గుంటూరా !

మళ్లీ అక్కడకు పోవాలా ! కొద్దిగా నిరాశ పడింది. అయినా తప్పదు. బాబుకోసం ఎక్కడికైనా వెళ్లాలి. ఏదైనా చెయ్యాలి !

"అయితే ! నేను గుంటూరు వెడతానండీ !" అంటూ లేచింది శారద.

"ఇప్పుడా ! ఇంకా నయంలెండి. మీరు గుంటూరు వెళ్లేసరికి అర్థరాత్రవుతుంది. నా మాట విని, ఈ రాత్రికి నా రూములో పడుకుని ప్రొద్దున్నే వెళ్లండి" అంది వనజ. శారదకి అది బాగానే వున్నట్లనిపించింది.

"సరే ! మీ ఇష్టం !" అని వూరుకుంది.

"బాత్‌రూమ్‌లో నీళ్లున్నాయి. వెళ్లి స్నానం చెయ్యండి. భోజనం చేద్దాం. నాకు మళ్లీ డ్యూటీకి టైమవుతోంది."

శారద తన హ్యాండ్ బ్యాగ్‌లోంచి చీర జాకట్టు తీసుకుని బాత్‌రూమ్‌లోకి వెళ్లింది. చల్లని నీళ్లతో స్నానం చేసేసరికి బడలిక అంతా తీరినట్లనిపించింది

వనజా, శారదా భోజనం చేశారు.

"ఇంకాస్సేపట్లో నా ఫ్రెండు లీల వస్తుంది అది ఒక ప్రైవేటు కంపెనీలో పనిచేస్తోంది. మేమిద్దరం ఈ ఇంట్లో వుంటున్నాం. లీల చాలా మంచిది. మీరు హాయిగా నిద్రపోండి. మనసులో ఎటువంటి మొహమాటం పెట్టుకోకండి !"

వనజ బూటు తీసుకుని బిగించుకుంటూ అంది. వనజ ఆదరణకి శారద తబ్బిబ్బు పడ్డది.

"వనజా ! ముక్కూ మొహం తెలీని నన్నింతగా ఆదరిస్తున్నారంటే మీకెలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలీటం లేదు" అంది.

వనజ నవ్వింది.

"ఇందులో నేను చేసిన గొప్ప ఘనకార్యం ఏమీ లేదు. మీరు అనవసరంగా ఆలోచించకండి. మళ్లీ నేను రేపు వుదయం వస్తాను" అని బయటికి నడవబోయింది.

ఇంతలో లీల వచ్చింది.

"సమయానికి వచ్చావు ! రా ! నీకో గెస్టుని పరిచయం చేస్తాను" అని వాళ్లిద్దరికి పరస్పరం పరిచయం చేసి తను వెళ్లిపోయింది.



# మీ చర్మ యవ్వన సౌందర్య రహస్యం, ఇప్పుడు మీ చేతిలోనే వుంది. హిమానీ గ్లిసరిన్ సబ్బు నిర్మలంగా శుద్ధమైనదిగా వుండంటే 60 సంవత్సరముల ఆనువాయితీగా వస్తున్న స్థిరమైనస్థాయి.

పరిశుద్ధమైన గ్లిసరిన్ సబ్బు ఇదే మీ చర్మాన్ని యవ్వనంగా ఉంచుతుంది, చర్మం అరకుండాను, ముడతలు పడకుండా సదా ఉంచుతూ చమ్మను కాపాడుతుంది. ఇంత పరిశుద్ధమైనది మరి ఏ యితర గ్లిసరిన్ సబ్బు దీనిలా లేదు—మృదువైన హిమానీ



ఎక్కువ నురుగుతో హిమానీ మీ ప్రతీ అంగాలలో వున్న మురికిని నిర్మూలించగలదు.

## మీ చర్మాన్ని ఏ విధంగా వుంచాలో అటువంటిదే హిమానీ ఒక స్వచ్ఛమైన పారదర్శకమైన సబ్బు.

ఇప్పుడు మీ పట్టణానికి కూడా వచ్చింది.

గ్యారంటీ

**60** సంవత్సరముల నుండి హిమానీ గ్లిసరిన్ సబ్బు ప్రకృతి శుద్ధమైన నూనెలతో తయారు చేయబడుతుంది ధరలు బాగా హెచ్చింప బడుతున్నాయి అయినా సరే, మరి ఏ యితర గ్లిసరిన్ సబ్బులలా మేం మాత్రము మా సబ్బుల తయారీకి బదులీ నూనెలు వాడటం లేదు.

6957B/I TEL

# ✦ డాక్టర్ సలహాలు ✦

—డాక్టర్ కె. వెంకటేశ్వర రావు

### ఎ. డి. బ్రహ్మానందపురం

నా వయస్సు 26 సం॥లు. నాకు 5 సం॥ల నుండి తలలో చుండ్రు వున్నది. వెంట్రుకలు పెద్ద మొత్తములో వూడిపోవుచున్నవి. ప్రతి మూడురోజుల కొకమారు తలస్నానం చేస్తాము. దువ్వెన శుభ్రంగా వుంచుకుంటాము. వెంట్రుకలు వూడటం తగ్గాలంటే ఏమి చెయ్యాలి ?

★ గత వారాలలో చెప్పిన విధంగా పైపూతగా కెనలాగ్ ఎస్. ఆయింట్‌మెంటు, లోనికి గ్రైసోవిన్ ఎఫ్.పి. మాత్రలు రోజుకి ఆరు వంతున వరుసగా 10 రోజులపాటు వాడవలసి ఉంటుంది. అప్పటికీ తగ్గకపోతే మరలా పదిరోజులు వాడాలి.

దిండుగలీబులు, దుప్పట్లు మొదలయినవి బాగ ఉడకబెట్టి ఉతికి వాడుతూ ఉండాలి. ఒకళ్ళ దువ్వెనలను ఇంకొకరు వాడకూడదు.

### పి. ఆర్ యస్. వైజాగ్

నాకు వారం రోజుల క్రితం వరిబీజము వచ్చినది. ఇది సెక్స్ పరమైన లోపమా ? వివాహ జీవితమునకు నష్టము కలుగజేయునా? ముదిరినచో ప్రమాదము గలదా ?

★ వరిబీజము సెక్స్ పరమైన లోపం కాదు. వరిబీజానికి వివాహ జీవితానికి సంబంధంలేదు. సైజు పెద్దదవటం (మీ భాషలో ముదరటం)వల్ల నడవటానికీ, సైకిల్ తొక్కటానికీ వీలవదు. పాంట్ లోపల చొక్కా వేసుకొని కూర్చోవటానికి కొందరు ఈ వాపు బయటికి కన్పించటంవల్ల ఇబ్బందిగా ఫీలవుతారు.

దీనివల్ల ప్రమాదం అంటూ ఏదీలేదు.

### ఎస్. ఆర్. - విజయవాడ

నా వయస్సు 28 సం॥లు. నాకు చాలా కాలం నుండి పెదవులు ఎండిపోయి తడితగలగానే, ఏమైనా త్రాగినా, స్నానం చేసినా నాని తెల్లగా పైపొరలు రాలిపోతూ వుంటాయి. పెదవులు లావుగా గూడా అయిపోతున్నవి. కోల్డ్ క్రీమ్, గ్లిసరిన్, నెయ్యి ఏమివాడినా ప్రయోజనం లేదు. దీనికి ఏమి చెయ్యాలి ?

★ ఎక్కువగా పైపూతగా మందులు వాడి నందువల్ల ప్రయోజనం ఉండకపోగా ఇంకా ఎక్కువ అయ్యే అవకాశం ఉన్నది.

మల్టీవైటమిన్ మాత్రలు రోజుకి ఆరు వంతున మూడు నెలలపాటు వాడండి. దానితో బాటుగా విటమిన్ "సి" 500 మి.గ్రా. మాత్రలు రోజుకి ఒకటి చొప్పున వరుసగా మూడు నెలల పాటు వాడవలసి ఉంటుంది.

### పి. వి. కె ఆర్. — ఏలూరు

రెండు నెలల క్రితం మా మేనత్త కుమారునికి ప్రసిద్ధ కళ్ళ డాక్టరు శుక్లముకు ఒక కన్ను ఆపరేషన్ చేసినారు. ఆ కన్ను నీరు కారుట ఆరంభించి తర్వాత పోటు ఎక్కువయినది. తిరిగి గుంటూరులో చూపించగా ఆ కన్ను పాడుచేసినారని, గ్రుడ్డు తీసివేయవలసి వున్నదని ఆ గ్రుడ్డు పూర్తిగా తీసివేసినారు. ఇప్పుడు రెండవ కన్ను గూడా చూపు తగ్గినది. అది చూపించగా రెండవ కన్నులో గూడా శుక్లము వున్నదని, ముదిరితేగాని ఆపరేషన్ చేయకూడదని చెప్పినారు. ఇప్పుడు మద్రాస్‌లో వేరే కన్ను గ్రుడ్డు పెట్టుదురని అనుకొనుచున్నారు. అలాటి అవకాశము వున్నదా ? లేనిచో రెండవ కన్ను అయినా బాగుచేయించుకొనుటకు, పరీక్ష చేయించుకొనుటకు మద్రాస్‌లో మంచి డాక్టరుగాని, పెద్ద హాస్పిటల్‌ది గాని అడ్రస్ ఇవ్వ ప్రార్థన.

★ ఒక కన్ను ఇన్‌ఫెక్షన్ వల్ల పాడవగానే రెండో కన్ను కూడా కొద్దిగా వాయటం జరుగుతుంది. దీనిని సింపతెటిక్ ఆఫ్‌తాల్‌మైటిస్ అని అంటారు.

నుంగంబాకంలోని శంకర్ నేత్రాలయంలోగాని, కెతీడ్రల్ రోడ్‌లోని డాక్టర్ అగర్‌వాల్‌గారి "ఐ" రీసెర్చ్ సెంటర్‌లోగాని చూపించండి. ●

---

లీల కూడా స్నానం, భోజనం ముగించి శారద ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుంది.

"మీదేవూరు ?" శారదని ప్రశ్నించింది. చూస్తున్న మేగజైన్‌లోంచి తలెత్తి.

"హైద్రాబాద్" అంది శారద.

"హైద్రాబాద్‌లో తనకు బంధువులున్నట్లు వనజ ఎప్పుడూ చెప్పలేదే !" అంది లీల.

"మేము కాస్త దూరపు బంధువులం లెండి ! మా మధ్య రాకపోకలు అంతగా లేవు."

"అలాగా ఏం పనిమీద ఈ వూరు వచ్చారు?" అనడిగింది లీల.

శారద చెప్పనా ? వద్దా ? అని క్షణంసేపు తటపటాయించింది. తను ఇప్పుడు చెప్పకపోయినా, రేపు వనజ లీలతో ఎలాగూ చెప్తుంది. అబద్ధం చెప్పిందన్న పేరు తనకెందుకు ? అనుకుని తను వచ్చిన పనిని గూర్చి చెప్పింది శారద.

అది విని లీల ఆశ్చర్యపోయింది.

"ఏమిటీ ! పసిగుడ్డుని, కన్నకొడుకుని నర్సుకి అప్పచెప్పి వెళ్ళిపోయారా ! అలా వదిలేస్తుంటే మీకేం బాధ కలగలేదా ?"

లీల అడుగుతుంటే శారద మనస్సు కలుక్కుమంది.

'ఏం బాధ కలగలేదా?' అని ఎంత తేలిగ్గా అంది. బాబుని అలా వదిలివెళ్లాలంటే తన ప్రాణం ఎంత గిలగిలలాడిపోయిందో ఎవరికి తెలుస్తుంది.

అమ్మావాళ్ళు తనని బలవంతంగా తీసికెళ్ళారు.

"పోనీ ! ఆ తర్వాతైనా బాబుని తలుచుకున్నారా ?" లీల మళ్ళీ ప్రశ్నించింది.

శారద దెబ్బతిన్నట్లు చూసింది.

బాబుని తలుచుకోడమా !

అసలు వాడిని మర్చిపోతేగదా !

తను బాబుని వదిలి ఇంటికొచ్చిన మొదటి రోజుల్లో తనకు తిండి సహించేది కాదు. నిద్ర వచ్చేది కాదు.

ప్రతి క్షణం బాబు కళ్లముందు మెదుల్తుండేవాడు. తను కుళ్లి కుళ్లి ఏడుస్తుండేది.

అప్పుడు తనెంత నరకం అనుభవించిందో ఆ దేవుడికే తెలియాలి !

ఒకరోజు ఇక ఆగలేక అమ్మతో అంది —

"అమ్మా ! నేను బాబుని తెచ్చుకుంటాను వాడిని విడిచి వుండలేను "

"నీ బాధ నాకు తెలుసు శారదా ! కానీ ఏం చేయగలం ! మనం అశక్తులం తల్లీ ! నీ తర్వాత ఇంకా తమ్ముళ్ళు, చెల్లెళ్లు వున్నారు. వాళ్ల బ్రతుకులు నీమీదే ఆధారపడి వున్నాయమ్మా ! నువ్వు చిన్నపిల్లవి కాదు ! ఆలోచించు" అంటూ అమ్మ తన నోరు నొక్కేసింది.

"శారదగారూ ! ఏమిటీ ఆలోచిస్తున్నారు. బాబుని గురించేనా ? పెళ్లయ్యాకన్నా బాబుని గూర్చి ఒక్కక్షణం ఇలా ఆలోచించి వున్నా వాడీపాటికి మీ ఇంట్లో వుండే వాడండీ !" లీల అంటోంది.

కానీ అసలు తనకు పెళ్లి చేసుకోవడమే ఇష్టం లేకపోయింది.

తనామాట అనగానే అమ్మ -

"పెళ్లి చేసుకుండా ఎన్నాళ్లిలా వుంటావు శారదా ! ఆడదాని జీవితానికొక ఆధారం వుండాలి ! లేకపోతే ఆ జీవితం కుక్కలు చింపిన విస్తరి అవుతుంది. అదీకాక నువ్విలా మొండికేస్తే మీ నాన్నగారికి అసలు విషయం తెలుస్తుంది. ఆయన కసలే కోపం ఎక్కువ ! మీ నాన్నగారు ఏం చేస్తారో ఏమో తల్లీ ! భయంగ వుంది. అంతే కాదమ్మా నీ తర్వాత వున్న పసివాళ్ల భవిష్యత్తు కూడా నీ చేతుల్లోనే వుంది" అంటూ మళ్లీ తన నోరు నొక్కేసింది.

సంవత్సరం తిరక్కుండానే శ్రీధర్‌తో తన పెళ్లి జరిగిపోయింది.

శ్రీధర్‌తో హైద్రాబాద్ వెళ్లేముందు అమ్మ తన దగ్గరికొచ్చి -

"శారదా ! శ్రీధర్ చాలా మంచివాడమ్మా ! నీ అదృష్టం కొద్దీ నీకు భర్తగా లభించాడు. అతడి మంచితనాన్ని ఆసరాగా తీసుకుని బాబు విషయం చెప్పకు. నీ జీవితం నాశనం చేసుకోకు" అంటూ తన వద్ద నుంచి మాట తీసుకుంది.

తను శ్రీధర్‌తో కాపురానికెళ్లిపోయింది.

(ఇంకా వుంది)

# కాఫీ రుచిని అధికంచేసే క్రొత్త తయారీ విధానము
# కాఫీ తాజాతనాన్ని అధికంగా సంరక్షించే క్రొత్త ప్యాకెట్

# క్రొత్త బ్రూక్ బాండ్ గ్రీన్ లేబిల్




ఇప్పుడు బ్రూక్‌బాండ్ వారు ఉపయోగిస్తున్న క్రొత్తతయారీ విధానంవల్ల క్రొత్త గ్రీన్‌లేబిల్ కాఫీ రుచి ఇదివరకు కంటే చాలా అమోఘంగా వుంటుంది. అంతేకాదు బ్రూక్‌బాండ్ వారిచే ప్రథమంగా ప్రవేశపెట్టబడిన క్రొత్త 'కీప్-ఫ్రెష్' ప్యాకెట్ కాఫీపొడి అప్పుడే వేయించిన కాఫీపొడిలాగ చెమ్మ ఎక్కకుండా వారాలకొద్దీ ఎప్పటికప్పుడే తాజాగా వుంటుంది.

## క్రొత్త గ్రీన్ లేబిల్

**అమోఘమైన రుచి విశిష్టమైన తాజాతనము**
**(ఇది బ్రూక్‌బాండ్ వారు మాత్రమే చేయగలరు)**

ఎన్నిక చేసిన కొన్ని పట్టణములలో మాత్రం లభించును.

# హైదరాబాద్ నోట్ బుక్

### ప్రేక్షకులకు అర్థమైన కళా ప్రదర్శనం :

భారత కళాపరిషత్తు కళాభవన్‌లో అక్టోబర్ 20 నుంచి 24 వరకు నిర్వహించిన పదకొండవ అఖిలభారత లలితకళా ప్రదర్శనంలో ఉన్న 74 చిత్ర శిల్పాలు చాలవరకు ప్రేక్షకులకు కూడా అర్థమయాయి. బంగారు పతకం పొందిన షవుట్ (కేక) చిత్రం ఆధునికంగా ఉన్నా, కేక ఎంత బలమైనదో సామాన్యునికి కూడతెలియ చేస్తుంది. 300 రూపాయల బహుమానం పొందిన అహల్యాసంక్రందనీయం, సముద్రమథనం, దేబీప్రతిమ, కుగ్రామం (శ్రీ పి.వి. నరసింహారావు కుమార్తె శ్రీమతి ఎస్. వాణి) ఎన్నిక, ప్రశంస శీయమైన యోగ్యతా పత్రం పొందిన పది చిత్రాల ఎన్నిక సముచితమనే ఎవరైనా చెప్పగలరు. ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించి మాజీ మంత్రి శ్రీ మూర్తిరాజు తమ ప్రసంగంలో ప్రజలు కళాకారులను ప్రోత్సహించాలన్నారు. స్వాగతం పలికిన భారత కళాపరిషత్తు ఉపాధ్యక్షులు శ్రీ డి.వీరమణి కళాకారులకు గృహ వసతి అవసరమని అలాటి కాలనీకి ప్రభుత్వం పూనుకోనాలని కోరారు. ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేసిన రాష్ట్ర గృహ నిర్మాణ శాఖామంత్రి శ్రీకె. సత్యనారాయణరాజు తమ ప్రసంగంలో కళాకారుల గృహ నిర్మాణ పథకానికి తోడ్పడుతానని హామీ యిచ్చారు. బహుమాన గ్రహీతలలో ఒకరైన శ్రీ చింతామణి వ్యాస్ కృతజ్ఞత తెలుపుతూ, ఆధునిక చిత్రకళకు పితామహుడు దక్షిణ భారతం వాడయిన రాజా రవివర్మ అని, వేడు రాజులు, మహారాజులు లేరుగనుక ప్రజా నాయకులు, మంత్రులుకళను ప్రోత్సహించాలని కోరారు. శ్రీ మూర్తిరాజు వంటి వారు పది మంది వుంటే కళ వ్యాప్తి చెందుతుందనిఅన్నారు బహుమానాలకు కళా ఖండాలను శ్రీయుత వజ్జ శ్రీనివాసశర్మ, డి. వీరమణి, మామిడిపూడి కృష్ణమూర్తి గల సంఘం ఎంపిక చేసింది.

### ప్రతిపక్షాల ఉమ్మడి పథకం :

రాష్ట్ర లోక్‌దళ్ పార్టీ అధ్యక్షుడు శ్రీ గౌతు లచ్చన్న ఆధ్వర్యంలో అక్టోబర్ 15 న ప్రతిపక్ష నాయకులు సమావేశమై ప్రభుత్వం అవలంబిస్తున్న ప్రజా వ్యతిరేక విధానా ప్రతిఘటనకు ప్రజలను సమాయత్త పరచడానికి ఉమ్మడికార్యాచరణ పథకం సిద్ధ పరచాలని నిర్ణయించారు. ఈ సమావేశానికి భారతీయ జనతాపార్టీ, సి. పి. ఎం. రిపబ్లికన్ పార్టీ, మజ్లిస్ ఇత్తెహాదుల్‌ముస్లిమీన్, కాంగ్రెస్ ఎస్, లోక్‌దళ్, జనతాపార్టీల రాష్ట్ర నాయకులు హాజరయ్యారు. సి.పి.ఐ. నాయకులు హాజరు కాలేదు. ఈ సమావేశం రాష్ట్ర పరిస్థితి, ప్రజల సమస్యలను, వాటిని పరిష్కరించడానికి అనుసరించదగు చర్యలను గురించి చర్చించింది. ధరల పెరుగుదల, వ్యవసాయోత్పత్తులకు తగిన ధరలు లేక పోవడం, పాలన యంత్రాంగం వైఫల్యం, పెరిగిపోతున్న అవినీతి, మితిమీరుతున్న నేరాలు, శాంతిభద్రతలు క్షీణత మున్నగునవి కుణ్ణంగా చర్చించబడ్డాయి.



అక్టోబరు మూడవవారంలో భారత చిత్ర కళా పరిషత్తు నిర్వహించిన కళాప్రదర్శనలో బంగారు పతకం పొందిన "కేక".
చిత్ర రచన : డి. బి. బేలే

### అడుగులోనే హంసపాదు !

సంస్కృతంలో కర్ణాటక కలహ : అనే సామెత ఉంది. అది మన తునితగవు సామెత వంటిది. ఈ రెండింటిని మించిపోయింది కాంగ్రెస్ (ఐ) వ్యవహారం. దాని కబంధ హస్తాల్లో పడిపోయారు పాపం శ్రీ కోన ప్రభాకరరావు. రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షుడు కాగానే, ఆయన రాష్ట్ర కాంగ్రెస్ సంస్థను చాకి రేవుకు చేరుద్దామని బయలుదేరారు.. అడుగులోనే హంసపాదయింది. విజ్ఞాయుతీపరుడు, సేవా పరాయణుడు, పాత కాంగ్రెస్ కాలంలో క్రమ శిక్షణ చర్యల ప్రభావం పరిశీలించినవాడు కనుక, సంస్థను దానిలా గాచేద్దామనుకొని సబ్బుబిళ్ల చేత బట్టాడు. అగ్ర నాయకులు పాత నాయకులలాగ రాష్ట్రంలోని సంస్థా నాయకుల మాట దక్కిస్తారని నమ్మాడు ఆయన. కాని దేన్నో నమ్ముకొని నట్టేట దిగినట్టయింది పాపం ! పాలక పక్షంలో క్రమ శిక్షణ గాని, శిక్షణగాని లేదని, వాటి కోసం తల పెడితే చేతులూ, ఒళ్లూ కాలుతాయని ఆయన ఇదివరకే గ్రహించి ఉంటారు.

### ఉపశ్రుతి :

తనను గద్దె దింపడానికి విదేశీ హస్తాలు పని చేస్తున్నాయని ముఖ్యమంత్రి అంటున్నారుగదా, దీనిలోని ఆంతర్యమేమిటి? అని అడిగారు ఒకరు నన్ను. రాష్ట్ర జనతాపార్టీ అధ్యక్షుడు శ్రీ పి.వి. చలపతిరావు చెప్పనే చెప్పేరుగా విదేశీహస్తం అంటే, విదేశాంగశాఖ మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు హస్తమేమోనని — అన్నారు మా సంభాషణ వింటున్న మరొకరు.

—తిరుమల రామచంద్ర



భారత చిత్రకళాపరిషత్తు నిర్వహించిన కళాప్రదర్శనలో బహుమతి పొందిన 6 చిత్రాలలో ఒకటైన "కుగ్రామం". చిత్రకారిణి శ్రీమతి ఎస్. వాణి.



ఎక్కడ
లైఫ్‌బాయ్
ఉన్నదో అక్కడ
ఆరోగ్యము ఉన్నది
లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానం చేస్తే మీకు పరిశుభ్రంగా ఉంటుంది. తాజాగా, హాయిగా వుంటారు. లైఫ్‌బాయ్ వాడకం మీకు ఆరోగ్య ప్రదమైనది. జ్ఞాపకం వుంచుకోండి.
లైఫ్‌బాయ్
మురికిలో గల క్రిములను
కడిగి వేస్తుంది
LIFEBUOY
for health
LIFEBUOY
SOAP

## ప్రశ్నావళి  —కె. రామలక్ష్మి

**డి. డి కె — నిడదవోలు**

రేడియో వార్తలు చదివేటప్పుడు మీరు ఈ వార్తలు ఆకాశవాణి నుండి వింటున్నారు అని ఎందుకంటారు ?

★ ఆకాశవాణి ఫలానా దేశమని తెలియడానికే కాదు, మధ్యలో పెట్టుకు వినేవాళ్లకి తెలియడానికి కూడా — యీ హెచ్చరిక పారేస్తూవుంటారు. (మరిచిపోయారా మన రేడియో వార్తలు విదేశాల్లో కూడా వింటారు — తెలుగు వార్తలు అర్థం అవుతాయో లేదో నేను చెప్పలేను!)

**కె ఎస్ ఎమ్ — సికింద్రాబాదు**

ప్రాణస్నేహితుడని... అన్నీ చెప్పుకున్నాను...

★ అంతే — తమ రహస్యం చెప్పుకున్న వ్యక్తికి తమ స్వేచ్ఛను అమ్ముకున్నట్టేనని తెలిసిందా ? !

**సోదరుడు — అక్కపల్లి**

అది నా చదువుకునే రోజులు. ఒకమ్మాయితో స్నేహం అయింది. ఆ పరిచయం ప్రేమగా ఆమె భావించుకుంది. నాకు ఆ వుద్దేశ్యం లేదు ...

★ కథ మామూలే. దేశం జ్యోతి మరణంతో సెన్సిటివ్‌గా తయారైంది ప్రేమ అంటే. దయ చేసి ఉద్దేశ్యాలు తెలియచేస్తూ స్నేహం చేయడం బాగుంటుంది.

**ఎస్. ఏ. డి డి. — అరసవల్లి**

మీరు సూర్యాకాంతాన్ని హీరోయిన్‌గా చేసి పురుషజాతిని దుమ్మెదులిపే సంచలనాత్మకమైన చిత్రం తీస్తే చూడలని వుంది.

★ ఆ వేషానికి సూరేకాంతం కంటే మీరే సరిపడేటట్టున్నారు దుర్గాదేవి ? అయినా — నా ధ్యేయం — మగాళ్లని దుమ్ము దులపడం కాదు — మార్చడం—దండప్రయోగం కంటే నూరిపొయ్యడం శాశ్వత ఫలితాలకి దారి. వినలేదా — దెప్పిపొడవడం— పౌరుషాన్నీ, సాధింపు ఆలోచననీ రేకెత్తిస్తుందని.

**డి. వి ఆర్. — హైదరాబాదు**

కోపం ... కట్టలు తెంచుకుంటూంటే ఏం చేయాలి ?

★ దగ్గిరున్న కత్తి తీసే బదులు; కాస్త ఆలస్యం చేయాలి. కోపం కూడా తాగుడు నిషా లాంటిదే — దిగిపోడానికి వ్యవధి కావాలి.

**వై ఎల్ ఎస్ ఆర్. — ప్రొద్దుటూరు**

అందరి రాతలు రాసేవాడా దేవుడు; ఆడదాని రాత రాసేది — మగవాడు. మరి ...

★ చిత్తం. తమరేకదా — మగవారు ! మీ జన్మే ఆడదాని చేతి భిక్ష.

**పి ఎస్. ఆర్. కొలనుపాక**

మూగవారిని చూసి హేళన చేస్తారు. మరి ఎందుకో వివరిస్తారా ? మీరేం చేస్తారు ?

★ నేవింకా అంత సినీ జీవినైపోలేదు - అంగవికలులని కామెడీ అనుకుందుకు ! సాటి మనిషి కష్టం అర్థం చేసుకోడానికి తగిన మానవత్వం మిగుల్చుకు బ్రతకాలని ప్రయత్నిస్తున్న దాన్ని నేను అంచేత ఇలాంటివి చూసి నవ్వే వాళ్లలో నన్ను జతచేయకండి

**పి. ఎస్ - కుప్పం**

కె. రా. గానేగాని కేరాఫ్ అనని మిమ్మల్ని పొగిడినప్పుడల్లా అగ్గి అయిపోతూంటాడు నా తమ్ముడు. పైగా పాపం ఆరుద్ర అంటాడు.

★ పాపం ! తండ్రిచాటు బిడ్డ మీ తమ్ముడు ! కోప్పడకండి — కొందరు మగవాళ్లకి వయసొస్తుందే గాని — వయోజనునిగా పరిగణించలేం. అలాంటి కేసు మీ తమ్ముడిది ! ! ఆరుద్రగారికేం బాధలేదు. ఇలాంటివాళ్ల జాలితో పనిలేదు. భార్య తమ "తాలూకు" గానే — గుర్తింపబడాలిగాని వ్యక్తిగా గుర్తించబడడం సహించలేని—సంకుచిత మనస్తత్వం లేని వ్యక్తి — నా భర్త. ఐయామ్ ప్రౌడ్ ఆఫ్ హిమ్.

# వారఫలం

## 20-11-1981 శుక్రవారం మొదలు
## 26-11-1981 గురువారం వరకు

మేషం : ఈ వారంలో ముఖ్య గ్రహ చలనం వలన మీకు యోగదాయకమే. గురుమహాదశజరిగే వారికి మేలున్నది. ధనాదాయంగల వారం. అప్రయత్నంగా ధనం గడింపనున్నారు. పత్రిక, రచన, కళా సాహిత్య వ్యాసంగాల వారికి అనుకూలం. స్త్రీలకు : శుభ కార్యానుకూలత, వృత్తిలో ప్రగతి, ఉద్యోగం భాసించడం జరుగుతుంది.

వృషభం : ఆదాయం చెప్ప వీలున్నది. అప్పులు వసూలయ్యే మార్గమున్నది. అధికారుల ఆదరణ గలదు. ఆశించిన వ్యవహారాలలో అనుకూలత చెప్పదగిన వారం. స్త్రీలకు: ఉద్యోగ వృత్తులందు సర్వానుకూలత, కొందరకు ప్రమోషన్లు చెప్ప వీలున్నది. దైవ కార్యాచరణమునకుఅనుకూలతగలదు.

మిథునం : పరిపాలనాదక్షులకు మేలున్నది. పుణ్య కార్యాచరణానికి, శుభ కార్యాలోచనలకు ఉత్తమ వారమే. ఒకానొక విషయంలో మీకు పరిష్కార మార్గమున్నది. శ్రద్ధాసక్తులతో ప్రతి వ్యవహారం నెరవేర్చుకోవాలి. స్త్రీలకు : ఉద్యోగానుకూలత కొందరకు, దూర ప్రయాణాలు చేయుటకు అవకాశమున్నది.

కర్కాటకం : గ్రహించండి. కళా రంగంలో మీకు అనుకూలత ఏర్పడగలదు. ధనాదాయానికి క్రయ విక్రయాలకు, నూతన వస్తు సేకరణకు, నూతన విషయాలు తెలిసికొనుటకు, నూతన మిత్రులను కలిసికొనుటకు అవకాశమున్నది. స్త్రీలకు : వస్తు వాహనాలు సమకూర్చుకొనుటకు, వస్త్ర సేకరణకు, బంధుగోష్ఠికి అనుకూలతగల వారమే.

సింహం : యత్న కార్యసిద్ధి గలదు. ప్రణాళికానుసారం కార్యానుకూలత, వ్యాపారం అభివృద్ధి చేసే కార్యక్రమం చేపట్టడం, భూములో, గృహమో కొనుగోలు చేయ యత్నించడం, అధికారుల వలన మన్నన కనిపిస్తుంది. స్త్రీలకు : ఒకానొక విషయంలో అభివృద్ధి, ఉన్నతోద్యోగ ప్రాప్తి, శాంతి, గృహానందం సమకూడనున్నదని గ్రహించాలి.

కన్య : దూర ప్రాంతానికి పోయి ఉద్యోగం, చేయవలసి వస్తుంది. అనేక విషయాలు గ్రహించే మార్గమున్నది. అయిన వారితో పొడ సూపిన గొడవలు, కుటుంబంలో చెలరేగినఅనానుకూలత క్రమంగా సమసిపోయే మార్గమున్నది. స్త్రీలకు: సంతానం వలన ఆనందం, బంధు ప్రీతి, వస్త్ర సేకరణకు అవకాశం, కొందరకు ఉద్యోగమందభివృద్ధి చెప్పదగిన వారం.

తుల : మీ రాశికి ఇంకా శని బాధ. వ్యయం కారణంగాకలుగనున్నది. రాకపోకల్లోఎంత జాగరూకత వహిస్తే అంత మేలు. ప్రయాణం చేసే అవకాశముంటుంది. గాని చాల మంది ముగించుకోవడం అవసరం, శ్రేయోదాయకం. వ్యాపార లోపం లేదు. ఉద్యోగ వృత్తులందు స్వల్పంగాఅనుకూలత చేకూరగలదు.

వృశ్చికం : ఆదాయం అందిపుచ్చుకొన్నట్లు సంభవం. ఇంకా కొన్ని మాసాల వరకు మీకు సత్ఫలితములుండగలవని చెప్పతగియున్నది. ఏమైనా మనస్పర్థలు పోయి ఉంటే, వాని ఉనికి తెలిసికొంటారు. వ్యాపారం అభివృద్ధి చెందే మార్గమున్నది. స్త్రీలకు ప్రత్యేకంగా ఉద్యోగంలో అభివృద్ధికరమైన మార్పులు రానున్నవని గ్రహించాలి.

ధనుస్సు : సులభంగా జరుగవలసినపనులకు అంతరాయం ఏర్పడగలదు. ఆహార విహారాదులలో జాగరూకత వహించాలి. కుల దేవతా పూజ, ధర్మ కార్యానుసరణలు చెప్పదగిన అంశాలు. విందు వినోదాలతో కాలం వ్యయించనున్నారు. స్త్రీలకు :కుటుంబానందం, ఆరోగ్యాభివృద్ధి, ధనలబ్ధి గల వారం.

మకరం : నూతన విషయ సేకరణకు, నూతన వస్తు సేకరణకు, సభా కార్యక్రమంలో పాల్గొనుటకు, సర్వానుకూలతగల వారం. మీతో సహకరించి, అన్ని విధాలా మేలు చేయగల వారుంటారు అలాంటి వారి సహకారాన్నందుకోండి. స్త్రీలకు : కళాసాహిత్య రంగాలలో అవకాశం. గాయనీమణులకు సదవకాశాలు. అప్రయత్న ధనలబ్ధికి అవకాశాలుండగలవు. ఆరోగ్య లోపంలేదు.

కుంభం : దూర ప్రాంతాల నుండి, వ్యాపార విషయంగా అనుకూల వారం. వ్యాపారంలో నూతన ప్రయోగాలు చేయనున్నారు. పుణ్య కార్యాలోచనలు చేయగలరు. చిత్ర రంగంలోకంట్రాక్టు వ్యవహారాలలో అనుభవమున్న వారికి మేలు గలదు. స్త్రీలకు: ఉత్తమ వారం, యత్న కార్యసిద్ధి, ఉన్నత విద్యానుకూలత కూడి రాగలదు.

మీనం: ఆరోగ్యం బాగుంటుంది. అందుచేత వృత్తి ఉద్యోగాలలో మేలు చేకూరనున్నది. భూముల విషయంలో అనుకూలత, ఒకానొక విషయంలో మధ్యవర్తిత్వపరిష్కారం, కార్యానుకూలత, అనుకోకుండా ఆదాయం సంభవించుట ఇత్యాది ఫలితాలుండగలవు. స్త్రీలకు : అవసరాలకు కావలసినంత ధనం అందడం, వృత్తియందు ప్రగతి సాధ్యమయ్యేవారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# యురేకా!

పి. ప్రమీలాదేవి



బస్‌స్టాండులో అనంతపూరు నుండి హైదరాబాదుకు వెళ్ళే బస్సు కదలడానికి సిద్ధంగా వుంది. అఫీషియల్ డ్యూటీమీద అనంతపూరుకు వచ్చాను నేను. వచ్చినపని పిసమెత్తు కూడా ముందుకు కదలలేదు. మాటు వేసిన వేటగాడికి ఏ జంతువూ దొరకకుండా, వేట ముగించాల్సివస్తే ఎలా వుంటుందో, నాకూ కూడా అంతే విసుగ్గా వుంది. వారం రోజుల శ్రమా వ్యర్థమయింది.

శ్యామలనూ, పాపనూ విడిచి వారం అయిపోయింది. ఎప్పుడెప్పుడు వెళ్ళి వాళ్ళను చూద్దామా అని వుంది.

కదలబోతుండగా, ఎలాగోలా సందు చేసుకుని బస్ ఎక్కేశాను. టికెట్‌ను ముందే బుక్ చేసుకోవడం వల్ల ఇబ్బందేమి లేకపోయింది. ఇప్పట్లో బస్సే కాని, రైలేగాని, ఎక్కడ నుంచి ఎక్కడికి వెళ్ళాలన్నా, 'రిజర్వేషను' లేకపోతే ఇహ ఆ చావు పగవాడికి కూడా వద్దనిపిస్తుంది.

రాత్రి అవడంవల్ల బస్‌లో డిమ్‌లైట్లు వేశారు. ఆ మసకలైట్ల వెలుతురులో రాత్రిపూట బస్సు ప్రయాణం నాకెంతో ఇష్టం. పగటిపూట ప్రయాణంలోలాగా ఎటువంటి చీకాకులూ వుండవు. పక్క సీట్ల వాళ్ళ కాలక్షేపానికి వాళ వాగుడుతో మన ప్రాణాలు తీయరు. హాయిగా మన లోకంలో మనం వుండవచ్చు. కాని నా ప్రక్కన కూర్చున్న నడివయసాయన గురక ప్రాణాంతకంగా వుండి, నాకు కంటిమీద కునుకు రాకుండా చేసింది.

నేను వచ్చినపని నా బుర్రను పురుగులా తొలుస్తోంది; 'మత్తు పదార్థాలు' పదేళ్ళ క్రితం అన్నింటా ముందంజ వేసిన గొప్ప దేశాల సమస్య అయితే, ఇప్పుడు ఆ సమస్య ఇండియాలో కూడా అంటు వ్యాధిలా వ్యాపించిపోయింది.

మత్తు పదార్థాలకు అలవాటు పడినవారి సంఖ్య నానాటికీ పెరిగిపోతోంది. వాటికి లోబడి ఎందరు యువకులు చెడిపోతున్నారో లెక్కలు తీయడం నాపని కాదుకాని, వాటిని ఒకచోట నుండి మరొక చోటుకు దొంగ రవాణా చేసే 'నార్కోటిక్ స్మగులర్స్'ని పట్టుకోవడం నా పని. సి. బి. ఐ. లో చాలా చాకచక్యంగా పనులు చేయగలవనే పేరు నాకుంది. అందువల్లనే భార్యాబిడ్డల్ని వదిలి 'నార్కోటిక్స్' వేటలో పడాల్సి వచ్చింది.

ఇండియాలో ఓపియమ్‌ను లీగల్‌గా 'మెడికల్' పర్పస్‌కు తయారు చేస్తున్నారుగాని హెషిష్, మార్ఫిన్, హెరాయిన్, మార్జియూనా వంటి మత్తు పదార్థాలన్నీ ఒక దేశం నుండి, మరొక దేశానికి దొంగ రవాణా చేయడానికి ఇండియా మంచి రహదారి అయింది.

'ది గోల్డెన్ ట్రయాంగిల్' అనబడే బర్మా, లావోస్, థాయిలాండు దేశాల నుండి, నేపాలు మీదుగా, ఢిల్లీ నగరానికి కిలోలకొద్దీ మత్తుపదార్థం దిగుమతి అవుతోంది. 'ది గోల్డెన్ క్రిసెంట్' అనబడే ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్‌ల నుండి ఇండియాకు చేరే మత్తుపదార్థాలు కూడా తక్కువేంకాదు. సాలీనా, కొన్ని కోట్ల రూపాయల ఖరీదుచేసే ఈ మత్తు పదార్థాలు ఢిల్లీనుండి యూరప్, ఆసియాదేశాలకీ, సౌదీ అరేబియా, గల్ఫ్ కంట్రీస్‌కీ మూడో కంటికి తెలియకుండా దిగుమతి అయిపోతున్నాయి.

రాను రాను ఈ దొంగ రవాణాలో మార్పిడికి కీలకస్థానం ఇండియా అయి కూర్చుంది. మన గవర్నమెంటు సాలీనా ఐదుకోట్ల రూపాయలను ఈ మత్తు పదా





## యురేకా !

ర్మాల ఉత్పత్తి నెదుర్కోవడానికి ఖర్చు పెడుతున్నా, ఫలితం చాలా తక్కువగా వుంది. అందుకు మన రాజ్యాంగంలో గల లొసుగులను మెచ్చుకోవాలి. ఇరాను, సౌత్ ఈస్ట్ ఏషియాలో మత్తు పదార్థాల రవాణాను క్షమించరాని నేరం కింద భావించి, దానికి మరణదండనే సరైన శిక్షగా నిర్ణయిస్తే, ఇండియాలో మేము రాత్రనకా, పగలనకా తిరిగి నానాగడ్డి కరిచి పట్టుకున్న నేరస్థులని 'ఆరునెలల జైలు, మూడువేలు జరిమానా' అంటూ వారిని "మళ్ళీ మళ్ళీ దొంగరవాణాలు చేయండర్రా, ప్రపంచాన్ని మత్తులో ముంచెయ్యండర్రా" అంటూ మన గవర్నమెంటు ఝామ్మని వదిలేస్తోంది. దాదాపు మూడుకిలోల మత్తు పదార్థం ఖరీదు విదేశాలలో ఒక కోటి రూపాయలు. ఈ మత్తు పదార్థాలను పై దేశాలకు చేరవేస్తే, వాళ్ళు సంపాదించగల్గే కోట్ల రూపాయలలో, పట్టుబడితే మన ప్రభుత్వం వేసే జరిమానా ఏపాటి ?

అందుకే ఒక్కోసారి ఈ బుద్ధిలేని పద్ధతుల క్రింద పనిచేసేకన్న, ఏ పల్లెటూర్లో పోయి పొలం దున్నుకు బతకడం మేలనిపిస్తుంది.

ఈ మత్తుమందు రవాణాలకు ఏ చోటని వెదకడం ? ఎక్కడని చూడటం ? 'ఇందు గలదందు లేదని సందేహము వలదు' లాగా కాలికి వేసుకునే బూట్లలో, గిటారు వాయిద్యాలలో, అప్పుడప్పుడు టిఫెను కారేజిలలో, కొండొకచో ఫారిను కు పంపబడే లావుపాటి బైండింగ్ పుస్తకాల అట్టలలో ఒకచోట అనేది లేదు. ఒకసారి ఇండియా నుండి ఎగుమతి అవుతున్న జీడిమామిడి పండును, పాకేజి నుండి తీసి యధాలాపంగా తుంచి చూస్తే, దాని లోపల హాషిష్ దర్శనమిచ్చింది. ఇంత తెలిసిన మేమే ఆశ్చర్యపోయాం దాన్ని చూసి.

ఈ గాడిద చాకిరీ అంతా చేసి, అసలు దొంగల్ని ఆరునెలల శిక్షతో వదిలేశారని విన్నప్పుడు ఒక్కోసారి ఆవేశంతో, ఈ పోలీసు ఆఫీసరయ్యేబదులు, నేనే ఆ దొంగ వెధవనయి వుంటే ఈ పాటికి వుండవు గదా అనిపిస్తుంటుంది. ఈ దేశంలో దొంగలకు దోపిడీ దారులకు వున్నవిలువ కష్టపడి పనిచేసేవారికీ, నిజాయితీపరులకీ లేదుగదా !?

# జుట్టు అసలు ఎందుకు ఊడుతుందని ?



జుట్టుపైన ప్రకృతిలోని చాలా వాటి ప్రభావం పడుతుంది. మారే ఋతువులు, మార్పే వాతావరణం, ఎండ, చెమట్లు, అస్వస్థత, ఆందోళన, కుళాయి నీళ్ళలో కలిసిన క్లోరిన్ ఇవి సరే. జుట్టు వూడి, రాలి పోవడానికి వీటన్నిటి కన్న ముఖ్యమైన కారణం, దానికి సరియైన ప్రమాణంలో పోషణ అందక పోవడం. మరి వచ్చే చిక్కేమిటంటే, ఏకు బజార్లో ఎక్కువగా దొరికే కేశ సంరక్షణ కోసం వాడే నూనెలు శుద్ధమైనవి కాకపోవడం దాంతోటే, ఆధునిక నాగరికత మోజులో పడి ప్రకృతి సహజమైన నూనెలపైన విముఖత పెరగటంతో యిది మరీ చిక్కు సమస్య అయింది.

**కొబ్బరినూనె తర తరాల నుంచీ, అంటే మీ అమ్మగారి, వాళ్ళమ్మగారి, వాళ్ళ అమ్మమ్మ గారి అందమైన తలకట్టు, జుట్టులోని కీలకం.**



తరాలనుంచీ స్త్రీలు శుద్ధమైన, తాజా కొబ్బరి నూనె వాడి ఒత్తయిన జుట్టు పెంచుకుంటూ, ఆ జుట్టు ఊడి పోకుండా కాపాడు కుంటూన్నారు.

అసలు కొబ్బరినూనె పరిశుద్ధత, తాజాదనం ఋజువు చేసుకోడానికి 3 ఉపాయాలు:



మీరు వాడే కొబ్బరి నూనెను పారాచూట్ కొబ్బరి నూనెతో పోల్చి చూడటానికి తేలికైన 3 పరీక్షలని చెయ్యండి.

1. చూడండి, ఆ నూనె పారదర్శకమై అటూ యిటూ కనిపించేలా ఉండాలి.
2. వాసన చూడండి. ఇది పాచి వాసన లేకుండా తాజాగా సరియైన వాసనతో ఉండాలి.
3. ఈ నూనె సరిగ్గా, ఆగకుండా, సహజంగా పారగలిగి ఉండాలి.

మరి మీ జుట్టుకు యీ పరీక్షలకి నిలవ గలిగిన శుద్ధమైన తాజాదనంగల కొబ్బరి నూనెనె రాసుకోండి.

## పారాచూట్

కొబ్బరి నూనె—
నూనెల్లో సర్వోత్తమం, ప్రకృతి సహజత్వం, పరిశుద్ధత, తాజాదనం, వీటి సంగమం.

స్వచ్ఛంగా, తాజాగా, సువాసనతో, బలాన్నిచ్చే వాటితో నిండినది.

SIMOES/80/3/80A TL

## యురేకా !

ఎక్కడో ఢిల్లీలో రవాణాలేమోగాని వాటి ప్రభావం సౌత్‌లో కూడా పడింది. ఆంధ్ర ప్రదేశ్‌లో కూడా ఈ మధ్య విరివిగా, చిల్లర చిల్లరగా ఈ మత్తు పదార్థాలు దొరకడం, అమ్మేవారు చాలా అరుదుగా పట్టుబడటం జరుగుతోంది. హైదరాబాదులో అయితే సరేసరి. కొందరు యువకులు బాగానే వీటికి అలవాటు పడుతున్నారు అతి చిన్న పాన్ షాపులో కూడా ఇవి సిగరెట్లుగానూ, చిన్న చిన్న మాత్రలుగానూ అమ్ముతున్నారు. కాని మేము గమనించి పట్టుకోబోతే- అంతా హూష్ కాకీ. అమ్మేవారూ దొరకరు, కొనేవారూ దొరకరు - అంతా గప్‌చిప్.

హైదాబాదు నుండి కర్నూలు, కడప, అనంతపూరుకు రవాణా జరుగుతున్నట్లు వార్తలు అందాయి. దాని వెనక వున్న మనుషులు చిన్నముఠానో, పెద్దముఠానో, పరపతి కల్గినవారో, లేనివారో తెలిసి చావడం లేదు.

ఇంటర్నేషనల్ లెవల్‌లో జరిగే అక్రమ రవాణాల వెనక కోట్లాధికారులు వున్నారు. పట్టుబడిన తమ అనుచరులను అంతమొందించడం కూడా వారికి చాలా సులువైన పనే. విదేశాలలో లానే ఈ మధ్య మన దేశంలో కూడా 'డ్రగ్ రాకెట్స్'లో పనిచేసేవారిని హత్య చేయడం సామాన్యం అయిపోయింది.

రాయలసీమ ప్రాంతంలో ఇటువంటి రాకెట్‌లో పనిచేసేవారి ఆచూకి తీయడమే, నా అనంతపూరు ప్రయాణానికి కారణం.

బస్ డ్రైవర్ సడన్ బ్రేకు వేయడంతో నా ఆలోచనలకు కూడా బ్రేకు పడింది. తోచీ తోచక చూట్టూ వారిని పరిశీలిస్తున్నాను. నా ప్రక్క వరుస సీటులో దాదాపు పాతికేళ్ల జవ్వని కూర్చుని వుంది. ఆమెకూడా నాలాగే నిద్రపోవటంలేదు. భావి జీవితాన్ని గురించి కలలు కంటోందో ఏమోమరి ! ఆ డిమ్ లైట్ల వెలుగులో, చాలా నాజూకుగా అప్సరసలా వుంది. బస్ ఎక్కగానే ఆమె కంఠం వినే భాగ్యం కూడా కలిగింది. నాకు ప్రక్కనున్న లావుపాటి పిన్నిగారి యక్ష ప్రశ్నలకూ జవాబులు చెబుతోంది. ఆ యక్ష ప్రశ్నలలోనే ఆమెకు పెళ్లి కాలేదనీ, హైదరాబాదులో ఉద్యోగం చేస్తోందనీ అర్థం అయింది నాకు.

ప్చ్! నాకు దిగులేసింది. ఎంతయినా మగ

బుద్ధి! నాకేగనుక పెళ్ళి కాకుండా వుంటే ఆ అమ్మాయితో కొంత ప్లైవ్‌పాస్ అయ్యేది కదా హైదరాబాదులో, అనుకున్నాను. ఇప్పుడలాంటి ఆలోచన రావడం తప్పేంకాదు, పాపం కూడాను. నేనో పాపకు తండ్రిని కూడా అయ్యాను. నా ఆలోచనకు నాకే నవ్వొచ్చింది.

అలా ఆమెను చూస్తుంటే నాలేళ్ళ క్రితం బస్ ప్రయాణం అనుకోకుండా గుర్తు వచ్చింది. ఆరోజు కూడా బస్ ప్రయాణంలో ఇలానే ఒక కలకంఠి తారసపడింది. అదృష్టం కొద్దీ ఆమెదీ నా ప్రక్కసీటే. అప్పుడు నాకే నీతిసూత్రాలూ అడ్డులేవు. అప్పట్లో నేను ఉద్యోగం, సద్యోగం లేని బ్రహ్మచారి గాడిని. ఉద్యోగం వేటలో ఏదో ఇంటర్వ్యూ కోసం అనంతపురం వెళ్ళాల్సి వచ్చింది. ఆమెతో కబుర్లు, నవ్వుల కలబోతలు, నాకా ప్రయాణం చేసినట్లే లేదు ఆమె నవ్వినపుడు తళుక్కుమనే పలువరసలో అందాన్ని మాసేందుకు, పెదవి విరుపులో మెరుపుకు మైమరచేందుకు కేతిగాడిలా ఎన్నెన్ని వేషాలు వేశానో; ఎన్నెన్ని జోకులు జోకానో. ఏమిటో ఆ వయసుకది పిచ్చి. ఇప్పుడు తల్చుకుంటే నవ్వొస్తోంది.

ఆమె పేరు గుర్తులేదు. రమోలానో, నీలానో. మొత్తానికి మూడక్షరాలే. కర్నూలులో బస్ ఆగగానే, అక్కడ తనకేదో పనుందని, నన్ను సాయం రమ్మని కోరింది. మా బస్సు అరగంటపైనే ఆగుతుంది. అంచేత, కాలక్షేపంగా కూడా వుంటుందని పెద్ద మొగధీరుడిలా ఆమెకు ఎస్కార్ట్ వెళ్ళాను. నాకిప్పటికీ ఆ ఇల్లు బాగా జ్ఞాపకం. అలా కొండారెడ్డి బురుజుమీదుగా మెయిన్‌రోడ్డు మీదనుంచి కుడిచేతివేపు తిరిగితే, ఆ ప్రక్కనున్న ఏదో చిన్న సందులో చివరి ఇల్లు.

అర్ధరాత్రి ... రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది. నా ప్రక్కన ఎవరో తెలియని ఆమె, ఆమె ప్రక్కనే నేను కలిసి నడవడంలో, ఆ చీకట్లో, ఆ తెలియని వూళ్ళో, ఆ థ్రిల్ అనుభవించవలసిందేకాని, చెప్పేందుకు భాషలేదు.

మేం వెళ్ళి ఇంటిముందు ఆగాక, ఆమె తలుపు తట్టగానే ఒకతను వచ్చి తలుపు తీశాడు నా వంక అదోలా చూడడంతో నేను బయటే నిలబడ్డాను. ఆమె లోపలికి వెళ్ళి హాండుబాగు తెరవడం, అతను ఇచ్చిన నోట్ల కట్టలను బాగ్‌లో వేసుకోవటం నాకు బయట నుండి స్పష్టంగా కన్పించింది.

బయట నుంచుని యథాలాపంగా నేమ్ ప్లేటు చదివాను. 'మృత్యుంజయరావు, మెడికల్ రిప్రజంటేటివ్' అని వుంది. అతనితో ఆ అర్ధరాత్రి ప్రయాణంలో ఆమెకేం పనో? మనిషి చూస్తే చదువు – సంస్కారం వున్నదానిలా వుంది. అల్లరి చిల్లరి మనిషనుకోవడానికి మనసు ఒప్పలేదు. పాత బాకీ వసూలా? లేక అవసరానికి తెలిసిన వారి వద్ద అప్పా? అతను ఆమెకు బంధువా? స్నేహితుడా?

కొన్ని గంటలపాటి పరిచయంతోనే, ఏది అడగటానికైనా, సభ్యత అడ్డొచ్చింది. ఆమె మటుకు వెళ్ళేటప్పుడు ఎలా చిరునవ్వులు వెదజల్లిందో, గల గల పారే సెలఏరులా ఎలా మాట్లాడిందో, అలానే వుంది. ఆమె తీసుకొన్న నోట్లకట్టల గురించి ఏమైనా చెప్తుందేమో అని చూశాను. వూహూ. ఆమె స్వవిషయాలు నాతో చర్చించాల్సిన అవసరం ఆమెకు లేకపోవడం న్యాయమే. మొత్తానికి వచ్చేటప్పుడు అర్థంలేని సందేహాలు, అర్థంకాని కుతూహలం నా మెదడుని తొలిచేశాయి. ఆమెతో నా పరిచయాన్ని హైద్రాబాద్‌కు చేరాక పొడిగించాలను కున్నాను. కాని హైద్రాబాదు డిపో చేరగానే ఆమె నాకో చిరునవ్వు విసిరేసి, ఓ గుడ్‌బై చెప్పేసి, అటుగా వచ్చిన ఆటో ఎక్కి మాయం అయిపోయింది.

నాకు ఆడపిల్లల్లో ఈ పిరికి మనస్తత్వం చూస్తేనే చిరాకు. ఏ ప్రయాణంలోనో కలసిన అబ్బాయితో స్నేహం చేస్తారు. తీరా, వారు వుండే వూరికి చేరేసరికి, ఎప్పటికీ వెంటపడతారనుకుంటారో ఏమో, మళ్ళీ మొహం చూడక పారిపోతారు కలసి తిరిగితే, ఏ అన్నో, అక్కో చూస్తారని భయం గావున్ను.

బస్ ఒక్క కుదుపుతో ఆగేసరికి, పాత జ్ఞాపకాల నుండి బయట పడ్డాను. బస్సు కర్నూలు డిపోలో ఆగింది; చాయి కుర్రాళ్ళు, సోడాల కుర్రాళ్ళు బస్సును చుట్టుముట్టారు. అర్ధరాత్రయినా, పెళ్ళివారిల్లులా సందడి సందడిగా వుంది డిపో.

ప్రక్కసీటు కలహంస హేండుబాగు నందుకుని వయ్యారంగా బస్సు దిగింది. ఆమె వెనుకే నేనూ దిగాను. కూర్చుని కూర్చుని కాళ్ళు లాగుతున్నాయి ప్రక్కనే ఉన్న పాన్ షాపులో ఫిల్టర్‌టిప్ కొని ఒకటి అంటించి, నా చూపులు కలహంసను వదిలి రానంటుంటే అటే చూస్తూ నిలుచున్నాను. ఆమె చురుగ్గా, చక చక నడుస్తూ మెయిన్‌రోడ్డు మీదుగా కొండారెడ్డి బురుజు వేపు వెళ్తోంది.

పరధ్యానంగా అటే చూస్తున్న నన్ను షాపువాడు అడుగుతున్నాడు–



# సేతువు – తీతువు

మృత్యువు
ఈ జన్మకు
పునర్జన్మకు
సేతువు!
ఆత్మీయు లకు
అనంత తీతువు
శాస్త్రజ్ఞులకు
ప్రకృతి హేతువు.

— యస్. యస్ రెడ్డి



# యురేకా!

"సార్! స్పెషల్ సిగరెట్లు కావాలా?"

అర్థంగాక నేను అయోమయంగా చూశాను.

"టేబిలెట్లు కూడా వున్నాయి సార్" రహస్యంగా అన్నాడు.

నలిగిపోయిన స్లాకు, నేవీ బ్లూ కలరు పాంటు, ఒడలిపోయిన మొఖం, నా అవతారం చూసి నేనో పోలీసు ఆఫీసరునని వాడు అనుకొని వుండడు పాపం!

అనంతపూరు — హైద్రాబాదు బస్సు. అర్థరాత్రి ... చురుకైన అమ్మాయి ... కొండారెడ్డి బురుజు పక్కన ఇల్లు ... మెడికల్ రిప్రజెంటేటివ్ ... నోట్ల కట్టలు, హోండుబాగు, ఆరోజు ... ఈరోజు — యురేకా!

నా బుర్రలో ఫ్లాష్ వెలిగింది.

ఆ నాడు నేను కాలేజి నుండి వచ్చిన మొద్దబ్బాయిని. ఈరోజు, విన్నో విధాలుగా ట్రెయినింగ్ అయి వున్న బాధ్యతగల సి.బి.ఐ. ఆఫీసర్ని.

షాపువాడిదేముంది? వాడు వంటింటి కుందేలు. అసలు వాళ్లను పట్టుకోవాలి.

చుట్టూ నావేపు వింతగా చూస్తున్న జనాన్ని పట్టించుకోకుండా, మరోక్షణం వృథాచేయకుండా రోడ్డుమీదకు కొండారెడ్డి బురుజావేపుగా పరుగెత్తాను.



సంపూర్ణ ఆరోగ్యానికి 3000 ఏండ్లనుంచి ప్రఖ్యాతిపొందిన

# డాబర్ చ్యవనప్రాశ
# కుటుంబ ఆరోగ్యాన్ని నాలుగువిధాలుగా మెరుగుపరుస్తుంది.



సి విటమిను
సంపన్నంగా
ఉండి తీపి
పులుపుల
చక్కటి రుచితో
సహజ రూపంలో
లభించే మిశ్రమం

**1. శరీర కణాలను నిత్యం యవ్వనంలో ఉంచుతుంది.**
డాబర్ చ్యవనప్రాశ శరీర కణాలు అరిగి, తరిగిపోయే ప్రక్రియ వేగాన్ని తగ్గిస్తుంది.

**2. శరీర రోగ నివారణ శక్తి పెంచుతుంది.**
డాబర్ చ్యవనప్రాశ మొత్తం శరీర రోగ నివారణ శక్తి పెంచుతుంది. దగ్గు, రొంప నివారణకు కూడా మంచిది.

**3. చురుకుదనం పెంచుతుంది.**
డాబర్ చ్యవనప్రాశ పిల్లలలో చురుకుదనం పెంచుతుంది వృద్ధాప్యంలో మానసిక, శారీరక శక్తులను పెంచుతుంది.

**4. జీవకణ నిర్మాణ శక్తి.**
డాబర్ చ్యవనప్రాశ శరీరం సక్రమంగా పెరిగి, దారుఢ్యంగా ఉంచుకోడంలో తోడ్పడుతుంది.

## దేవతల వంటకం
3000 ఏండ్ల క్రితం, చ్యవనుడనే ఋషి తన యవ్వనాన్ని తిరిగి పొందేందుకు, దేవతల వైద్యులు ఆయనను చ్యవనప్రాశ వాడమన్నట్టు చెబుతారు. ప్రపంచంలోని ప్రాచీన టానిక్ అయిన చ్యవనప్రాశను, ఇప్పుడు డాబర్‌వారు ఆధునికంగా, రుచిగా, తయారు చేస్తున్నారు.

ఆరోగ్య సంరక్షణకు ఆయుర్వేద ఔషధం డాబర్ చ్యవనప్రాశ

# డాబర్ చ్యవనప్రాశ

అన్ని మందుల దుకాణాల్లోనూ, కెమిస్టులవద్దా లభిస్తుంది.

5577 Tel

# ఆంధ్రప్రదేశ్ లో ఒక సంవత్సరంలో సాధించిన అభివృద్ధి


శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధాన మంత్రి)

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి మార్గదర్శకత్వంలో ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య ఆంధ్రప్రదేశ్ ప్రజలకు సేవచేయడంలో ఒక సంవత్సరం పూర్తి చేశారు. ఆయన నాయకత్వంలో మన రాష్ట్రం అన్ని రంగాలలో సర్వతోముఖాభివృద్ధిని సాధిస్తూ ముందడుగు వేస్తోంది. శ్రీ టి. అంజయ్య అధికారం స్వీకరించిన ఈ సంవత్సర కాలంలో ఆయన చేసిన అనేక హామీలను అమలు జరపడం మాత్రమే గాక అనేక రంగాలలో అమోఘమైన అభివృద్ధిని కూడా సాధించారు. వాటిలో కొన్ని ఇక్కడ వివరించబడినాయి.


శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

## రైతుల సంక్షేమం :

* రు. [illegible] కోట్ల మేరకు బకాయిల తకావీ రుణాలను మాఫీ చేశారు.
* 10 ఎకరాల మెట్ట లేదా 5 ఎకరాల మాగాణి భూమికి మించకుండా ఉన్న కమతందార్లను భూమిశిస్తు నుంచి మినహాయించారు.
* సహకార సంఘాలు పంపిణీచేసే రుణాలలో 75 శాతానికి తక్కువ కాకుండా రుణాలను సన్నకారు రైతులు, లాభసాటిగాని రైతులకు మంజూరు చేయాలని ఉత్తర్వులు జారీ చేశారు.

## స్థానిక సంస్థలకు ఎన్నికలు :

* దశాబ్దానికి పైగా తర్వాత గ్రామ పంచాయితీలకు సమితులకు శాంతియుతంగా ప్రత్యక్ష ఎన్నికలు నిర్వహించారు.
* ప్రప్రథమంగా 18 సంవత్సరాలకు పైబడి వయస్సుగల యువజనులకు వోటు హక్కు కల్పించారు.
* పంచాయితీరాజ సంస్థలలోనూ, మున్సిపాలిటీలలోనూ ప్రప్రథమంగా షెడ్యూలు కులాల, షెడ్యూలు తెగలకు రిజర్వేషన్లు కల్పించారు.
* రాష్ట్రంలోని మున్సిపాలిటీలకు, విజయవాడ, విశాఖపట్టణం మున్సిపల్ కార్పొరేషన్లకు శాంతియుతంగా ఎన్నికలను నిర్వహించారు. ఈసంస్థలలో షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలకు రిజర్వేషన్లు కల్పించారు.

## నూతన పథకాలు :

* పంటల భీమా పథకం, ఉపాధి హామీ పథకం, మున్సిపల్ ప్రాంతాలలో గుడిసెల అగ్నిప్రమాద భీమా పథకం ప్రవేశపెట్టారు.

## సాంఘిక సంక్షేమం :

* గుడిసెల నిర్మాణ గ్రాంటును రు. 400 నుంచి రు. 1000 లకు పెంచారు.
* ప్రస్తుతం భోజన వసతి సౌకర్యాలతో ఉన్న షెడ్యూలు కులాలకు చెందిన 1504 ప్రభుత్వ హాస్టళ్లకు తోడు 1981—82 లో ఒక్కొక్క దానిలో 100 మంది అభ్యర్థులతో కొత్తగా 100 హాస్టళ్లను ప్రారంభిస్తున్నారు.
* 38,000 మంది అభ్యర్థులతో ప్రస్తుతం ఉన్న వెనుకబడిన తరగతులకు చెందిన 445 హాస్టళ్లకు తోడు అదనంగా ఈ సంవత్సరం 2500 మంది అభ్యర్థులతో మరో 50 వెనుకబడిన తరగతుల హాస్టళ్లను ప్రారంభిస్తున్నారు.

## వికలాంగుల సంక్షేమం :

* వికలాంగులకు నెలకు 30 రూపాయల చొప్పున నిరుద్యోగ భృతి కల్పిస్తున్నారు.
* వికలాంగుల నిమిత్తం ఒక ప్రత్యేక కార్పొరేషన్‌ను ఏర్పాటు చేశారు.

## పౌర సరఫరాలు :

* పౌర పంపిణ పద్ధతిని క్రమబద్ధం చేయడానికి వీలుగా అత్యవసర వస్తువుల కార్పొరేషన్‌ను ఏర్పాటు చేశారు.

## పరిశ్రమలు :

* 1981 జులై నెల నుంచి సింగరేణి బొగ్గు గనులలో ప్రతినెలా రికార్డుస్థాయిలో 10 లక్షల టన్నుల బొగ్గు ఉత్పత్తి చేస్తున్నారు. మన రాష్ట్రంలో పరిశ్రమలు, మొదలైన వాటి అభివృద్ధికి వీలుగా విదేశాల్లోని తెలుగు వారి విదేశీమారక ద్రవ్యార్జనలను క్రమబద్ధం చేయడానికి నివాసేతర భారతీయుల పెట్టుబడి కార్పొరేషన్‌ను ఏర్పాటు చేశారు.
* ఆంధ్రప్రదేశ్ చేతివృత్తుల అభివృద్ధి కార్పొరేషన్‌ను ఏర్పాటు చేశారు.

# ★ వంటలు ★

## ఎగ్ బ్రెడ్ టోస్ట్

కావలసినవి : ఆరు బ్రెడ్ స్లైసులు, నాలుగు ఎగ్‌లు, తగినంత ఉప్పు, కారం, కొద్దిగా జీలకర్ర.

చేయు విధము : ఎగ్స్ కొట్టి గిన్నెలోవేసి ఉప్పు, కారం, జీలకర్ర కూడా వేసి బాగా చిలకొట్టాలి. బ్రెడ్ స్లైసులని త్రికోణంగా గాని మధ్యకి కాని కోసి చిల కొట్టిన ఎగ్‌లో ముంచి తారమీద నెయ్యి వేసి రెండు వైపులా లేత ఎరుపుగా వేయించు కోవాలి. ఇవి ప్రొద్దుట బ్రేక్‌ఫాస్ట్‌కి బాగుం టాయి. వేడిగా తినాలి.

— మాగంటి రాణి

## కంద కట్‌లెట్‌లు

కావలసిన వస్తువులు : కంద — ½ కె.జి., ఉల్లిపాయలు— 2, పుట్నాలపప్పు - 100గ్రా, కొత్తిమీర — 1 కట్ట.

చేయు విధము : కంద చెక్కుతీసి తరిగి సన్నముక్కలు కోయవలెను. ఉల్లిపాయలు సన్నగ తరగవలెను. కంద ముక్కలు, ఉల్లి పాయ ముక్కలు కలిపి గిన్నెలోవేసి కొద్దిగా నీరుపోసి తగుమాత్రము ఉప్పు, కారం వేసి కంద ఉడికి నీరంత ఇగిరేదాకా స్టౌమీద ఉంచి దింపవలెను. పుట్నాల పప్పు మెత్తగా పొడి చేసుకుని, కంద, ఉల్లిపాయ ముక్కలు రోటిలో వేసి మెత్తగా రుబ్బుకొని, పుట్నాల పప్పుపొడి కంద ముద్ద రెండిని బాగా కలిపి ఒక గిన్నెలో పెట్టుకొనవలెను. బాణలిలో నూనె పోసి కాగిన పిదప మనకు అవసర మయిన సైజులో కట్లెట్లను తయారుచేసు కొని నూనెలో వేసి ఎర్రగా వేపి తీయవలెను. కంద కట్లెట్లను పెనము మీద కూడా వేయించుకొనవచ్చును.

— మాదిరెడ్డి లక్ష్మి

## మనవి

**ఉత్తరాలు రాసేవారు**

* పూర్తిగా తెలుగు లిపిలోనే రాయాలనీ,
* వారి పేరు, పూర్తి చిరునామా కూడా రాయాలనీ,

మనవి చేసుకుంటున్నాము:

— సంపాదకుడు



# అవీ - ఇవీ - అన్నీ

### నెఫ్జా నాటక పోటీలు

నెల్లూరు ఫిలిం జర్నలిస్ట్స్ అసోసియేషన్ ఆధ్వర్యంలో 1982 ఫిబ్రవరి 2వ వారం నెఫ్జా నాటక కళా పరిషత్తు 18వ వార్షికోత్సవ సందర్భంగా నెల్లూరులో భారీ ఎత్తున నాటక, నాటిక, ఏకపాత్రాభినయ పోటీలు రాష్ట్ర స్థాయిలో జరుగుతాయి. ప్రవాసాంధ్రులు కూడా వీటిలో పాల్గొనవచ్చు. సినిమా ప్రముఖుల పర్యవేక్షణలో పోటీలు నిర్వహించబడతాయి. దరఖాస్తులు నవంబరు 25వ తేదీలోగా అందాలి. వివరాలకు : సెక్రెటరీ, నెఫ్జా నాటక కళా పరిషత్, లీలామహల్ దగ్గర, నెల్లూరు అన్న చిరునామాకి రాయాలి.

### నాటిక పోటీలు

శ్రీ జి. ఎస్. ఆర్. మూర్తి మెమోరియల్ నాటక పరిషత్ ఆధ్వర్యములో విజయవాడలో జనవరి 23, 24 25, 26 తేదీలలో అఖిలభారతస్థాయిలో నాటిక, ఏకపాత్ర పోటీలు జరుగుతాయి.

పాల్గొనగోరువారు దరఖాస్తు పత్రములను నవంబరు 21లోగా కార్యదర్శి, శ్రీ జి. ఎస్. ఆర్. మూర్తి మెమోరియల్ నాటక పరిషత్, కేరాఫ్. స్వదేశీ ఖాదీ భాండార్, ఏలూరు రోడ్డు, విజయవాడకు రాయవచ్చు.

### రామదాసు

పద్యకావ్యం. రచన శ్రీమతి చక్రవర్తుల లక్ష్మీనరసమ్మ. 72 పేజీలు. వెల రు. 5. ప్రతులకు పొడిచేటి వీరరాఘవాచార్యులు, శ్రీరామాలయం అర్చకులు, భద్రాచలం, ఖమ్మంజిల్లా.

### గుడ్‌మార్నింగ్

శ్రీ రావి రంగారావు మినీ కవితా సంపుటి. వెల రు. 8 రూపాయలు. ప్రతులకు రచయిత పేర తెలుగు లెక్చరర్, ఆంధ్ర జాతీయ బోధనా కళాశాల, మచిలీపట్టణంకి రాయాలి.

### కోళ్ల వ్యాధులు

వ్యాధిచికిత్స— నివారణ, రచన: డా. ఆర్. శ్రీనివాసరావు, డా. పి. శ్రీరాములు. 134 పేజీలు, వెల : 12 రూపాయలు. ప్రచురణ : రమా ఎంటర్‌ప్రైజస్, పబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2.

### వాసవాంబికా శతకము

రచన శ్రీ సింగిసెట్టి సంజీవరావు. 22 పేజీలు. వెల తెలియదు. ప్రతులకు శ్రీ అంధరపు వేంకటరావు, శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానం, జయపూర్, ఒరిస్సా.

### రాధాకృష్ణ

రచన: శ్రీగోపావజ్ఝలకృష్ణమూర్తి కవి(గురుశ్రీ) 34 పేజీలు. వెల : తెలియదు. ప్రతులకు: శ్రీమతి గోపావజ్ఝల రామలక్ష్మి, ఆచంట [ప. గో. జిల్లా]

### చరిత్ర ఎందుకు చదవాలి ?

రచన : శ్రీయుతులు కనకబండి మోహనరావు, బండి శోభనాచలం, 16 పేజీలు, వెల : 50 పైసలు, ప్రచురణ: శ్రీ శారదా విద్యా నికేతన్, సత్తుపల్లి, ఖమ్మంజిల్లా.

### దివ్య దీపం

గేయ సంపుటి. రచన శ్రీ ఎం. కృష్ణారెడ్డి 80 పేజీలు. వెల 6 రూపాయలు. ప్రతులకు రచయిత పేర 2-2-1075 / 12 పి, బాగ అంబర్‌పేట, హైదరాబాదు— 13 లేక నవయుగ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సుల్తాన్‌బజారు, హైదరాబాదు—1.

### బారిస్టర్ పార్వతీశం

నవల. మూడు భాగాలు. రచన శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి, బొమ్మలు శ్రీ బాపు.

మొదటి భాగం : 174 పేజీలు, వెల 12 రూపాయలు.

రెండవ భాగం : 286 పేజీలు, వెల 15 రూపాయలు.

మూడవ భాగం : 274 పేజీలు, వెల 15 రూపాయలు.

ప్రతులకు : న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్ ఏలూరు రోడ్డు, విజయవాడ—2.

### నీటి దీపాలు

కథా సంకలనం. రచన శ్రీ కె. సభా, చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘంవారు కీ. శే. శ్రీ కె. సభాగారి దివ్యస్మృతికి ప్రచురించిన ఈ పుస్తకంలో మొత్తం 15 కథలున్నాయి. 196 పేజీలు, వెల : పదిరూపాయలు, ప్రతులకు చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘం. చిత్తూరు.

### ప్రతీకారం

ఏకాంకి— నాటిక, రచన డా. త్రిపురనేని వెంకటేశ్వరరావు, 36 పేజీలు వెల తెలియదు ప్రతులకు, కవిరాజ సాహిత్యవిహారము, గుడివాడ

### వర్కో హాలిక్

కథల సంపుటి. రచన 'అవలోకిత' 144 పేజీలు వెల 9 రూపాయలు, ప్రచురణ; కాంతికుంజ తెనాలి—522201.


**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna**